ప్రకృతి ఫలరసం-
తాజా సోమరసం








# చతుర ప్రపంచం





## షిప్ హైజాకింగ్

విమానాల్ని 'హైజాక్'చేయడం ఈమధ్య సాధారణ విషయమైపోయింది. కానీ ఓడలను కూడా హైజాక్ చేసిన ఘనత నలుగురు పాలస్తీనా గెరిల్లాలకు దక్కింది. 23వేల టన్నుల 'అకిల్లరో' అనే నౌక, 755మంది ప్రయాణీకులతో మధ్యధరా సముద్రంలో ప్రయాణిస్తుండగా ఈ సంఘటన జరిగింది. ప్రయాణీకుల్లో చాలామంది అమెరికా, బ్రిటన్లకు చెందిన పర్యాటకులు!

స్విమ్మింగ్‌పూల్ మొదలుకొని బాల్‌రూమ్ డాన్సుకు పనికివచ్చే పెద్దపెద్ద హాల్స్‌తో అన్ని సౌకర్యాలువున్న ఈ నౌక ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నౌకాశ్రయం వరకూ క్షేమంగానే వచ్చింది. ప్రయాణీకులలో 666మంది అక్కడ దిగిపోయి కైరోచుట్టుపట్ల చూడవలసిన ప్రదేశాలన్నీ చూసి తిరిగి ఈజిప్టులోని 'సయిద్‌పోర్ట్'లో నౌకను చేరుకోవాలని నిర్ణయించుకొని అక్కడ దిగిపోయారు. ఆ తరువాతే ఈ 'హైజాకింగ్' డ్రామా మొదలయింది.

అప్పటిదాకా నౌకలో ఎక్కడో దాక్కున్న నలుగురు పాలస్తీనా గెరిల్లాలు బయటికి వచ్చి కెప్టెన్‌కు తుపాకీ గురిపెట్టి నౌకను 'హైజాక్' చేస్తున్నామన్నారు. ఇజ్రాయిల్ జైళ్ళలో ఉన్న వారి స్నేహితులు యాభైమందిని విడుదల చేసేదాకా నౌక తమ అధీనంలోనేవుంటుందన్నారు. దుండగులు బ్రిటిష్ పర్యాటకుల నుండీ అమెరికా దేశస్థులను వేరుచేసి వారి మధ్య పెట్రోలు పీపాలను పడవేశారు. వారు చెప్పినట్లు చెయ్యకపోతే ఆ పెట్రోలు పీపాలకు చిల్లుచేసి నిప్పంటించేస్తామని బెదిరించారు. ఈ సంగతి అమెరికా ప్రభుత్వానికి తెలిసిన వెంటనే తమతో స్నేహసంబంధాలుగల సిరియా, సైప్రస్ దేశాలవారిని హైజాక్ చేయబడిన నౌక వారి దేశాలలోని నౌకాశ్రయాలలో నిలవటానికి అనుమతించరాదని కోరింది. దాంతో ఆనౌక తిరిగి ఈజిప్టులోని నౌకాశ్రయానికే వెళ్ళవలసివచ్చింది. దారిలో తమ ప్రయత్నమెంత తీవ్రంగా ఉందో తెలియజేయటానికి హైజాకర్లు అమెరికాకు చెందిన డెబ్బైఏళ్ళ 'క్లింకోఫర్' అనే పారిశ్రామికవేత్తను అతని భార్యముందే కాల్చిచంపి సముద్రంలో పడవేశారు. నిర్దోషియైన ఒకవ్యక్తిని ఆవిధంగా చంపటం అమెరికా దేశస్థులందరినీ దిగ్భ్రాంతులను చేసింది.





సయుద్‌పోర్ట్‌లో 'పాలస్తీన్ లిబరేషన్' ఉద్యమానికి చెందిన అబ్బాస్ అనే ఒక నాయకుడు గెరిల్లాలతో కలిసి మాట్లాడారు. ఈజిప్షియన్ ప్రభుత్వం గెరిల్లాలను వారికి ఇష్టమైన పోర్ట్‌లో క్షేమంగా ఓడలోకి చేర్చటానికి అంగీకరించిందనీ, ఇక ఎవరినీ చంపవద్దనీ కోరాడు. దాంతో గెరిల్లాలు సయుద్‌పోర్ట్‌లో దిగి కైరోకు బస్‌మీద వెళ్ళారు. కైరోలో ఒక విమానం ఎక్కి తమను ట్యూనీషియా రాజధాని 'ట్యూనిస్' పట్టణంలో దింపమని అడిగారు. విమానం బయలుదేరింది. అయితే అమెరికా అధ్యక్షుడు రీగన్, అమాయకుడైన ఒక అమెరికా దేశస్థుణ్ని బలిగొన్న ఆ దుండగులను క్షమించదలుచుకోలేదు. దాంతో రసవత్తరమైన ఇంకో డ్రామా ప్రారంభమైంది. గెరిల్లాలు ఉన్న విమానం ట్యూనిస్ చేరకుండా మధ్యలోనే దాన్ని నిర్బంధంలోకి తీసుకోవలసిందిగా రీగన్ తన కమెండోలకు ఆదేశాలిచ్చాడు. మధ్యధరా సముద్రంలోవున్న 'ఎయిర్‌క్రాఫ్ట్ కరియర్ బేస్'లో అమెరికా యుద్ధవిమానాలు సిద్ధంగా వున్నాయి. రీగన్ అనుమతి లభించగానే గెరిల్లాలను తీసుకువెడుతున్న విమానాన్ని అమెరికా యుద్ధవిమానాలు వెంబడించడం ప్రారంభించాయి. ఆ విమానాల సంగతి బాగా తెలిసిన పైలట్ లొంగిపోతున్నట్టు ప్రకటించాడు. ఆ నాలుగు యుద్ధవిమానాలు వెంబరాగా, చివరకు ఆ విమానాన్ని ఇటలీలోని సిసిలీ విమానాశ్రయంలో దింపారు. అమెరికా, ఇటలీ దేశాలకు చెందిన 'క్రాక్‌కమాండోస్' వెంటనే విమానాన్ని చుట్టుముట్టి దుండగులను లొంగదీసుకున్నారు. ఆవిధంగా పాలస్తీనా గెరిల్లాల "షిప్ హైజాకింగ్" ప్రయత్నం భగ్నమయింది.

# ఉంగరాల విశిష్టత

ప్రాచీనకాలం నుంచీ రకరకాల ఆభరణాలతో అలంకరించుకోవడమంటే అందరికీ మక్కువే. ఈ ఆభరణాల నమూనాలు దేశాన్ని, కాలాన్నిబట్టి మారుతున్నా 'ఉంగరం' అంటే మాత్రం పూర్వంనుంచీ నేటివరకూ అందరూ మోజుపడటం ఓ విశేషం. దానికి కారణం ఉంగరాన్ని కేవలం అలంకారంగా మాత్రమే గాక ప్రేమకు, ఆప్యాయతకు చిహ్నంగా భావించడమే.

ఉంగరాలను బంగారు, వెండి, రాగివంటి వివిధరకాలైన లోహాలతో తయారుచేసుకోవచ్చు. ఆవిధంగా సమాజంలోని అన్ని ఆర్థికస్థాయిలకు చెందినవారికీ అది అందుబాటులో ఉంది.

'ఉంగరం' మొట్టమొదటిసారిగా ఎప్పుడు ఉపయోగించారని చెప్పడం కష్టం. కానీ మన ప్రాచీన కావ్యాలలో, పురాణాలలో 'ఉంగరం' ప్రసక్తి అనేకచోట్లవుంది. రామాయణంలో హనుమంతుడు లంకకువెళ్ళి సీతకు రాముడి అంగుళీయకాన్ని అందించినట్లుగా ఉంది. కాళిదాసు రచించిన అభిజ్ఞాన శాకుంతలంలో దుష్యంత మహారాజు ఇచ్చిన ఉంగరం పోగొట్టుకొన్న శకుంతల ఎన్నో కష్టాలననుభవిస్తుంది. చివరికి ఆ ఉంగరం దొరకటం వల్లనే రాజు ఆమెను గుర్తించగలిగినట్టు వర్ణించారు.

పూర్వకాలంలో రాజులు ఉంగరాలను 'అధికార చిహ్నం'గా కూడా ఉపయోగించేవారు. ఈ రాజముద్రతో ముద్రవేయబడని ఏ ఆజ్ఞాపత్రానికైనా, లేఖకైనా విలువుండేదికాదు.

పాశ్చాత్యదేశాలలో మొట్టమొదట యూదు మతస్థులు, పెళ్ళిలో ఉంగరాలు మార్చే పద్ధతి ప్రారంభించినా ఇప్పుడు ఆ పద్ధతి మనదేశంతోసహా అనేక ప్రపంచదేశాలలో కూడా ఉంది. క్రైస్తవుల వివాహాల్లో వధూవరులు ఉంగరాలు మార్చుకోనిదే పెళ్ళి పూర్తికాదు.

'వజ్రం' పవిత్రమైన ప్రేమకు సంకేతంగా చూపిస్తారు. అందువల్ల తాహతున్నవారు పెళ్ళిళ్లలో వజ్రపుటుంగరాలను మార్చుకుంటారు. ఉంగరాలు మార్చుకున్నారంటే [illegible] సర్వ అధికారాలను, బాధ్యతలను కూడా సమానంగా పంచుకోవాలని అర్థం.

క్రీ.శ. 12, 13 శతాబ్దాలకాలంలో ఇటలీ దేశప్రజలు వజ్రపుటుంగరాలను ధరిస్తే మనశ్శాంతి లభిస్తుందని నమ్మేవారు. సుఖమయమైన వైవాహిక జీవితంకోసం కూడా వధువు వజ్రపుటుంగరాలను ధరించేవారు. [illegible] కలిసినట్లు, నాగాలు వాడుకలో [illegible] ఉంగరాలనే మార్పిడికి [illegible]



యోగించేవారు. రాజులు తమ పేర్లలోని మొదట అక్షరాన్ని ఉంగరాలమీద చెక్కించుకొనేవారు.

మనదేశంలో కేవలం లోహంతోచేసిన ఉంగరాలనేగాక 'దర్భ'తో చేసిన 'పవిత్రం' అనే ఉంగరాలను కూడా కొన్ని క్రతువులు ఆదరించే సమయంలో పెట్టుకుంటారు. ఆవిధంగా చేస్తే దుష్టగ్రహాల ప్రభావం నశిస్తుందని ఓ నమ్మకం. ఒకవైపు ఉంగరానికి గొప్పతనాన్ని ఆపాదిస్తూనే దాన్ని ఇతరుల ప్రాణం తీయడానికి కూడా ఉపయోగించేవారు. గుప్తులకాలంలో సైనికులు పాము విషంతో నిండిన ఉంగరాలు ధరించి శత్రువులతో చేతులు కలిపేవారు. ఆ కలపడంలో విషం వాళ్ల శరీరంలోనికిపోయేలాచేసి వాళ్లను చంపేవాళ్ళు.

'అనామిక' వేలుకే ఉంగరం పెట్టుకోవడం తొలినుండీ ఆనవాయితీ. ఆ వేలికే ఎందుకు పెట్టుకోవాలనడానికి ఒక కారణం ఉంది. ఉంగరం వేలినుండి నరాలు తిన్నగా గుండెకు వెళ్ళే నరాలతో కలపబడిన్నాయి. దీనివల్ల ఆ వేలిమీది 'ఉంగరం' స్పర్శ సూటిగా హృదయానికి వెళ్ళి తన సందేశాన్ని అందజేస్తుందని అంటారు.

## ఐ జాగింగ్

తలనొప్పి, 'చూపుమందగించడం' హ్రస్వదృష్టి, దూరదృష్టి ఇలా రకరకాల కారణాలతో చాలా మంది కళ్లద్దాలు వాడుతూ ఉంటారు. కారణం ఏదయినా అద్దాలను అస్తమానం శుభ్రపరచుకోవడం, ముక్కుమీద కళ్లకింద నల్లని మచ్చలు ఏర్పడటం, ఫీల్డ్‌గేమ్స్ ఆడటంలో ఇబ్బంది పడటంవంటివి మామూలుగా కళ్లద్దాలు వాడే వారందరికీ అనుభవమే. వారి కష్టాలు తీరే సమయం దగ్గర్లోనే ఉందని ఆశించవచ్చు.

బ్రిటన్‌లోని బ్రూనెల్ విశ్వవిద్యాలయంలో విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేస్తున్న 'పాల్‌కుక్' కళ్లద్దాల అవసరం లేకుండానే కంటి చూపును బాగుచేసుకోవడానికి ఒక యంత్రాన్ని కనిపె





ట్టాడు. చాలామంది కళ్లద్దాలు వాడేవారు వయసు పైబడుతున్న వారి కంటిచూపుకు అలవాటుపడిపోతారు. విదేశాలలో కళ్లకు వయసు రావడాన్ని తగ్గించే ప్రయత్నాలు చేస్తున్నారు. చైనా దేశంలో స్కూలు పిల్లలకు చాలా సేపు పుస్తకాలు చదివిన తరువాత కళ్లను ఎలా 'మసాజ్' చేసుకోవాలో నేర్పుతున్నారు.

సాధారణంగా కంటిని అదుపులో ఉంచే కండరాలు బలహీనం కావడంతో వచ్చే దృష్టి దోషాలను కుక్‌కనిపెట్టిన ''బయోలేజర్ స్పెక్ అనే యంత్రం ద్వారా కళ్లద్దాల అవసరం లేకుండానే సరిజేయవచ్చు. అటూ ఇటూ కదులుతున్న చుక్కలు గల ఈ యంత్రం లోనికి చూడటం ద్వారా కంటి కండరాలకు వ్యాయామం ఏర్పడుతుతుంది. దాని వల్ల కండరాలు బలంగా తయారయి దృష్టి దోషాలు తగ్గుతాయి. అయితే కంటివైద్యులు కుక్ కనిపెట్టిన ఈ 'బయోలేజర్‌స్పెక్' మీద అంత విశ్వాసం చూపించడంలేదు. కంటి డాక్టర్లకు అసలు దృష్టిని బాగుచేద్దామనే ఆలోచనే ఉండదు అంటాడు పాల్‌కుక్. స్వీడన్‌లోని ఉప్సల యూనివర్సిటీలోని పరిశోధకులు ఈ యంత్రాన్ని పరిశీలించి దీని బాగోగులను త్వరలోనే నిర్ణయిస్తారు.

# తెల్ల ఏనుగు

లాభాలేమీ లేకుండా నష్టంతో నడుస్తూ ప్రజలకు, ప్రభుత్వానికి భారమైన పరిశ్రమలను, సంస్థలను 'తెల్లఏనుగు' అని వ్యవహరిస్తూ ఉంటారు. ఎందుకంటే తెల్లఏనుగులతో పనులేమీ చేయించరు. వాటిని కేవలం అలంకారప్రాయంగా ఉంచి, సకలరాజమర్యాదలూ చేస్తారు. వీటివల్ల ఖర్చు తప్ప ఆదాయం ఉండదు. అయితే దీనికి విరుద్ధంగా మైసూరు జంతుప్రదర్శనశాలలో ఉన్న తెల్లఏనుగు 'శ్వేత' మాత్రం బోలెడు డబ్బు సంపాదిస్తోంది.

'శ్వేత'ను 1948లో కూర్గుప్రాంతంలోని దుబారె అడవుల్లో కె.పి. అచ్చయ్య అనే ఒక అటవీ శాఖ అధికారి పట్టుకొన్నారు. దీన్ని 'ఖెడ్డా' పద్ధతిలో పట్టుకొన్నారు. 'ఖెడ్డా' పద్ధతి అంటే అడవిలో ఓ పెద్ద గొయ్యి తీసి దాన్ని ఆకులు కొమ్మలతో కప్పి ఉంచుతారు. ఆ దారిన వచ్చే ఏనుగు పొరపాటున అందులో



పడిపోతే దాన్ని వెలికి తీసి బంధిస్తారు. 'శ్వేత'కు అప్పుడు పదిహేనేళ్ల వయస్సు. మైసూరులో తప్ప ప్రపంచంలో మరే ఇతర జంతు ప్రదర్శన శాలలోనూ 'తెల్లఏనుగు' లేదు. అంతేకాకుండా ఆసియాఖండం మొత్తంలోనే మనుషుల కట్టడిలో ఉండి పిల్లలు పుట్టడానికి ఉపయోగపడుతున్న మగఏనుగు ఇదొక్కటే.

ప్రస్తుతం 'శ్వేత'కు యాభైమూడేళ్లు. పెద్ద పెద్ద దంతాలతో తెల్లగా అందంగా ఉండే ఈ ఏనుగును సాధారణంగా దసరా సందర్భంలో దేవుడి ఊరేగింపు కోసం వినియోగిస్తూ ఉంటారు. కాని ఈ మధ్య కొంతమంది ఉత్పత్తిదారులు తమ వస్తువుల ప్రకటనల నిమిత్తం కూడా ఈ ఏనుగు ఊరేగింపును జరుపుతున్నారు. 'శ్వేత' ఇటువంటి ఊరేగింపులో ఒక్కసారి పాల్గొనాలంటే అయిదువందల రూపాయలు జంతుప్రదర్శనశాల అధికారులకు చెల్లించాలి. ఈ విధంగా 'శ్వేత' జంతు ప్రదర్శనశాలకు బోలెడంత డబ్బు సంపాదించిపెడుతోంది.

'శ్వేత' నిర్బంధంలో అంటే జంతు ప్రదర్శనశాలలో ఉన్నప్పుడు కానీ, బయట ప్రజల మధ్య కానీ ఎప్పుడూ అదుపు తప్పి ప్రవర్తించలేదు. ఎంతో క్రమశిక్షణతో బుద్ధిగా ప్రవర్తిస్తుందనే మంచిపేరు తెచ్చుకొంది.

ఇప్పటి వరకూ 'శ్వేత' ఏడుగురు పిల్లలకు తండ్రి కాగలిగినా ఒక్క పిల్లకూ తెలుపురంగు రాలేదు. ఒకే ఒక పిల్లకు తండ్రి రంగు వచ్చింది కానీ, దురదృష్ట వశాత్తూ అది పుట్టక మునుపే చనిపోయింది. మిగతా ఆరు పిల్లలు పెద్దవయి, కొన్ని ప్రస్తుతం విదేశాలలో ఉన్న జంతుప్రదర్శనశాలలో కూడా ప్రదర్శింపబడుతున్నాయి.

# పాపోవో గినియా

డెబ్భై కోట్ల జనాభా వున్న మనదేశంలో అన్ని కలిపి 1652 భాషలు ఉండటమే ఓ విశేషం అనుకుంటాంగానీ, 30 లక్షల జనాభా మాత్రమే ఉన్న 'పాపోవోగినియా' దేశ ప్రజలు 700 రకాల భాషలు మాట్లాడతారంటే మరీ ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ దేశంలో 700 రకాల సమాజాలు, 700 విభిన్న సంస్కృతులు ఉన్నాయి. కొండలు, లోయలు, అడవుల మధ్య మిగతా ప్రపంచానికీ, నాగరికతకూ దూరంగా సముద్ర మధ్యంలోవున్న ఈ చిన్న ద్వీపం కొన్ని వందల సంవత్సరాల నుండి ఆర్థికంగా, సాంఘికంగా ఎదుగూబొదుగూ లేకుండా ఉంది. 1975లో ఇతర ద్వీపాలతో బాటు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్న ఈ దేశం తన ప్రాచీన సంస్కృతిని, ప్రస్తుత ప్రపంచ పరిస్థితులకు అనుగుణంగా మలుచుకో ప్రయత్నిస్తోంది.

'పోర్ట్‌మొరెస్బి' ఈ దేశరాజధానీ నగరం. వీరు ఏటా 'హిరి' అనే పండుగను చాలా ఉత్సాహంగా జరుపుకుంటారు. స్త్రీ పురుషులందరూ రంగురంగుల వస్త్రాలు ధరించి వివిధరకాలైన నృత్యాలు, పడవ పందేలు, బల్లేలు విసరడం, విలువిద్యా ప్రదర్శన వంటి క్రీడల్లో పాల్గొంటారు. ఈ క్రీడలన్నింటిలోనూ విచిత్రంగా ఉండేది, స్త్రీపురుషులందరూ మొహానికి మట్టితో చేసిన తొడుగు వేసుకొని, ఒళ్ళంతా బురద పూసుకొని నృత్యంచేయడం. ఇలా నృత్యంచేయడానికి వారు ఓ కారణం చెబుతారు. కొన్ని వందల ఏళ్లక్రితం బలహీనమైన ఓ గిరిజన తెగపైన మరో బలమైన తెగవారు దాడిచేశారు. శత్రుధాటికి ఆగలేక బలహీనులైన ఆ తెగవారు పారిపోవడం ప్రారంభించారు. చీకటిలో అలా పరుగెత్తుతూ వారు దారిలో ఉన్న ఓ నది దాటవలసి వచ్చింది. ఆ నది నిండా బురద, పాకుడు ఉండటంతో నది నుండి బయటపడేసరికి వారి శరీరాలన్నీ బురద, పాచి అంటుకొని వికృతంగా కనిపించసాగాయి. వారిని తరుముతూ వెన్నంటి వచ్చిన శత్రువులు ఆ ఆకారాలను చూసి, వారికి సహాయంగా భూతాలూ, దెయ్యాలూ వచ్చాయనుకొని భయపడి పారిపోయారు.

ఆ విధంగా వారు శత్రువుల బారి నుండి తప్పించుకోగలిగారు. అప్పటినుండి ఆ సంఘటన జ్ఞాపకార్థం వారు ఏటా ఈ పండుగను జరుపుకొంటున్నారు. ప్రపంచం నలుమూలల నుండీ పర్యాటకులు ఈ ఉత్సవాన్ని చూడటానికి వస్తూ వుంటారు.




# అలసట లేని వ్యక్తి



పద్మభూషణ డాక్టర్ పురందరే నిజంగా ఓ అద్భుతమైన వ్యక్తి 'గైనకాలజిస్టు'గా అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన ఈయన వయసు డెబ్బైఅయిదు సంవత్సరాలు. ఈవయసులో సాధారణంగా అందరూ 'కృష్ణా' 'రామా' అనుకుంటూ వేదాంతం వంటబట్టించుకొనే ప్రయత్నంలో ఉంటారు. ఈయన మాత్రం ఇప్పుడు కూడా బొంబాయిలోఉన్న తన స్వంత ఆసుపత్రిని ఎంతోసమర్థవంతంగా నిర్వహిస్తున్నారు.

డాక్టర్ పురందరే ప్రతిరోజూ ఉదయం నాలుగుగంటలకే నిద్రలేచి వ్యాయామం, యోగాసనాలు ముగించుకొని ఆరుగంటలకల్లా తన ఇంటికింది భాగంలో ఉన్న ఆసుపత్రికి వెళతారు. అక్కడ పదిగంటలదాకా శస్త్రచికిత్సలుచేసి పదిగంటల ప్రాంతంలో ఇంటికి వెళతారు. భోజనం అయాక తిరిగి ఆసుపత్రికి వెళ్ళి మధ్యాహ్నం రెండుగంటలదాకా రోగులకు చికిత్సచేయడంలో గడుపుతారు. మళ్ళీ సాయంత్రం మూడున్నరగంటలనుండి ఏడుగంటలదాకా రోగులను పరామర్శిస్తూ ఉంటారు. ఇంత 'బిజీ' గా ఉండే పురందరేకి లెక్కలేనన్ని హాబీలు కూడా ఉన్నాయి. అన్నింటిలో కూడా చెప్పుకోదగ్గ ప్రతిభనార్జించగలగటం ఈయన ప్రత్యేకత.

డాక్టర్ పురందరే మంచి చిత్రకారుడు, ఫోటోగ్రాఫరు, గాయకుడు, ఖగోళశాస్త్రజ్ఞుడేకాక మంచి పైలట్ కూడా. ఇతడు తీసినకొన్ని ఫోటోలను 'ఇలస్ట్రేటెడ్‌వీక్లీ' వంటి ప్రముఖ ఆంగ్ల వారపత్రికల్లో కూడా ప్రచురించారు. ఇతనికి ఒకరోజు అకస్మాత్తుగా 'ఆస్ట్రాలజీ' నేర్చుకోవాలనిపించి వెంటనే భారతీయ విద్యాభవన్ వారు నిర్వహించే సంస్కృత భాషాతరగతులకు హాజరయి సంస్కృతం నేర్చుకొన్నారు. తరువాత సంస్కృతంలో ఖగోళశాస్త్రానికి సంబంధించిన అసలు ప్రతులను చదివి ఆస్ట్రాలజీని వైద్యరంగంలో కూడా ఉపయోగించగలిగారు. హిందుస్తానీ సంగీతంలో మంచి ప్రావీణ్యం సంపాదించిన ఈయన నాటకాలలోనే గాక ఒకసినిమాలో కూడా నటించారు. ఇవన్నీ కాక బొంబాయికి దగ్గరలో ఉన్న 'లోనావాలా'లో ఒకఫామ్‌ను కొని కొత్తపద్ధతుల్లో వ్యవసాయాన్ని కూడా చేయిస్తున్నారు.

డాక్టర్ పురందరే లెక్కలేనన్ని కుటుంబనియంత్రణ శస్త్రచికిత్సలు చేయడమేగాక అనేక కుటుంబ సంక్షేమశిబిరాలను కూడా నిర్వహించారు. ఈయన తన ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న రోగులరికార్డులను క్షుణ్ణంగా పరిశీలించిన మీదట గైనకాలజీకి సంబంధించిన కొన్నివిలువయిన అభిప్రాయాలను ప్రకటించారు. అనేకదేశాలు పర్యటించి ఎంతో జ్ఞానాన్ని సముపార్జించిన ఈయన 'ఇంటర్నేషనల్ గైనకాలజిస్ట్ అసోసియేషన్' కు కొన్నేళ్లపాటు అధ్యక్షుడిగా పనిచేశారు.

ప్రస్తుతం డాక్టర్ పురందరే వల్‌ఘర్‌వద్ద ఆదివాసులకోసం ఒక ఆధునికమైన వైద్యశాలను నిర్మించే ప్రయత్నంలో ఉన్నారు. యాభైపడకలుగల ఈఆసుపత్రి నిర్మాణం చివరిదశలో ఉంది. చేసేపని ఏదయినా ఏకాగ్రత, పట్టుదల, స్పర్థఉండి చేస్తే తప్పకుండా మంచి ఫలితాలు పొందగలమని ఈయన నమ్మకం.

యువకుల్ని కూడా ఆశ్చర్యపరిచేటంత ఉత్సాహంతో ఆసక్తితో జీవితం గడుపుతున్న డాక్టర్ పురందరెని ఉద్యోగవిరమణ ఎప్పుడు చేస్తారని అడిగే ధైర్యం ఎవరికీలేదు.

★

కవర్‌పేజీ ఫోటోగ్రాఫర్ : కె.యల్. కుమారస్వామి

# 'స్వేచ్ఛ' నవలపై చతుర సమీక్షలు

'చతుర' నవలల పోటీలో అత్యుత్తమ నవలగా ఎన్నికై ఫిబ్రవరి సంచికలో ప్రచురితమైన 'స్వేచ్ఛ' పై మాకు అందిన 'చతుర సమీక్ష' లలో ఉత్తమంగావున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో అత్యధిక సంఖ్యలో ఉత్సాహంగా పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు!

## ఈ దశాబ్దపు మేటినవల

(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)

మధ్య తరగతి మహిళ వివాహ జీవితంలోకి తొంగిచూసి, మనసులో వడుతున్న సంఘర్షణ, బాధలను వున్నవివున్నట్లుగా చెప్పగలగడం ఎట్లా సాధ్యపడిందీ రచయిత్రికి అన్పించింది "స్వేచ్ఛ" చదివాక. ఇది కొద్దో, గొప్పో చదువుకున్న ఈనాటి ప్రతి యువతి, ప్రతి గృహిణీయొక్క అంతరంగ మథనమే. రచయిత్రి సమస్యను అన్నివైపులా, అన్నికోణాల్నుంచీ కూలంకషంగా చర్చించినా 'ముగింపు' విషయాని కొచ్చేసరికి కొంచెం డేరింగ్‌గానూ, సందిగ్ధంగానూ ముగించారన్పించింది.

నేటి సమాజంలో ప్రకాశంలాంటి భర్తలను వదులుకోవడానికి ఎంతమంది భార్యలు సిద్ధపడగల స్థితిలో వున్నారు? ఈ అనుబంధాలకీ, ఆప్యాయతలకీ అర్థంలేదా? ఎవరి జీవిత ధ్యేయం వారు నెరవేర్చుకుంటూ మధ్యమధ్యలో 'రిలాక్సేషన్ కోసమేనా "స్త్రీ, పురుష సంబంధం?" అన్న ఆలోచనలో వడవేసింది. ఒకవిధంగా చూస్తే "స్వేచ్ఛ"లోని అరుణ ఆలోచనల్లాంటివే, 'విపుల' ఫిబ్రవరి సంచికలోనే వచ్చిన "భార్య, భర్త, బ్రహ్మచారి" కథలోని కుమార్ అతని స్నేహితుడి ఆలోచనలు కూడా. ఈనాడు అరుణలాగా ఆలోచించే స్త్రీలు ఎంతమందివున్నా చివరికి ఆ కథలోలాగా సరిపుచ్చుకొని సంసారాలు చేసేవారే. కాకపోతే అటువంటి స్త్రీలకు ఈ నవలలోని జీవిత చిత్రణ చదివిం తరువాత 'నాలాగా ఎందరో అనిపింపచేసి, కన్నీళ్ళు తెప్పిస్తుంది. ఈ సమస్యకు ఇప్పట్లో, ఈ వ్యవస్థలో పరిష్కారంలేదా? అందుకే ముగింపు అలా ఆగిపోయిందా?

— యన్. భాగ్యలక్ష్మి, చీరాల.

## జీవితం కోసం 'స్వేచ్ఛా'? 'స్వేచ్ఛ' కోసం జీవితమా?

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

రచయిత్రి చేతిలో పాత్రలన్నీ కీలుబొమ్మలై రచనకు ప్రాణమైన 'జీవితం' లోపించి 'ఆదర్శం' మాత్రమే మిగిల్చిన ఈ నవలలో ప్రధాన పాత్ర అరుణకు జీవితంపట్ల స్పష్టమైన అవగాహన వున్నట్లు అనిపించదు. అరుణ కోరుకున్న స్వేచ్ఛ అంతా ఎవరికీ లొంగకుండా వుండటం, ఎవరి అధికారం కిందా, శాసనంకిందా జీవించాలని కోరుకోకపోవటం .... ఆమె ప్రేమించింది కూడా ఆ భావననే! ఆ భావనే ఆమె దృష్టిలో 'స్వేచ్ఛ'! ఆమె దృష్టిలో

స్వేచ్ఛకోసమే జీవితం, అంతేగాని జీవితంకోసం స్వేచ్ఛగాదు... ఆమె తను పుట్టిపెరిగిన ఇంట్లో ఎవరినీ ప్రేమించలేదు. తను అనుభవిస్తున్న 'కట్టడి' నుండీ బయటపడాలనే స్వేచ్ఛా భావననే ప్రేమించింది. ఆమె తన భర్త ప్రకాశాన్ని కూడా ప్రేమించలేదు. అతడు తన్ను ప్రేమించాడనే భావననే ప్రేమించింది... ఆమె మనసంతా నిండుకున్నది స్వేచ్ఛా భావన ఒక్కటే! ప్రతి సందర్భంలోనూ ఎవరో తన స్వేచ్ఛను అపహరించివేస్తున్నారని అనవరసరంగా 'ఫీల్' అవుతుంది. జీవితాన్నీ మనుమల్నీ అర్థం చేసుకోవాలనే ఆలోచనే ఆమెకున్నట్టు కన్పించదు... భర్త ప్రతిచర్యనూ, ప్రతి మాటనూ, ప్రతి ఆలోచననూ తనకు వ్యతిరేకంగా మలచుకొని, తన స్వేచ్ఛ అంతా నాశనమవుతూన్నట్టు కుంగిపోతుంది. తన్నందరూ అర్థంచేసుకోవాలనే దృష్టేగాని తను ఇతరులను అర్థంచేసుకోవాలనే ప్రయత్నమే చేయదు. నెలకు వంద రూపాయలు ఒక పత్రికకు చందా ఇవ్వటాన్ని భర్త అంగీకరించకపోతే, స్వేచ్ఛా భావనతోనే ఆ సంఘటనను ఆలోచిస్తుందిగానీ జీవిత దృష్టితో కాదు. పసిపిల్లకు ఫిట్స్‌వస్తే భర్త అనుభవించిన టెన్షన్‌ను సానుభూతితో అర్థం చేసుకోటానికి బదులు అతనన్న మాటల్లో తన స్వేచ్ఛ ఎంత నశించిందోనని ఆలోచిస్తుంది. ఇలా నవలలో అంతా కనిపించేది అరుణ విపరీత ప్రవర్తనే! అరుణ ప్రవర్తనకూ ఆలోచనలకూ ఒక సంబద్ధత కన్పించదు. ఆమె స్వేచ్ఛకోసమే ఉద్యోగం చేస్తుంది. స్వేచ్ఛకోసమే పెళ్ళి చేసుకుంటుంది. స్వేచ్ఛ కోసమే భర్త ప్రతి మాటనూ ఎదిరిస్తుంది. స్వేచ్ఛకోసమే జీవిస్తుంది. ఈ స్వేచ్ఛా తపనలో ఆమె ఆలోచించలేకపోయిందీ, పోగొట్టుకొన్నదీ జీవితాన్నీ మనుమల్నీ. జీవితం ఏ సిద్ధాంతాలకూ లొంగదనీ, ఏ భావనల చట్రంలోనూ జీవితం ఒదగదనీ అరుణలాంటి వాళ్ళు గ్రహించరు. అందుకే ఈ సంఘర్షణా, ఈ పరాజయమూ. స్వేచ్ఛ ఒక పదునైన కత్తివంటిది. దాన్ని సరిగా వుపయోగించుకోకపోతే, అది చేత పట్టుకున్న తననే పొడిచివేస్తుంది అన్న సత్యాన్ని ఈ నవల నిరూపించింది.

— **యస్. స్వరాజ్యలక్ష్మి**, హంపాపురం.

## వ్యష్టి?—సమిష్టి?

**(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)**

'స్వేచ్ఛ' ద్వారా పురుషాధిక్య సమాజంలోని స్త్రీ ఆర్థికంగా స్వతంత్రురాలయినంత మాత్రాన స్వేచ్ఛ లభించదనీ, అదే పరిష్కార మార్గం కాదనీ, ఆర్థికస్వాతంత్ర్యం ఉన్నప్పటికీ స్త్రీ సామాజిక స్వేచ్ఛకు అడుగడుగునాపడే సంకెళ్ళగూర్చి, ఆ సంకెళ్ళను ఛేదించుకోవడానికి ప్రయత్నించడంలో స్త్రీ ఎదుర్కొనే సమస్యల గూర్చి సహజంగా చిత్రించారు.

నవల చివరలో... "నాకు సంగమ్మని చూశాకా, మెహందీ స్త్రీలను చూశాకా అర్థమయింది. సంగమ్మని కోర్టుకి పంపి ఆ దుర్మార్గుణ్ణి శిక్షించగలిగితే, మెహందీ స్త్రీలకు లైసెన్సులిప్పించగలిగితే-... ఆడవాళ్ళకోసం ఆడవాళ్ళం ఏదోఒకటి చెయ్యాలి. నేనిలాంటిది ఏదో ఒకటి చేస్తాను..." అన్న అరుణను—

"నువ్వొక్కదానివే ఏం చేయగలవు?" అని ఉమ అడుగగానే,

"సుజాత, భారతీ ఉన్నారు. నాలాంటివాళ్ళు ఇంకా ఉంటారు. చెయ్యగలిగినవరకే చేస్తాను" అని అరుణ తిరిగి చెప్తుంది.

దానికి సమాధానంగా "...సమాజమంతా భయంకరంగా ఉన్నప్పుడు నువ్వు చేసేపని ఏమూలకు? నీ చేతలతో ఈ సమాజం ఎప్పటికి మారేను?" అని ప్రశ్నించడం నిస్పృహతో కూడుకొని ఉన్నప్పటికీ అక్కడ, ఆ పరిస్థితిలో ఉమ అలా అడగడం బాగుంది.

అయితే "మొత్తం సమాజాన్ని మార్చటం నాకు చేతకాదు- నాకు చేతనైంది నేను చేస్తాను... దానివల్ల నాకెంతో తృప్తి. నా జీవితం సార్థకమవుతోందన్న భావం కలగటమే స్వేచ్ఛకు అర్థం ... ఇప్పుడు ఆ అర్థం కోసం అన్వేషించడమే నాపని" అని అరుణ ముగించటం అసంతృప్తిగా ఉంది.

స్త్రీ-పురుష సంబంధాలే ముఖ్యమైనవిగా ముందుకు తీసుకొచ్చిన రచయిత్రిగారు స్త్రీస్వేచ్ఛతోపాటు అన్ని సమస్యలకు మూలం ఈ వర్గసమాజమనీ; వ్యక్తి స్వేచ్ఛ సామాజిక స్వేచ్ఛతో ముడిపడివుండటం వలన ఈ వ్యవస్థ విముక్తికై వ్యక్తిగా కాకుండా సమిష్టిగా పోరాటం

చేయవలసివుందనీ, అందులో పాల్గొనడం ద్వారానే స్త్రీ సమస్యకు పరిష్కార మార్గం లభించి నిజమైన స్వేచ్ఛను అనుభవింపగల రనే విషయాన్ని విస్మరించారు.

–డి.మల్లేష్, కొత్తగూడెం.

## ఏది స్వేచ్ఛ?

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

"మొత్తం సమాజాన్ని మార్చటం నాకు చేతకాదని, నాకు చేతనైంది కూడా నేను చెయ్యోద్దా? అలా చెయ్యకుండా నేను బతకలేనని నాకు తెల్సిపోయింది. ఆ పనిలో నన్ను నేను నిరూపించుకుంటున్నాను. దానివల్ల నాకెంతో తృప్తి- నాజీవితం సార్థకమవుతోందన్న భావం"- నవల ముగింపులో అరుణపాత్ర ద్వారా రచయిత్రి చెప్పించిన ఈ మాటలు ఆణిముత్యాలు. 'స్వేచ్ఛ' అనే పేరుతో రాసిన ఈ నవల స్వేచ్ఛకు అర్థం వుండాలి. ఆ అర్థం కోసం అన్వేషించడమే ఇవుడు నావని" అనే అరుణ మాటలతో ముగుస్తుంది. దీన్నిబట్టి నవలలో అరుణపాత్రకి ఎలా అయితే స్పష్టత లేదో, రచయిత్రికి కూడా ఆధునిక మహిళ కావాలనుకునే 'స్వేచ్ఛ' విషయంలో స్పష్టత లేదనే అనుకోవాల్సివస్తుంది.

ఏమైనా కొంచెం ఆలోచన వున్న పాఠకులకి లోతుగా ఆలోచించే వీలు కల్పిస్తుందీ 'స్వేచ్ఛ'.

–శాస్త్రి, విశాఖపట్నం.

## ఆరోజు వస్తే...

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

"నేను ఎబార్షన్ చేయించుకోలేకపోయాను. నా శరీరంమీద నాకు హక్కులేకుండా పోయిందికదా!" అని అంటున్న "స్వేచ్ఛ"లోని అరుణ వ్యథ- ఒక్క అరుణకి సంబంధించిందికాదు... మొత్తం ఈ సమాజంలోని స్త్రీ లందరిదీ. "భార్యాభర్తలు-ఒకరి స్వేచ్ఛను ఇంకొకరు గౌరవించుకుంటూ ఆదర్శంగా బతకటం-" ఈ ఊహ చాలా అద్భుతమయింది! ఈ వూహ నిజమైనరోజు... అలాంటి రోజువస్తే.... ఆ ఆనందం మాటల్లో ఇమిడేదికాదు-అనుభవించి తీరాల్సిందే! మొత్తంమీద ఈ నవల చదవగానే నేను పూర్తిగా చలించిపోయాను.

–యమ్.జయశ్రీ, హైదరాబాద్.

## జీవితం--విలనీ!

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

అప్పుడెప్పుడో స్త్రీస్వేచ్ఛ గురించి చలం తపించారు. మళ్ళీ ఇన్నాళ్ళకి ఆ కోవలో ఓల్గా గారు కనిపిస్తున్నారు. నిన్న మొన్నటిదాకా మహిళాభ్యుదయం పేరిట, స్త్రీస్వేచ్ఛపేరిట ఏవేవో వచ్చాయిగానీ, నిజమైన నవలలేవీ రాలేదు. వచ్చినా, అవి రాసిన వారికే స్త్రీస్వేచ్ఛ అంటే సరైన అవగాహన ఉన్నట్లు కన్పడదు.

"స్వేచ్ఛ"లోని అరుణ సాధారణంగా కన్పించే విలక్షణమైన పాత్ర. తన స్వేచ్ఛకై ఆరాటంతో ప్రారంభమయిన అరుణ పాత్ర వరుల స్వేచ్ఛకై పోరాటం సాగించాలని నిర్ణయించుకోవడంతో క్లైమాక్స్ చేరుకుంటుంది. ఈమధ్యలో అరుణ జీవితంలో సంభవించిన అనేక సంఘటనలను, ఆయా సంఘటనలలో అరుణ మానసిక పరిస్థితిని దశలవారీగా జరిగిన మానసిక సంఘర్షణను రచయిత్రి అద్భుతంగా చిత్రించారు.

స్త్రీ స్వేచ్ఛపై నవలలు రాసేవారు సాధారణంగా సదరు నవలలలోని మగవాడిని "విలన్"గా చిత్రీకరించడం పరిపాటి. కానీ ఆ "విలనీ"కి ప్రకాశం పాత్ర దూరంగా ఉన్నందుకు, వాస్తవానికి అతిదగ్గరగా ఉన్నందుకు రచయిత్రిని అభినందించవచ్చు. అరుణ యెడల ప్రకాశం తప్పిదం కనబడదు. ప్రకాశం రూటులో ప్రకాశం కరక్టే. అరుణకి ప్రగతి శీలక దృక్పథం అలవడటానికి వెనుక నున్న వ్యక్తి ప్రకాశం అంటే అతిశయోక్తి కాదేమో! పుట్టుకతో కాకుండా, అనుభవంతో అభ్యుదయ భావాలు ఉద్భవిస్తాయని అరుణ పాత్ర నిరూపించింది. క్లుప్తంగా చెప్పాలంటే స్వేచ్ఛ నిండుచందమామలాగుంది. ఏవో కొన్ని చిన్న లోపాలు, చంద్రునికి మచ్చలా, అంతే!

–శీదా నాగరాజు, గుంటూరు.





# చతుర

ఏప్రిల్ 1987
సంపుటి : 10
సంచిక : 3


## ఈనెల ప్రత్యేకనవల

"అయ్యా! మరి మనం... బస్సు తగలెట్టించిన సంగతి... ఏదైనా గొడవ...?" శిష్యుడు కొంచెం అనుమానంగా అడిగాడు.

"పిచ్చివాడా! ఇదే రాజకీయం అంటే! మన చేతికి దుమ్ము అంటకూడదు; అనుకున్న పని అయిపోవాలి! ఆ భయాలేమీ పెట్టుకోకు. ఉన్నారుగా మన కుర్రనాయకులు... అంతా ఆ స్టూడెంట్లమీదికే పోతుంది. మనం అంతా తెరవెనుకే! కాకపోతే కాస్త చేతులు తడపాలి. అంతే!" అన్నాడా మహానాయకుడుగారు నిర్లక్ష్యంగా.

దేశానికి వెన్నెముకలాంటి యువకులు కుటిల రాజనీతిలో పావులుగా ఎలా మారుతున్నారు? జాజ్వల్యమానంగా వెలగవలసిన యువజ్యోతి, ఆరోగ్యకరమూ, ఉత్సాహకరమూ అయిన యువశక్తి ఎందుకు మందు... మగువ... మార్ఫియా లమత్తులోపడి నిర్వీర్యమౌతోంది?

ఎవరు వీరి పతనానికి బాధ్యులు?

లక్ష్యశుద్ధిలేని విద్యావిధానమా?

స్వార్థప్రయోజనాలకోసం నిర్మలమైన యువహృదయాలను వికృతంగా మారుస్తున్న రాజకీయనాయకులా?

పిల్లల్ని సరైన పద్ధతిలో పెంచలేని తల్లిదండ్రులా?

అర్థరహితమైన ఆంక్షలతో ఎదిగే మనసునీ, వయసునీ పెడదారి పట్టిస్తున్న సమాజమా?

నేటి యువతరంలోని అశాంతిని విశృంఖలత్వాన్ని, అందుకు కారణాలను చూపే యువరచయిత పి. శ్రీరామచంద్ర మూర్తి 'పావులు' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



సాంఘిక ప్రయోజనం లక్ష్యంగా పెట్టుకుని రాసిన తన తొలి నవల ఈ "పావులు" తోనే సమర్థుడైన రచయితగా నిరూపించుకున్న శ్రీ పి. శ్రీరామచంద్ర మూర్తి పుట్టింది గుంటూరుజిల్లా, రేపల్లెలో. రచనా రంగంలో ప్రయోజనశీలత, ప్రయోగశీలత, వస్తువైవిధ్యం కోరుకునే శ్రీరామచంద్ర మూర్తి ప్రస్తుతం గుంటూరు జిల్లా చందోలులో స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియాలో పనిచేస్తున్నారు.

విజయవాడనుండి మంగళగిరి వెళ్లేరోడ్డు!

రోడ్డుకి ఒకవైపుగా ఆగిఉంది ఆకుపచ్చ రంగు సిటీబస్! దానిచుట్టూ మూగివున్నారు దాదాపు ఇరవైమంది!

కాని, వాళ్లు ప్రయాణికులు కారు! డిగ్రీకాలేజ్ స్టూడెంట్స్!

ఆ గుంపులోనుండి ఒక కుర్రాడు ఉత్సాహంగా అరిచాడు. "గురూ! రెడీనా!"

స్టూడెంట్స్ యూనియన్ నాయకుడు నవ్వాడు మెత్తగా!

ఆనవ్వే అదోలా ఉంటుంది. ఎదుటివాళ్లల్లో ఒకరకమయిన వణుకు పుట్టించే నవ్వు అది. పూర్తిగా, మనస్ఫూర్తిగా నవ్వడు. నవ్వుతూ నగంలో ఆపేస్తాడు అర్ధోక్తిగా! అపుడు ఆకుపచ్చగా వుండే అతని కళ్లు చిన్నవిగా అయిపోతాయి.

అతని పేరు కాశీరామ్! వయసెంతో అతనికే తెలియదు.

దాదాపు నాలుగు సంవత్సరాలుగా ఆ కాలేజీని అంటిపెట్టుకుని ఉన్నాడు. లెక్చరర్స్ అతని గురించి పట్టించుకోవడం ఏనాడో మానేశారు!

ముందుకు వంగాడు కాశీరామ్!

వంగి, రెండడుగుల దూరంలోవున్న కంకర రాయిని తీసుకుని, జీన్ పాంటుకి రుద్ది, నోటితో ఊదుతూ కాసేపు గాలిలో ఎగరేశాడు!

అతనుచేసే ప్రతి చర్యా అక్కడున్న మిగతా స్టూడెంట్స్‌కి కనులవిందుగా ఉంటుంది. వాళ్ల దృష్టిలో అతనికో స్పెషల్ ఇమేజ్ ఉంది. అంతే భయమూ వుంది.

సడన్‌గా కాశీరామ్ విల్లులా వెనక్కివంగి చేతిలోని రాయిని బలంగా సిటీబస్‌కేసి విసిరాడు.

ఛళ్లున పెద్దశబ్దంతో ముందరి అద్దం పగిలిపోయింది.

మరుక్షణం అన్నివైపులనుండి రాళ్లవర్షం కురిసింది ఆ బస్సుమీద!

ఒక్కొక్క అద్దం పగిలిపోతుంటే ఉత్సాహం రెట్టింపయిపోతోంది వాళ్లలో!

కాశీరామ్ అందుకున్నాడు "డౌన్!డౌన్ ప్రిన్సిపాల్..."

"డౌన్!డౌన్!" మిగతా స్టూడెంట్స్ పూర్తిచేశారు.

"విద్యార్థుల గోడు పట్టించుకోని ప్రభుత్వం..."

"వద్దు... మాకొద్దు!"

"సిలబస్ తగ్గించని విద్యావిధానం..."

"నశించాలి!"

"ట్యూషన్‌ఫీజు..."

"రద్దు చేయాలి!"

"డౌన్‌డౌన్! కామర్స్‌హెడ్..."

"డౌన్... డౌన్!"

"కెమిస్ట్రీహెడ్..."

"డౌన్... డౌన్!"

ఎవరి ఇష్టంవచ్చినట్లు వాళ్లు అరుస్తున్నారు. ఉత్సాహంగా గంతులేస్తున్నారు.

రోడ్డుమీద వెళుతున్న స్కూటర్లవాళ్లు, మోటార్‌సైకిళ్లవాళ్లు ఒకపక్కగా ఆపి, "ఇదేదో స్టూడెంట్స్ గొడవ! మనకెందుకు" అన్న ధోరణిలో నెమ్మదిగా డ్రైవ్‌చేసుకుంటూ కొంత దూరం వెళ్లి స్పీడందుకుంటున్నారు, వెనక్కి కూడా చూడకుండా!

మిగతా జనం అక్కడక్కడా దూరంగా నించుని చూస్తున్నారు ఈ దృశ్యం! ఆ సిటీబస్సుని ఎందుకు అలా పాడుచేస్తున్నారో, ఆ సినాదాలేమిటో వాళ్లకేమీ అర్థం కావడంలేదు.

అద్దాలు పగలగొట్టే కార్యక్రమం పూర్తయినాక, కాశీరామ్ చేతిలోకి పెట్రోల్ డబ్బా తీసుకున్నాడు.

మిగతా స్టూడెంట్స్ ఉత్సాహంగా విజిల్స్ వేశారు.

కాశీరామ్ డబ్బాలోని పెట్రోల్ మొత్తం బస్సుమీద, లోపల సీట్లమీద కిటికీలలోగుండా పోశాడు!

జేబులోనుండి అగ్గిపెట్టె తీశాడు!

అగ్గిపుల్ల వెలిగించి ఒక్కక్షణం దానివైపు చూశాడు! ఆ వెలుగులో అతని ఆకుపచ్చ కనుగుడ్లు పిల్లి కళ్లలా తళుక్కున మెరిశాయి! నవ్వాడు చిన్నగా!

మరుక్షణం అతని చేతిలోని అగ్గిపుల్ల బస్సు సీటులోని దూదిని ముద్దు పెట్టుకుంది!

ఒక్కసారిగా లేచిన అగ్నిజ్వాల...నెమ్మదిగా మిగతా సీట్లను ఆక్రమించి,వాటిమీదుగా బస్సుని దగ్ధంచేయడం మొదలుపెట్టింది.

చూస్తుండగానే శబ్దంచేస్తూ రేకులు నల్లగా అయిపోయి, విరిగి పడిపోవడం ప్రారంభించాయి.

నల్లగా లేచిన, దట్టమయిన పొగ ఆకాశంలోకి ఎగిసింది.

అగ్నిజ్వాలల తాలూకు వేడి చుట్టుపక్కలకు వ్యాపించింది. ఆ సెగకు పక్కనే ఉన్న రావిచెట్టు ఆకులు నల్లగా కమిలిపోయాయి.

ఆ అగ్ని తాలూకు వెలుగు అందరి కళ్లల్లో ప్రతిఫలిస్తుండగా, స్టూడెంట్స్ పెద్దగా అరుస్తూ దాదాపు డాన్స్ చేయడం మొదలెట్టారు.

నిశ్శబ్దంగా కాలి మసైపోతున్న ఆ బస్సుని చూస్తుంటే, చెప్పలేని ఉత్సాహంగా ఉంది

మళ్లీ నినాదాలు మొదలెట్టారు.

''డౌన్! డౌన్!'' అనే నినాదాలు ఆ ప్రాంతంలో ప్రతిధ్వనించాయి. జేబులోనుండి సిగరెట్‌తీసి వెలిగించుకోబోతున్న కాశీరామ్ అపుడు చూశాడు!

దూరంగా రోడ్డు మలుపుతిరిగి వస్తోంది పోలీస్ జీపు!

కేవలం రెండేరెండు నిముషాల వ్యవధిలో ఆ రోడ్డుకు మరో వైపు సందులో ఆపివుంచిన రెండు టాక్సీలు, రెండు మోటారు సైకిళ్లు స్టార్ట్ అయ్యాయి ఢమఢమమని శబ్దం చేస్తూ!

నల్లని దట్టమయిన ఆ పొగను తప్పించుకుని వచ్చిన పోలీసులకు, అక్కడ దూరంగా నుంచుని, భయంగా చూస్తున్న ఓ పదిమంది మనుషులు తప్ప ఇంకెవరూ కన్పించలేదు.

విజయవాడ సిటీలోకి ప్రవేశించిన ఆ రెండు టాక్సీలు కాసేపటికి విడిపోయి, వేర్వేరు దిశలుగా వివిధ రోడ్లలోకి వెళ్లిపోయాయి.

మోటార్‌సైకిళ్లు మాత్రం కాస్త స్లో అయి నెమ్మదిగా పోసాగాయి. అప్పుడు వచ్చింది..

ఓ మోటారు సైకిలు వెనుక సీటుమీద కూర్చున్న స్టూడెంట్‌కు ఒక సందేహం!

''అయితే గురూ! ఇంతకీ మనం బస్సును ఎందుకు తగలబెట్టినట్టు!'' డ్రైవ్ చేస్తున్న స్టూడెంట్ తల తిప్పకుండా అన్నాడు.

''ఏమో! నాకుమాత్రం ఏం తెలుసు? కాశీరామ్ చెప్పాడు... చేశాము!''

''మరి స్లోగన్స్''

''అదో సరదా! మరీ ఏమీ గొడవ చేయకపోతే ఏం బాగుంటుంది?''

మరో మోటార్ బైక్‌మీది స్టూడెంట్‌కూడా ఇదే అడిగాడు మరోలా!

''బస్సు తగలబెట్టింది మనమేనని తెలిస్తే?''

రెండో అతను చెప్పాడు!

''భయపడకు! అదంతా కాశీరామ్ చూసుకుంటాడు. అనవసరమయిన సందేహాలు, అనుమానాలు మానేసి...రాత్రికి కాశీరామ్ ఇవ్వబోయే పార్టీకి రెడీ అవు!''

రోడ్డుపక్కకి మలుపు తిప్పబోయి, దూరంగా వస్తున్న జీపును చూసి చప్పున ఆ ప్రయత్నం విరమించుకుని స్ట్రెయిట్‌గా ముందుకు పోనిచ్చాడు మోటార్‌బైక్‌ని!

మరొకటి ఎపుడో దాటిపోయింది ముందుకి!

★ ★ ★

''అయ్యా! చిత్తగించండి! పాలకొల్లు పనస పండు!'' వినయంగా అన్నాడు శీనయ్య.

పక్కనేవున్న పనసపండుని చేతిలోనికి తీసుకొని ముద్దుగా నిమిరింది నాల్గువేళ్ళకు ఉంగరాలున్న ఓ చెయ్యి.

ఆ చెయ్యి తాలూకు శరీరం పతక్కుర్చీలో ఇబ్బందిగా అటూఇటూకదిలి, మళ్ళీ సర్దుకుని అంది- ''అయితే ఏ వంటాడట మీ ఎమ్మెల్యే?''

శీనయ్య కొంచెం సిగ్గుగా నవ్వాడు.

''నాటు కోడి, వేట మాంసం, అడవి బాతు... సిద్ధం చేసారయ్యా! ఆనక... తమరి కిష్టమని సెప్పి మెడ్రాసు నుండి స్పెషల్ మందు... హైదరాబాదునుండి అందమయిన అమ్మాయిని తెచ్చామని చెప్పమన్నారయ్యా!''

ఉంగరాల చెయ్యి ఈసారి విలాసంగా మీసం దువ్వింది.

ఆ మీసం పైనున్న ముక్కుమీద బంగా

# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి




ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

### ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

### బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జి.పియన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్ పేట, ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత!!



## మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86·3

రవు పోగు తళుక్కున మెరిసింది.

కళ్ళు చిద్విలాసంగా నవ్వాయి. ఆ కళ్ళలో ఎర్రజీర స్పష్టంగా కన్పించింది. ఆ కళ్ళకి ఆకుపచ్చ కూడ ఎర్రగానే కన్పిస్తుంది.

ఎప్పటికయినా అనుకున్నది సాధిస్తాననే అచంచలమయిన నమ్మకం వుంది. అందుకే... ఎలాంటి పని చేయడానికయినా సిద్ధపడతాడు.

అంగ బలం, అర్థ బలం రెండూ వున్నాయి.

పోయిన ఎన్నికల్లో డిపాజిట్ గల్లంతయినా కూడా అధైర్యపడలేదు. అసలు పేరు మర్చిపోయి "మాజీ మినిష్టరు" అన్నా బాధపడలేదు. తనమీద తన పార్టీమీద గట్టి నమ్మకంవుంది.

అప్పటికీ... ఓ నర్సాపురం సిద్ధాంతి చెపితే... ముక్కు కుట్టించుకున్నాడు. ముక్కుపోగు కుట్టించుకుంటే తాను ఎప్పటికయినా సెంట్రల్ మినిష్టర్ అవుతాడట!

ఇంటగెల్చి రచ్చగెల్వాలనే మనస్తత్వం కలవాడు కాబట్టి, ముందర స్టేటు వ్యవహారాలలో ఎక్కువగా తలమునకలయి వున్నాడు.

ప్రస్తుతం దానికి సంబంధించి ఈ మధ్య ఓ పని చేయకలిగాడు. అందుకే... ఈ పార్టీ...

మాజీ మినిష్టరు శీనయ్య వైపుచూస్తూ "మొత్తానికి... మీ ఎమ్మెల్యే హడావిడి చేస్తున్నట్టున్నాడే..." అన్నాడు.

"అబ్బెబ్బే! అదేంలేదు! అంతా తమరి దయ! ఏదో మా ఎమ్మెల్యేగారు... సరదాపడి ఆచిన్న కోర్కె కోరారు... దాని ప్రకారం... బస్సు తగలెట్టించేశారు! ఇలాగే ఎపుడూ తవరి దయ మామీద చల్లగా..."

"అది సర్లే... ఇపుడే వంటున్నాడు ఆ బస్సు ఓనర్"

"ఏవంటాడు! కుక్కిన పేనల్లేపడివుంటాడు! లేకపోతే అంత పొగరా! ఊళ్ళో ఎమ్మెల్యే గారింటి దగ్గర బస్సు స్టాపు పెట్టించి ఆవమంటే ఆపడా?"

"అసలు కథ వాడిది కాదులే! మన అపోజిషన్ పార్టీవాడు అలా చేయిస్తున్నాడు వాడి చేత. కావాలని ఆపించడంలేదు. మన దెబ్బ వాడికి ఈ పాటికి తెలిసి వుంటుంది. ఎప్పటికయినా సెంట్రల్ మినిష్టర్‌ని కాకపోనూ... వాడి భరతం పట్టకపోనూ..." కసిగా పళ్ళు నూరుతూ అన్నాడు మాజీ మినిష్టరు.

శీనయ్య కొంచెం అనుమానంగా అడిగాడు...

"అయ్యా! మరి... బస్సు తగలెట్టిన సంగతి ... ఏదైనా గొడవ..."

ఫెళ్ళున నవ్వాడు మాజీ మినిష్టరు.

"పిచ్చివాడా! ఇదే రాజకీయం అంటే! చేతికి దుమ్ము అంటకూడదు! పని అయిపోవాలి! ఆ భయమేమీ పెట్టుకోకు. వున్నారుగా మన కుర్ర నాయకులు... అంతా ఆ స్టూడెంట్ల మీదకే పోతుంది. మనం అంతా తెర వెనుక! కాకపోతే కాస్త చెయ్యి తడపాలి అంతే! అసలే స్టూడెంట్స్! ఆవేశం ఎక్కువ ఇలాంటివి అంటే మరీ ఉత్సాహం! రేపు పేపర్‌లో ఈ వార్త ఎలా వస్తుందోచూడు... ప్రభుత్వ మొండి వైఖరికి విద్యార్థుల నిరసన... సరియైన విద్యావిధానం ప్రవేశపెట్టని అసమర్థ ప్రభుత్వం... అంటూ మార్మోగిపోవూ..."

గీతోపదేశం వింటున్న వాడిలా సంభ్రమంగా చూసాడు శీనయ్య...

మళ్ళీ అడిగాడు.. కొంచెం ఆగి.

"అంతేనంటారా... అయితే పోలీసుల గొడవ...అదీ..."

తాపీగా అభయమిచ్చాడు మాజీ మినిష్టరు.

"భయపడకు! హోమ్‌మినిస్టర్ బామ్మర్ది, నా బామ్మర్ది ఫ్రెండుకి బామ్మర్దేలే!"

"అయ్యా! అయితే శెలవామరి! పార్టీకి తవరు తప్పక..."

"అలాగలాగే! కాస్త మీ ఎమ్మెల్లేకి నేను చెప్పానని చెప్పు! బొత్తిగా సిటీలోపడి చెడతిరగక కాస్త మన నియోజకవర్గపు ప్రజలకు ముఖం చూపించమను అపుడపుడు... ఎలక్షన్లు దగ్గరకొస్తున్నాయి"

శీనయ్య వినయంగా సెలవు తీసుకుని బయటకు వచ్చాడు.

అపుడు ఎదురువచ్చాడు ఆ యువకుడు-

కాశీరామ్!

నన్నగా విజిల్‌వేస్తూ వచ్చాడు. ఆ నడక నడకలాలేదు.

డాన్స్ చేస్తున్నట్లుగా వచ్చాడు లోపలికి!

మాజీ మినిస్టరు ఉత్సాహంగా ఆహ్వానించాడు కాశీరామ్‌ని!

"రావయ్యా! రా! కాబోయే కొత్తపార్టీ నాయకుడా! రా!"

కాశీరామ్ నవ్వాడు.

"ఏమిటి గురూగారూ! కొత్తపేర్లు పెడుతున్నారు. ఏదో మీ పని చేసిపెడుతున్నాను. అందుకుగాను మీ చేతికి అంటాల్సిన దుమ్ము... నా చేతికి అంటినందుకు... మీరు... నా చెయ్యి కడుగుతారు... ఏదీ కడగండి" చెయ్యి జాపాడు ఉత్సాహంగా!

మాజీ మినిస్టర్ చురుకుగా చూస్తూ అన్నాడు-

"కాశీరామ్! నువ్వు ఘటికుడివి! హాయిగా ఆ కాలేజి వదిలిపెట్టి బయటకు రాకూడదూ! ఇద్దరం కలిసి కొత్తపార్టీ పెడదాం!"

కాశీరామ్ పకాపకా నవ్వాడు.

"మీకు తెలీదులెండి అందులోని ఎంజాయ్‌మెంట్! ఓ.కే. అవన్నీ తర్వాత. ఏదీ డబ్బు!"

ఆయన బలవంతాన కుర్చీలో పక్కకు ఒరిగి, లాల్చీ జేబులో చెయ్యిపెట్టి రెండు నోట్లకట్లను బయటకుతీసి, కాశీరామ్ చేతిలో పెట్టాడు.

చకచకా ఆ నోట్లను లెక్కపెట్టి "థాంక్యూ!" అంటూ ముద్దుపెట్టుకుని, పాంటు జేబులోకి తోశాడు.

"బైదిబై! రేపు... అంటే సన్‌డే నైట్ నాకు మీ గెస్ట్‌హౌస్ ఇవ్వాలి!"

"ఎందుకు?" ముఖం చిట్లించి అన్నాడు మాజీ మినిస్టరు.

"సుదూర తీరాలనుండి మా ఫ్రెండ్స్ వస్తున్నారు. మరి అంతదూరం నుండి అలసివస్తున్న వాళ్ళకి... అతిథి మర్యాదలకి..."

ఒక్కక్షణం మౌనంగావుండి "నీ ఇష్టం!" అన్నాడు.

"ఓ.కే! థాంక్యూ! మళ్ళీ కలుస్తాను... బై!" అంటూ ఉత్సాహంగా వెళ్ళిపోయాడు కాశీరామ్!

★ ★ ★

ఆదివారం రాత్రి పదిగంటలవేళ!

వాతావరణం నిశబ్దంగా వుంది.

ఆరోజు పౌర్ణమి అయినా మబ్బువట్టి ఉండటంవలన చీకటిగానే వుంది.

దూరంగా ఎక్కడో సినిమా పాటలు మాత్రం విన్పిస్తున్నాయి.

ఊరికి దూరంగా... ఇళ్లకి దూరంగా కాస్త విసిరేసినట్లుగావున్న ఆ గెస్ట్‌హౌస్‌లో...

మేడమీద గదిలో...

నీలం బల్బుమాత్రం వెలుగుతోంది నీడల్ని సృష్టిస్తూ!

ఆ నీడలజాడల్లో మత్తుగా, జోగుతున్నట్లుగా పడివున్నారు ఇద్దరు యువకులు, ఇద్దరు యువతులు.

ఆ ఇద్దరిలో ఒకడు కాశీరామ్.

మిగతావాళ్లు అతని ఫ్రెండ్స్ అని చెప్పుకునే హిప్పీలు!

కాశీరామ్ ఒక యువతి ఒళ్ళో తలపెట్టుకుని ఉన్నాడు. అతని పక్కనే అంతక్రితం కాల్చిపడేసిన సిగరెట్‌పీకలు పడివున్నాయి.

మూతలుతీసి పడేసిన సీసాలు దొర్లుతున్నాయి.

అందరూ దాదాపు అర్ధనగ్నంగా ఉన్నారు.

"డియర్" కాశీరామ్ మెల్లగా పిలిచాడు.

ఏదో ఆలోచనలో పడి ఉన్నట్లున్న ఆ యువతి, తేరుకుని "ఊ!" అంది.

"నాకోసం ఏం తెచ్చారు?"

ఆ యువతి నవ్వింది. నెమ్మదిగా చెయ్యి జాచి పక్కనే పడివున్న హేండ్‌బాగ్‌లోనుండి తీసింది ఓ సీసా.

ఆ సీసాను చూసేసరికి కాశీరామ్‌కళ్ళు తళుక్కున మెరిశాయి.

పావడర్స్!

ఓ విదేశంనుండి ఈ దేశంలోకి దొంగచాటు

గా చేరుతున్న కొత్త మత్తుమందు.

చటుక్కున ఆ సీసా చేతుల్లోకి తీసుకుని కాశీరామ్ ఆమె చేతుల్ని ముద్దుపెట్టుకుంటూ అన్నాడు- "థాంక్యూ డియర్! థాంక్యూ వెరీ మచ్! ఇంత బ్యూటీఫుల్‌గా ఉన్నావు. ఇంతకీ నీ పేరేమిటి!"

ఆ యువతి నవ్వింది అదోలా! భరించలేని నిరాశ ఉంది ఆ నవ్వులో.

కాని ఆ నీలినీడల్లో కాశీరామ్ గమనించలేదా సంగతి.

"ఏమో" అంది.

"ఏమో! వాటె బ్యూటీఫుల్‌నేమ్!" వకవకా నవ్వుతూ ముందుకు ఒరిగిపోతూ అన్నాడు కాశీరామ్.

"ఏం చదివావు ఏమో!"

హఠాత్తుగా ఏడుపు తన్నుకువచ్చింది ఆ యువతికి.

"అరెరె! ఏమయింది?"

"నో! నో! ఏమీలేదు. ఏవో గుర్తుకువచ్చాయి! కమాన్! ఏదీ! పావర్స్ ఓపెన్‌చేయి"

"ఊహు! నా పార్టనర్ దిగులుగా ఉంటే నాకు సంతోషం ఏముంది? చెప్పు ఏమయింది!" గుంటలుపడిన ఆమెకళ్ళని, ఆ కళ్ళక్రింది నల్లటి చారలని, మెడక్రిందపట్టిన మురికిని, గాలికి వదిలేసిన జుట్టుని, సన్నగా వణుకుతున్న ఆమె పెదాలని చూస్తూ అడిగాడు కాశీరామ్.

చిన్న చుక్కలా రాలిన కన్నీటిబొట్టు... కాసేపటికి కన్నీరు ధారలుకట్టింది.

"...అవును...మీ ఆంధ్రప్రదేశ్ రాగానే...నాకెందుకో మళ్ళీ అమ్మా నాన్న గుర్తుకువచ్చారు...నేనే... చేతులారా చెడగొట్టుకున్నాను... నా జీవితాన్ని... తెలియని ఆవేశంలో...పిచ్చిలోపడి... ఇలా మత్తుపదార్థాలకి అలవాటుపడి... మందులకు బానిసగామారి... నా కాలేజ్ ఫ్రెండ్స్‌కి... అమ్మానాన్నలకి ముఖం చూపించలేక... ఇలా... ఎవరి మాటలోనమ్మి... చివరికి ఇలా అయిపోయాను... లేకపోతే... ఎక్కడో మధ్యప్రదేశ్‌లో ఉండే నేను... ఇక్కడ...ఇలా... ఓ! గాడ్!..."

ఆశ్చర్యంగా ఆమెనే చూస్తున్న కాశీరామ్ ఉలిక్కిపడ్డాడు.

ఆమె చేతివేళ్ళు వణుకుతున్నాయి. క్రమక్రమంగా ఆ వణుకు చేతులకు కూడా పాకింది.

ముఖమంతా చెమటపట్టింది.

ఇపుడు ఆమెకి కావల్సింది ఏమిటో తెలుసు కాశీరామ్‌కి!

దానికోసం పక్కకు తిరిగేసరికే...

రెడీగా ఉన్నాడు చేతిలో సిరెంజితో మరో హిప్పీ!

శరీరంలోకి నీడిల్ దిగుతుంటే మత్తుగా మూలిగింది. "థాంక్యూ...థాంక్యూ!"

మార్ఫియా పనిచేయడం ప్రారంభించింది.

నెమ్మదిగా చేతులమీద ఆసరాగా లేచి నించుంది. ఒళ్ళు ఒక్కసారిగా తూలింది. చప్పున గోడపట్టుకుని, నెమ్మదిగా ముందుకు నడిచి, కిటికీరెక్క తీసింది.

ఆ గెస్ట్‌హౌస్ ఎత్తయిన ప్రదేశంలో ఉండటంతో చలిగాలి రివ్వున కొట్టింది.

ఆ గాలికే గజ గజా వణికిపోయి, తలుపు వేయబోతుంటే...

మూతలుపడుతున్న ఆమెకళ్ళకు...

మసక మసగ్గా...

నిర్మానుష్యంగా ఉన్న తారురోడ్డుమీద...

దూరంనుండి పరిగెత్తుకొస్తున్న ఓ యువకుడు కన్పించాడు.

ఆ పరుగు ఓ ప్రభంజనంలా ఉంది...

వడివడిగా ముందుకు ఉరుకుతున్న జలపాతంలా ఉంది.

క్రమ క్రమంగా కళ్ళకి మసకతెరలు కమ్మేశాయి.

అప్పటికే మిగతా ముగ్గురూ మత్తుగా దొర్లుతున్నారు...

వాళ్ళు తెలియని స్థితిలో... పరిస్థితిలో...

★ ★ ★

బయట...

పరిగెత్తుతున్నాడు చెందూ!

పిచ్చివాడిలా!

నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద. ఆ నిశ్శబ్ద

వాతావరణంలో... తన అడుగులచప్పుడు తనకే విన్పిస్తోంది.

అంతటి చల్లటి గాలిలోనూ... చెమట ధారలుగా కారుతోంది.

ఆయాసం వస్తోంది.

వెనక్కి తిరిగి చూడాలంటే భయం వేస్తోంది.

ఇంకా బూట్లశబ్దం వెంటాడుతునే ఉన్నది చెవుల్లో మార్మోగుతూ.

ఆ శబ్దం ఎంతగా వెంటాడకపోతే, మూడు కిలోమీటర్లు వెనక్కి తిరిగి చూడకుండా పరిగెత్తగలడు?

దురదృష్టమేమిటంటే... మధ్యలో కనీసం ఎక్కడా ఆటోకాని, రిక్షాకాని కన్పించకపోవడం.

అయినా ఆ సమయంలో... అవి ఎక్కాలన్నా భయం.

ఎందుకో తెలియని భయం!

ఇంకా ఎంతదూరం?

పరిగెత్తేకొద్దీ దూరంపెరుగుతున్నట్లనిపిస్తోంది.

తన ఇల్లుకొన్ని వేలమైళ్లదూరంలో ఉన్నట్లు అన్పిస్తోంది.

కనుబొమల మీదుగా జారుతున్న చెమటధారలు కంటికి అడ్డుపడుతున్నాయి. ఒగరుస్తూ ఒక్కక్షణం నిలబడి గుండెలనిండా ఊపిరిపీల్చుకున్నాడు. మళ్లీపరిగెత్తడం మొదలెట్టాడు.

శరీరం తూలిపోతున్నట్లనిపిస్తోంది.

స్ట్రీట్ మధ్య అపుడు కన్పించింది ఆ బంగ్లా... తన ఇల్లు...

ఒక్కసారిగా...ఎక్కడలేని నీరసం ముంచుకొచ్చింది.

ఒక్కొక్కఅడుగు ఎంత భారంగా వేసేటంటే... ఇంతదూరం తను పరిగెత్తుకొచ్చిన దూరానికి- ఈ నాలుగు అడుగులదూరం రెట్టింపు అన్పిస్తోంది.

ఇంట్లోకి అడుగు పెట్టిన మరుక్షణం...

తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుని మంచంమీద వెల్లకిలా పడిపోయాడు.

ఒక పదినిముషాలవరకూ మెదడు మొద్దుబారిపోయినట్లనిపించింది. కాసేపటివరకూ మనసు స్వాధీనంలోకి రాలేదు.

క్రమక్రమంగా జరిగిన సంఘటనలు గుర్తుకు రాసాగాయి...

కేవలం-రెండుక్షణాల వ్యవధిలో తను ఆరోడ్ క్రాస్‌చేసి ఉండకపోతే ఈపాటికి జైల్లో కూర్చుని ఊచలు లెక్కపెడుతూ ఉండేవాడేమో!

తలచుకుంటుంటేనే అదోలా ఉంది.

రమేష్ ఏమయ్యాడో!

అసలు... ఇలాంటివి రమేష్‌కి కొత్తకాదేమో! జరిగిన సంఘటన మనసులో రీలులా తిరిగిపోయింది చకచకా... అన్నీ గుర్తుకు తెచ్చుకున్నాడు వరుసగా...

రెండురోజులక్రితం.

కాలేజిలో...సెకండ్‌పిరియడ్ జరుగుతోంది!

తనకి పక్కనే ఉన్న బెంచి... అది లాస్ట్ బెంచ్...

కాశీరామ్ చేతిలో ట్రాన్సిస్టర్ వుంది. ఆ చెయ్యి డెస్క్‌లోనికి వుంది.

సన్నగా విన్పిస్తోంది... క్రికెట్ కామెంటరీ!

ఈ సంగతి అందరికీ తెలుసు!

లెక్చరర్‌కి కూడా! కాని ఏమీ అనడు! కాశీరామ్ ని ఏదయినా అనడానికి ఏలెక్చరరూ సాహసించడు.

మధ్యమధ్యలో ముందు బెంచీలలోని స్టూడెంట్స్ పనిమీద వచ్చినట్లుగా వచ్చి, కాశీరామ్ పక్కన కూర్చుని "గురూ! స్కోరెంత?" అని వివరాలు తెలుసుకుని, చిన్నగా దగ్గి, సర్దుకుని వెళ్లిపోతుంటారు.

ఇంట్రస్ట్ ఉండి, ఈ చివరి బెంచివరకు రాలేని వారికి, ఎప్పటికపుడు స్లిప్‌మీద స్కోరు వివరాలు వేసి పంపుతుంటారు.

ఆ స్లిప్స్, ఆ క్లాస్ మొత్తం తిరిగి, పక్కరూమ్ వరకూ వెళుతూంటాయి. ఒకసారి ఈ తతంగం అంతాచూసిన ఓ బుద్ధిమంతురాలయిన విద్యార్థిని ఒళ్లుమండి కంప్లయింట్ ఇవ్వడానికి ప్రిన్సిపాల్‌రూమ్‌కు వెళ్ళింది.

చెప్పడానికి నోరు తెరిచిన ఆమె అలాగే ఉండిపోయింది.







క్రికెట్ కామెంట్రీ వస్తున్న ట్రాన్సిష్టర్‌ని నెమ్మదిగా లోపలికి జరిపి, ఏమీ జరగనట్లుగానే నవ్వుతూ అడిగాడు ఆ ప్రిన్సిపాల్ "ఏమిటమ్మాయి సంగతి!" క్షణంలో తేరుకుని "స్కోరెంతో తెలుసుకుందామని!" అని చప్పున వెనక్కి తిరిగి వచ్చేసింది.

అలా అది మామూలయిపోయింది.

క్లాసులో ఆడపిల్లలు పుస్తకాలలో నవలలు పెట్టుకుని చదవడం ఎంత మామూలో మగపిల్లలు డెస్కులో మినీ ట్రాన్సిష్టర్ పెట్టుకుని క్రికెట్ కామెంటరీ వినడం కూడా అంతే మామూలయిపోయింది.

ముందర బెంచీలో కుర్రాడు తొందర చేస్తున్నాడు స్కోరెంతో స్లిప్ పంపమని.

రెండూ పక్కకు వంగి "గురూ! స్కోరు!" అన్నాడు.

కాని ఆ రోజు కాశీరామ్, రమేష్ ఎప్పటిలా ఉత్సాహంగా లేరు.

ముఖాలు కొంచెం సీరియస్‌గా ఉన్నాయి.

కామెంట్రీ వినడం లేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారు.

"గురూ...స్కారు!" మళ్లీ అడిగాడు.

వాళ్లు విన్పించుకోలేదు.

ఏదో చిన్నగా, గున గునగా చర్చిస్తున్నారు.

పీరియడ్ అయిపోయాక... రమేష్‌ని అడిగాడతను సంగతేమిటని!

రమేష్ టాపిక్ మార్చబోయాడు తప్ప, చెప్పలేదు.

కాని, తను ఒప్పుకోలేదు. వంతం పెరిగింది.

రమేష్ తనకి చాలా క్లోజ్ అవడంతో కాసేపటికి ముఖమాటంగా బలవంతంగా ఒప్పుకున్నట్లుగా అన్నాడు-

"అయితే ఎక్కడా, ఎవరితోనూ చెప్పకూడదు...సీక్రెట్!"

"ఏమిటది!"

"చెప్పను! నాతో తీసుకెళతాను అక్కడికి! నువ్వు ఏంమాట్లాడకూడదు! సరేనా!" తనకేదో రహస్యం భేదించబోతున్నంత థ్రిల్లింగ్‌గా ఉంది.

"సరే!" అన్నాడుతను.

కాని ప్రమాదం ఊహించలేదు తను.

సిటీకి దూరంగా...

ఇరుకు సందుల్లో, ఒకరి చెయ్యి మరొకరు పుచ్చుకుని గబగబా నడుస్తున్నారు చందూ, రమేష్.

రాత్రి తొమ్మిది గంటల సమయం.

అయినా ఆ వీధుల్లో చీకటిగా ఉంది. వీధి లైట్లున్నా వెలగడం లేదు. ఇళ్ళు ఇరుకు ఇరుకుగా, దగ్గర దగ్గరగా అనుకుని ఉన్నాయి. భరించలేని వాసన.

రమేష్ చందూ చెయ్యి పుచ్చుకుని త్వరగా నడుస్తున్నాడు.

అంత స్పీడుగా నడుస్తున్న రమేష్ చుట్టుపక్కల్ని మనుషుల్ని చాలా జాగ్రత్తగా గమనిస్తున్నట్లుగా గ్రహించాడు చందూ.

రమేష్ ఏమీ మాట్లాడకుండా సీరియస్‌గా ఉన్నాడు.

చందూ అదేమీ పట్టించుకోలేదు.

వచ్చేటపుడు రమేష్ ఎన్నో జాగ్రత్తలు చెప్పాడు. అప్పటికీ- ఎన్నోసార్లు డిస్కరేజ్ చేయడానికి ప్రయత్నించాడు. చిన్నగా భయపెట్టాడు కూడా! కాని చందూలోని కుతూహలం రెట్టింపు అయిందేకాని, తగ్గలేదు.

చందూకు చూచాయగా తాము ఎక్కడికి వెళుతున్నామో తెలుసు! అయినా తొందరపడి బయటపడదలుచుకోలేదు.

రమేష్ ఎక్కువగా చీకటిగా ఉన్నవైపే నడుస్తున్నాడు.

సందులూ, గొందులూ తిప్పి తీసుకెళుతున్నాడు.

కొండగాలి బాగా దగ్గరగా వస్తోంది. ముసురు వాసన మరింత పెరిగింది. దాదాపు నలభయి నిముషాల నడక తర్వాత...

ఒక చిన్న సందులోకి ప్రవేశించారు ఇద్దరూ!

చాలా ఇరుకు సందు!

ఒక వైపు పెద్ద పెంకుటిల్లు, దానిని అనుకుని రెండు గుడిసెలు!

సరిగ్గా ఆ గుడిసెలకు ఎదుర్గుగా ఉంది. శిథిలావస్థలో ఉన్న ఓ మేడ!

ఆ పరిసరాలలో వెలుతురు చాలా తక్కువగా ఉంది.

వెన్నెల వెలుగులో ఆ మేడ మసక మసకగా ఉంది. పెచ్చులూడిపోయిన స్థంభాల్తో!

రమేష్ వెంటనే ఆ మేడవైపు నడవలేదు. చెందూ చెయ్యి గుంజినట్లుగా ఆపి, రెండు నిముషాలు అక్కడే, చీకటిలో గోడవారగా నిశ్శబ్దంగా నించున్నాడు.

అటువైపు ఎవరూ రాలేదు, నాల్గు నిముషాల వరకు.

చెందూ ఊపిరి బిగపట్టి చూస్తున్నాడు.

నిముషం తర్వాత...

రమేష్ అన్నాడు! "చెందూ... చెప్పినవన్నీ గుర్తున్నాయిగా! జాగ్రత్త!"




చెందూ తల ఊపాడు.

మరుక్షణం, వరుగులాంటి నడకతో రమేష్ చెందూని ఆమేడవైపు తీసుకు వెళ్లాడు.

ఆ మేడకి మెయిన్ గేటుఓరగా తెరిచి ఉంది. దానికి ఉన్న ఇనుప ఊచల మీదికి ఏవో చెట్ల తీగలు అల్లిబిల్లిగా అల్లుకుని ఉన్నాయి. లోపల ఆవరణ పెద్దగా లేదు.

నాలుగు అడుగులు వేయగానే మేడలోనికి వచ్చేశారు.

లోపల కూడా బాగా శిథిలావస్థలో ఉంది. పైకి వెళ్ళడానికి మెట్లు లోపలినుండే ఉన్నాయి. శిథిలావస్థలో ఉన్న స్థంభాల మీదుగా చాలాచోట్ల బూజు వేలాడుతోంది.

రమేష్ మెట్ల వక్కగా ఉన్న ఒక గదివైపు నడిచాడు.

చెందూ నిశ్శబ్దంగా అనుసరించాడు.

మెట్లని ఆనుకుని ఉంది తలుపు.

రమేష్ దాని దగ్గరకి వెళ్ళి మునివేళ్ళతో చిన్నగా తట్టాడు.

రెండు క్షణాల అనంతరం..

ఆ తలుపు ఓరగా తెరుచుకుని...ఓ తల బయటకి వచ్చింది. ఆ ముఖం ఎవరిదో...ఆ చీకటిలో చెందూకి స్పష్టంగా కన్పించలేదు. రమేష్ చిన్నగా, గొణిగినట్లుగా ఏదోచెప్పాడు ఆవ్యక్తితో. ఒక్క క్షణం ఆ వ్యక్తి ఆలోచనలోపడి... తలతిప్పి చెందూవైపు చూసాడు. ఏమనుకున్నాడో... పక్కకు తప్పుకుని తలుపు పూర్తిగా తెరిచాడు.

రమేష్ చెందూ లోపలికి అడుగుపెట్టారు.

వెనకే తలుపు మూసుకుపోయింది.

చెందూకి ఒక్కసారిగా ఊపిరి స్థంభించిపోయినట్లయింది.

అతను అనుకున్నట్లుగా అది చిన్న గదికాదు.

విశాలమయిన హాలు.

అంతేకాదు.

ఆ హాలులో దాదాపు ఇరవయి, ముప్పయి మంది వరకూ... కూర్చుని ఉన్నారు నేలమీదనే.

అందరూ దాదాపు తన వయసువాళ్ళే!

తలుపు తెరవగానే, అందరూ ఒక్క క్షణం తలతిప్పి చూసి మళ్ళీ మామూలు పొజిషన్లోకి వచ్చి నిశ్శబ్దం అయిపోయారు.

రమేష్, చెందూ ఒక మూలగా గోడకాను కొని కూర్చున్నారు. హాలులో చిన్న బల్బు...ఎర్ర బల్బు...మాత్రం వెలుగుతోంది.

అదో విధమయిన నిశ్శబ్దం ఆ పరిసరాలల్లో అలుముకుని ఉంది.ఆ వాతావరణ ప్రభావమో, ఏమోకాని చల్లటిగాలి వీస్తున్నట్లుగా ఉంది. క్రింద, నేల కూడా బాగా చల్లగా ఉంది.

అందరూ...ధ్యానంలో ఉన్నట్లుగా నిశ్శబ్దంగా ఉండిపోయారు.

చందూ ఊపిరి బిగపట్టి చూస్తున్నాడు.

దాదాపు అయిదు నిముషాల అనంతరం...

తలుపు ఓరగా తెరుచుకుంది....

అందులోనుండి... లోపలికి ప్రవేశించాడు ఓ. వ్యక్తి.

వెంటనే తలుపు మూసుకుంది.

ఒక్కసారిగా హాలులో అందరూ హడావిడిగా లేచి నించున్నారు. చెందూకూడా కంగారుగా లేచి నించున్నాడు.

అపుడు చూసాడు.

ఆ నించున్నవాళ్ళల్లో చాలామంది... తనకు తెలిసిన వాళ్ళే!

స్టూడెంట్స్ ఎక్కువగా!

తనకి సీనియర్స్! కొంతమంది జూనియర్స్! ఆ వ్యక్తి కూర్చోమన్నట్లుగా చెయ్యెత్తి సైగచేసాడు. అలా చెయ్యి ఎత్తగానే చేతికి ఉన్న రెండు వజ్రపు ఉంగరాలు తళుక్కున మెరిశాయి. అందరూ, నిశ్శబ్దంగా కూర్చున్నారు.

అందరి ముందుకు వెళ్ళి నించున్నాడు ఆ వ్యక్తి. ఒక్క క్షణం హాలంతా కలియచూసి, చిన్నగా దగ్గి అన్నాడు...

"ఫ్రెండ్స్...."

చెందూకి అతన్ని ఎక్కడో చూసినట్లు అన్పిస్తోంది. కాని ఎక్కడో అర్థం కావడంలేదు.

"... ఈ సమావేశం ఇంత హఠాత్తుగా ఎందుకు ఎరేంజ్ చేయాల్సి వచ్చిందో మీకు

కొంతవరకు తెలిసే ఉండవచ్చు. మరి కొద్ది రోజులలో సిటీలో గణేశ్ నిమజ్జనం జరగబోతోంది. అదే రోజు సెంట్రల్ మినిస్టర్స్ ఇద్దరు వస్తున్నారు... ఎందుకో మీకు తెలుసు. వాళ్ళు వచ్చేది ఆ ఉత్సవ సందర్భంగా కాదు... త్వరలో రాబోయే ఎలక్షన్స్ గురించి ప్రచారం మరోలా ప్రవేశపెట్టడానికని... అందుకే... ఖండించండి... ఈ పెట్టుబడి దారీ వ్యవస్థను సమూలంగా నాశనం చేయండి..ఈ బూర్జువా ప్రభుత్వం...''

చెందూకి అయోమయంగా ఉంది.

ఈ బూర్జువా ఏమిటో, పెట్టుబడిదారీ వ్యవస్థ ఏమిటో... అసలు అర్థం కావడంలేదు.

తలతిప్పి చూసాడు.

మిగతా శ్రోతలు అందరూ భక్తిగా, ఎంతో శ్రద్ధగా వింటున్నారు....

ఆ వ్యక్తికి ఒక్కసారిగా ఆవేశం ముంచుకొచ్చింది.

ఆవేశంతో, పిడికిళ్ళు బిగించి గాలిలోనే ఫెడీఫెడీమని గుద్దుతూ ఉపన్యాసం ఇస్తున్నాడు. ఒళ్ళంతా చెమటలు పట్టాయి.

వాతావరణం క్రమంగా వేడెక్కింది.

''... కాబట్టి మనం పీడిత..వర్గ చైతన్యం...కోసం...''

చెందూకి కాసేపాగితే పిచ్చెక్కేలా ఉంది.

ఆ వ్యక్తి ఎందుకలా ఆవేశపడిపోతున్నాడో, ఎందుకలా మాటిమాటికీ బూర్జువా, పెట్టుబడి దారీ వ్యవస్థ... అంటున్నాడో అర్థం కావడంలేదు.

కాసేపటికి హఠాత్తుగా ఆగిపోయాడు ఆ వ్యక్తి.

జేబులోనుండి కర్చీఫ్ తీసి చెమటలుపట్టిన ముఖాన్ని తుడుచుకున్నాడు. బలంగా ఊపిరి పీల్చుకుని...మళ్ళీ మొదలెట్టాడు.

''ఫ్రెండ్స్! అందుకే...ఆ ఉత్సవం జరగడానికి వీలులేదు. మనం ఓ మాష్టర్ ప్లాన్ తయారుచేసాం. ఇపుడు అది మీకు వివరించబోతున్నాను. మిమ్మల్ని నాలుగు గ్రూపులుగా చేసి, ఒక్కొక్క గ్రూప్... ఎలా వ్యవహరించాల్సిందీ... చెబుతాను... ముందు... అసలు... గణేశ్ విగ్రహం ఎక్కడనుండి ఊరేగింపు మొదలయి... ఏ సెంటర్స్ మీదుగా నది దగ్గరకు వస్తుందో... మీకు అవగాహన కలగాలి...''

అంటూ జేబులో నుండి చిన్న కాగితం మడత తీశాడు.

మడతలుగా ఉన్న మేప్ అది.

పూర్తిగా విప్పతీశాడు.

ముందు వరసలో కూర్చున్న ఓ కుర్రాడు చప్పున లేచి ఆ కాగితం అందరికీ కన్పించేలా పట్టుకున్నాడు.

ఆ వ్యక్తి జేబులో నుండి పెన్‌టార్చ్‌తీసి ఆమేప్ మీదకి ఫోకస్ చేస్తూ వివరించసాగాడు.

ఆ మేప్ నిండా రకరకాల గీతలు...బొమ్మలూ ఉన్నాయి.

''చూడండి...ఇక్కడ ఈ సెంటర్ నుండి మన కార్యక్రమం ప్రారంభమవుతుంది... అక్కడ జనంలో కల్సిపోతాము... మొదటగ్రూప్ అన్నమాట... రెండవ గ్రూప్... ఇక్కడ... ఈ మలుపు దగ్గర... ఇలా...''

అందరూ దాదాపు ట్రాన్స్‌లో ఉన్నట్లుగా ఉన్నారు.

రమేష్ కూడా ఎంతో భక్తిశ్రద్ధలతో వింటున్నాడు ఆ ప్లాన్. కాని... ఇబ్బందిగా... అనీజీగా ఉంది చెందూకి.

ఆ వాతావరణం..., ప్రత్యేకించి...ఆ మాటలు...అదోలా ఉన్నాయి...

మొదట్లో ఏమిటో తెలుసుకోవాలని ఉబలాటపడ్డాడుకాని, ఇపుడేమిటో చప్పచప్పగా... ఎందుకొచ్చానా అన్నట్లుగా ఉంది. ఆవ్యక్తి చెప్పే ఉపన్యాసం వినడం ఎపుడో మానేశాడు.

విసుగ్గా గోడకి చేరగిలపడబోతుంటే...

అపుడు విన్పించింది...

ఒక విధమైన శబ్దం!

బయటగేటు ఫెళఫెళమని విరుగుతున్న శబ్దం!

ఒక్కసారిగా ఆ వ్యక్తి ఉలిక్కిపడ్డట్లయి, ఉపన్యాసం ఆపేశాడు.

అందరూ... అయోమయంగా గబగబా ఊపిరిపీలుస్తూ, చెవులు రిక్కించి వినసాగా





# అందం – ఆరోగ్యం

## JEEVANTONE

బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.



ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగలరు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి,
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

'' MFG. LICENCENU. AUS 59/75''

Contact our new sole Distributors

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**






ఏ.పి.పి
కొరకు

జీవన్‌టోన్ ప్రాడక్ట్స్
పి.బి.నం. 880,17/2
కేంబ్రిడ్జి రోడ్
బెంగుళూర్-560 008

450 Grams Rs. 36/-

SINDU

రు...

రెండు క్షణాలకి...

బరువుగా ఇటువైపు పరిగెత్తుకొస్తున్న బూట్ల శబ్దం!

ధడధడమని పెద్దగా శబ్దం చేసుకొంటూ దగ్గరవుతోంది ఆ బూట్ల శబ్దం!

అంతే! ఒక్క సారిగా... అందరూ చప్పున లేచి నిలబడ్డారు.

వెంటనే వెనుకవైపునున్న తలుపు తీశారు.

మూకుమ్మడిగా సన్నటి ఆ ద్వారం లోనుండి అందరూ, తొక్కుకుంటూ బయటకి పోసాగారు.

అప్పటికే రమేష్, చెందూ చేయి పుచ్చుకొని గబగబా ఆ ద్వారం వైపు లాక్కెళ్ళాడు.

అందరూ ఒక్కసారిగా పట్టలేదు ఆ ద్వారంలో. చెందూకి ఊపిరి అందలేదు.

ఎవరో చెయ్యి గట్టిగా పుచ్చుకొని బయటకి లాగారు...

వెనుక అంతా విశాలమైన పెరడు... ఎన్నోరకాల మొక్కలు... పిచ్చిచెట్లు! దూరంగా ప్రహరీగోడ... అస్పష్టంగా కన్పిస్తోంది.

రమేష్ చిన్నగా అరుస్తున్నాడు.

"చెందూ... రన్! రన్! "

చెందూకు ఆ మొక్కలని తప్పించుకొని పరిగెత్తడం బ్రహ్మాప్రళయంగా ఉంది.

ఆ ప్రహరీ వెనుకవైపు పరిగెడుతుంటే... విన్పించింది...

హృదయవిదారకమయిన కేక! వెన్వెంటనే లాఠీలతో తపతపా కొడుతున్న శబ్దం!

లోపలికి ప్రవేశించారన్నమాట పోలీసులు!

తలతిప్పబోతుంటే, రమేష్ ముందుకు తోసాడు. ముందుకు తూలబోయి, నిలదొక్కుకుని మళ్ళీ పరుగు ప్రారంభించాడు.

అతికష్టం మీద ప్రహరీ గోడ దగ్గరికి వచ్చారు. అప్పటికే పదిమందివరకూ గోడదూకి తప్పించుకోగలిగారు.

చెందూకి గోడ ఎక్కడం కష్టంగా ఉంది.

రమేష్ బలవంతంగా, నడుము పట్టుకుని పైకిఎత్తాడు. జారిపోతున్న ఆసరాను చప్పున పట్టుకుని అవతలకు దూకబోతూ... అపుడు తలతిప్పి చూసాడు చందూ...

లోపలినుండి వెర్రెక్కినవాళ్ళలా పరిగెత్తుకువస్తున్న కుర్రాళ్ళ మీదకి లాఠీలతో విరుచుకుపడుతున్నారు పోలీసులు!

ఆ లాఠీ దెబ్బకి, ఒకతని కాలిమడమ చచ్చుపడి ముందుకు పడిపోయాడు.

పోలీసులు అంతటితో ఆగలేదు.

ప్రహరీగోడ వైపు పరిగెత్తుకొస్తున్నారు.

అప్పటికే చెందూ, రమేష్ రోడ్డుమీదకి దూకేశారు.!

అంతెత్తు నుండి ఒక్కసారిగా దూకడంతో నడుము, కాళ్ళు పట్టేసినట్లయింది.

చెందూ చప్పున లేవలేకపోయాడు.

రమేష్ చెయ్యి అందించి లేపి, దాదాపు లాక్కెలుతున్నట్లుగా పరుగు ప్రారంభించాడు.

సందు మలుపు తిరగబోతూ... ఇద్దరూ తల తిప్పి చూసారు.

పోలీసులు... గోడదూకి వస్తున్నారు తమవైపే!

పసిగట్టారన్నమాట!

అంతే!

చెందూకి ఎటువెళుతున్నాడో తెలియదు. చెయ్యి రమేష్ చేతిలో ఉంది. ఎటో తీసుకెళుతున్నాడు.

ఎన్నెన్నో సందులు. మలుపు తిరుగుతున్నారు!

గాలికన్నా వేగంగా... మసక వెన్నెలని చీల్చుకుంటూ...

అయినా ఎంతో దగ్గరగా బూట్లశబ్దం విన్పిస్తోంది.

చెందూకి ఆయాసం వస్తోంది. ఊపిరి అందడంలేదు.

వెన్నెలో నుండి చలి వస్తోంది. వణుకు వస్తోంది.

అయిపోతోంది! తన పని అయిపోతోంది. పట్టుబడిపోతాడా!

రమేష్ పళ్లుబిగపట్టి పరిగెత్తుతున్నాడు. చెందూని దాదాపు లాక్కెళ్లుతున్నాడు.




కొంతదూరం వెళ్లాక...

ఇద్దరూ హఠాత్తుగా ఆగిపోయారు.

అంతా ప్రశాంతంగా ఉంది! ఎక్కడా ఎలాంటి శబ్దంలేదు.

రమేష్ చెందూ చెయ్యి వదిలి నెమ్మదిగా ఊపిరి పీల్చుకోసాగాడు...

గబగబా ఊపిరి పీలుస్తున్న చెందూ దృష్టి లోపడ్డారు... దూరంగా మలుపు తిరిగివస్తున్న పోలీసులు!

"రమేష్!" గొణిగాడు.

రమేష్ చప్పున కదిలాడు, పక్కనందులోకి!

అప్పటికే ఆలస్యం అయిపోయింది!

అంతకంటే వేగంగా వచ్చారు పోలీసులు!

చెందూకు ఏంచేయాలో తోచలేదు! రమేష్ తప్పించుకున్నాడు.

పక్కకి చూసాడు! మురుగుకాల్వ పారు తోంది. దానికి అవతల చాలా ఇళ్లు ఉన్నాయి.

ఇక ఆలస్యం చేయదల్చుకోలేదు.

ఒక్కసారిగా... పెద్ద అంగతో అవతలకి దూకాడు.

కాని ఎడమకాలు కాలువలో కూరుకుపోయింది. ఒక్కసారిగా దోమలు విజృంభించాయి.

అదేమీ పట్టించుకోలేదు.

ముందుకి పరిగెత్తి ఒక ఇంటి సందులోకి తిరిగాడు.

వెనక్కి తిరిగిచూడదల్చుకోలేదు.

అక్కడి నుండి ఎన్నో సందులు...

పరిగెత్తుతూనే ఉన్నాడు...

మధ్యలో....

హఠాత్తుగా భౌభౌ మంటూ రాక్షసిలా వెంట పడింది ఓ వీధికుక్క.

ఉలిక్కిపడి, పిచ్చివాడిలా చూసాడు దాని వైపు.

మళ్లీ పరుగు.

ఎటువైపు పరిగెత్తుతున్నాడో తెలియదు. కొంతదూరం వెంబడించి ఆగిపోయింది కుక్క.

ఆఖరుకి-

మెయిన్‌రోడ్ మీదకి చేరుకున్నాడు...

ఒక్కసారిగా.... చల్లటి కొండగాలి విసురుగా వచ్చి కౌగిలించుకుంది.

దూరంగా ఎత్తయిన ప్రదేశం మీద గెస్ట్ హౌస్ కన్పిస్తోంది.

తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

చాలు.. తప్పించుకున్నట్లే. ఒక్కక్షణం ఆగి వెనక్కి తిరిగి చూసాడు.

అంతా నిర్మానుష్యం..

మళ్లీ పరుగు...

పరుగులో వేగం తగ్గినా.. మనసులో అందోళన పూర్తిగా తగ్గలేదు.

మరి కాసేపట్లో...

మంచంమీద వెల్లకిలా పడుకున్న చందూ గబగబా ఊపిరి పీల్చసాగాడు.

అయినా ఇబ్బందిగా అదోలా ఉంది. లేచి ఫాన్ ఫుల్ స్పీడ్‌లో పెట్టాడు.

అయినా చెమట పోస్తోంది.

టెన్షన్... విపరీతమయిన టెన్షన్!

లాభంలేదు. కంట్రోల్ చేయాలి! జరిగిన సంఘటన మర్చిపోవాలి.

చప్పున ఏదో గుర్తుకు వచ్చినవాడిలా లేచి హాలుపక్కన గదిలోకి నడిచాడు.

ఆ గదిలోని అల్మైరాలో...

డాడీ తరచూ వాడే నిద్రమాత్రల సీసా ఉంది.

రెండుమాత్రలు తీసుకుని, వచ్చి గదిలో తలుపేసుకుని... మాత్రలు వేసుకుని పడుకున్నాడు.

అయిదు నిముషాలకి...

నెమ్మదిగా ఉయ్యాలలా ఊగుతూ వచ్చింది నిద్ర.

కాసేపటికి గాఢనిద్రలోకి జారిపోయాడు.

అలసిన శరీరం త్వరగా సొమ్మసిల్లిపోయింది.

★ ★ ★

మర్నాడు సాయంత్రం!

అయిదు గంటల వేళ!

చెందూ ఒక్కడే గదిలో బద్ధకంగా మంచం మీద పడుకుని ఉన్నాడు. ఇంట్లో ఎవరూలేరు.

మమ్మీ గుడికి వెళ్ళినట్లుంది! డాడీ ఎక్కడికి వెళ్ళాడో తెలియదు.

బద్ధకంగా ఒళ్ళువిరుచుకుంటూ లేచాడు.

వళ్ళంతా విరగ్గొట్టినట్లుగా ఉంది. విసుగ్గా ఉంది. ఆవలిస్తూ ఒళ్ళు విరుచుకున్నాడు. హఠాత్తుగా... గుర్తుకు వచ్చింది రాత్రి జరిగిన సంఘటన!.

ఒక్కసారిగా బద్ధకం వదిలిపోయింది. చప్పున మంచం మీద నుండి లేచాడు. వరుగులాంటి నడకతో బాత్‌రూమ్‌లోకి దూరి... చన్నీళ్ళతో ముఖం కడుక్కుంటూ ఉంటే మనసు కాస్త తేలిక పడ్డట్లయింది.

ముఖంతుడుచుకుంటూ లోపలికి వచ్చి అద్దం ముందు నిలబడి దువ్వుకుంటుంటే అద్దంలో నుండి కన్పించింది. తన వెనకే ఓ మూలగా టేబుల్ మీదనున్న టేప్‌రికార్డర్.

ఒక్కసారిగా ఉత్సాహం వచ్చింది. అప్రయత్నంగా నోట్లో నుండి విజిల్ వచ్చింది. గబగబా దానిని చేతిలోనికి తీసుకుని, తన గదిలోకి తీసుకెళ్ళి టేబుల్ మీద పెట్టాడు. రెండు నిముషాలలో తనకు కావాల్సిన కాసెట్ వెతికి పట్టుకుని.... టేప్‌రికార్డర్‌లో పెట్టి ఆన్ చేసాడు.

వన్...

టూ...

త్రీ...

గాలి అలలమీద తేలియాడుతూ... మనసు లోపలి పొరలను ఛేదించుకుంటూ స్టార్టయింది డిస్కో మ్యూజిక్. మంద్రస్థాయిలో ప్రారంభమయి, క్రమక్రమంగా తారస్థాయినందుకుంటోంది.

చెందూ శరీరం, నడుము అప్రయత్నంగా ఆ మ్యూజిక్‌కి అనుగుణంగా... లయబద్ధంగా కదలడం ప్రారంభించాయి.

స్టెప్స్... మ్యూజిక్‌కి అనుగుణంగా పడుతున్నాయి.

నడుము పాములా మెలికలు తిరుగుతోంది. కాళ్ళు గాలిలో తేలియాడుతున్నట్లుగా అయినాయి.

అయిదు నిముషాల తర్వాత...

పిచ్చిగా... వెర్రిగా...మత్తుగా...పాములా మెలికలు తిరిగిపోతూ... అతివేగంగా స్టెప్స్ వేస్తున్నాడు!

ఉరవడిగా, వడివడిగా జలపాతంలా ఉరికి ఉరికి వస్తున్నాయి డిస్కో తరంగాలు. డిస్కో డ్రీమ్స్‌లో పడిపోయిన చందూ గమనించలేదు.

టేప్‌రికార్డర్ పక్కనే నిలబడి, ఎర్రబడిన కళ్ళతో తననే గమనిస్తున్న డాడీని! హఠాత్తుగా... ఆగిపోయింది మ్యూజిక్! ఒక్కసారిగా ఎగసిన పాలపొంగు చల్లారిపోయింది.

తుళ్ళిపడి కళ్ళువిప్పాడు చెందూ! ఎదురుగా తండ్రి!

విసురుగా తలతిప్పాడు! ఆ విసురుకు చెవుల మీదకి పడిన జుట్టు గాలిలోకి ఎగిరింది. కళ్ళల్లోకి ఎరుపు వచ్చింది. అపుడపుడే నల్లబడుతున్న పాలబుగ్గలు ఉక్రోషంతో ఎర్రబడ్డాయి.

టేప్‌రికార్డర్ పక్కనే నిలబడి తన వంకే కోపంగా చూస్తున్న తండ్రిని చూసి భయపడలేదు చందూ. పైగా, తన ఆనందాన్ని, ఉత్సాహాన్ని హరించివేసిన శత్రువుని చూసినట్లుగా, సవాల్ చేస్తున్నట్లుగా, పెదవి కొరుకుతూ చూడసాగాడు.

ఒక్కక్షణం కొడుకు వంక ఆపాదమస్తకం పరీక్షగా చూసాడు ధనుంజయరావు. వ్యంగ్యంగా అడిగాడు - "ఊ! ఆపేశావేం?"

చందూ సమాధానం చెప్పలేదు. తండ్రి వంక నిర్లక్ష్యంగా చూసి, తల ఎగరేసి టేప్ రికార్డర్‌వైపు నడిచాడు.

ధనుంజయరావు చెయ్యి అడ్డుపెట్టి "ఆగు!" అని అరిచాడు కఠినంగా. చందూ తండ్రి వైపు అంతే కఠినంగా చూసాడు. ముక్కుపుటాలు పౌరుషంతో ఎర్రబడ్డాయి.

ధనుంజయరావు టేప్‌రికార్డర్‌లో నుండి కాసెట్‌తీసి, జేబులో వేసుకుంటూ అడిగాడు—"ఇపుడు టైమెంత?"

"నాకు తెలియదు!" విసురుగా వచ్చింది సమాధానం.

భగ్గుమన్నాడు ధనుంజయరావు. "అంటే

టైమ్ కూడ తెలియనంతగా చిందులేస్తున్నావన్నమాట! మరి చదువెప్పుడు?''

''చదువుతూనే ఉన్నాను!''

''చదువుతున్నావా! సిగ్గులేదూ? అబద్ధం చెప్పడానికి? టేప్‌రికార్డరు పెట్టుకుని చిందులేయడమేనా చదువు? రెండునెలల్లో...''

''పరీక్షలు! పరీక్షలు! ఎపుడూ అదేగోల! అయినా నేను చదవడంలేదని ఎవరన్నారు?''

''చందూ!'' కోపంగా అరిచాడు ధనుంజయరావు.

అంతలోనే బలవంతాన తనను తాను కంట్రోల్ చేసుకుంటూ అన్నాడు- ''చందూ! ఆఖరిసారిగా చెబుతున్నాను. మర్యాదగా పుస్తకాలు తీసి చదువు. లేకపోతే నా సంగతి తెలునుగా! ఇన్నిసార్లు చెప్పించుకోడానికి సిగ్గు



గా లేదూ?''

అసహ్యంగా చూస్తూ అన్నాడు చెందూ- "ఏం చేస్తారు? మహా అయితే తిడతారు. లేదంటే బెల్టుపెట్టి కొడతారు. అన్నంపెట్ట నంటారు. కాని, చెట్టంత కొడుకుని పట్టుకుని కొట్టినందుకు మీరు పడాలి సిగ్గు.... నేను కాదు!''

"రాస్కెల్! ఏమిటా పొగరు?''

చెందూ ఊర్కోలేదు. చప్పున రియాక్ట్ అయ్యాడు.

"అవును! పద్దెనిమిదేళ్ళ కొడుకుని ఎలా సంబోధించాలో కూడా తెలియని నీకు... సారీ... మీకు ఇంతకంటే సమాధానం చెప్పడం నాకు చేతకాదు!''

ధనుంజయరావు కోపంతో ఊగిపోయాడు.

"యూ....! అనుకుంటూ ఉండు! అలాగే అనుకుంటూ ఉండరా! కానీ, ఇపుడు తెలియ దు. రేపు, ఈ డిగ్రీ పూర్తికాకపోవాలి. అపుడు— అపుడు చెబుతా! తిండికి గతిలేక చిప్పపట్టు కుని రోడ్లవెంబడి తిరగాలి!''

చెందూ ఉక్రోషంగా అరిచాడు- "నాకేం అంత ఖర్మపట్టలేదు!''

ధనుంజయరావు వ్యంగ్యంగా నవ్వి అన్నా డు-

"అబ్బో! అంత పౌరుషం ఉన్నవాడివి, మరి చదవవేం?''

"చదువుతూనేవున్నాను!''

"ఎక్కడ? ఎపుడు చదువుతున్నావు? ఈరోజు వరకు నువ్వు చదువుతుండగా నేను చూడలేదు!''

చెందూ సూటిగా తండ్రి కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించాడు- "అంటే? మీరు చూసినపుడు చదివితేనేనా చదువు? లేకపోతే కాదా?''

ధనుంజయరావు కనుబొమలు చిట్లించి "అంటే?'' అన్నాడు.

చెందూ వెనక్కి తిరిగి చెప్పాడు- "నాకు నటించడం చేతకాదు!''

"చెబుతావురా! డైలాగులు ఎన్నయినా చె బుతావు... అయినా తప్పు నీది కాదు- మాది.... ఎలా కంట్రోల్ చేయాలో తెలియని మాది!''

ఇంతలో హాల్లో అలికిడి అయింది.

ధనుంజయరావు చప్పున కర్టెన్ తొలగించి వచ్చాడు హాల్లోకి.

హాలు మధ్యన చేతిలో సంచీతో నిల్చుని ఉన్నాడు సుబ్రమణ్యం.

ధనుంజయరావుకి మొదట పరిచయస్థు డు. తర్వాత స్నేహితుడు. ఇపుడు సలహాదా రుడు కూడా. "ఉడిపి బాలకృష్ణా హొటల్'' అని ఒకటి స్థాపించి మంచి లాభాలే సంపాది స్తున్నాడు.

హొటల్‌లో అయ్యర్లని చేర్చుకున్నాడు.

"తెలుగువాడివయి ఉండి తమిళం పేరు పెట్టావేమిటయ్యా?'' అని ఎవరైనా అడిగితే చిద్విలాసంగా నవ్వేసి చిదంబర రహస్యం చెప్పేవాడు.

"పరాయి భాషమీద ఉన్న మోజు సొంతభా షమీద లేదోయ్ మనవాళ్ళకి! ఎందుకంటే తెలుగువాళ్ళుకదా! ఉడిపి హొటల్, ఆంధ్రా కేఫ్ పక్కపక్కనే తెరిచిచూడు.... జనం దేనికి ఎక్కువగా వెళతారో?''

అప్పటినుండి నుదుటి మీద అడ్డంగా విభూది రేఖగీయడం మొదలుపెట్టాడు. తిన్నా తినకపోయినా కిళ్ళీనమలడం నేర్చుకు న్నాడు. తమిళం మాత్రం నేర్చుకోలేదు.

పేరు కూడా 'యస్.మణియమ్' అని మార్చుకోవాలనుకున్నాడుకాని, ఎందుకో ఆ ప్ర యత్నం విరమించుకున్నాడు.

అన్నింటికీ మించి అతని లౌక్యం అతని హొటల్ అభివృద్ధికి సగం కారణం!

సుబ్రమణ్యాన్ని చూస్తూనే ధనుంజయరావు నవ్వాడు.

కాని ఆ నవ్వు మనస్ఫూర్తిగాలేదు. తెచ్చిపె ట్టుకున్నట్లుగా ఉంది.

సుబ్రమణ్యం ఆ సంగతి గమనించాడు.

మౌనంగా ఊర్కున్నాడు.

చప్పున బయటపడదల్చుకోలేదు. కాసేప టికి ధనుంజయరావే చెబుతాడు! ఎపుడూ అది మామూలే!

అంతలో....





చెందూ రూమ్‌లో ధడ్‌ధడ్‌మని ఏదో శబ్దం అయింది. మరుక్షణం విసురుగా బయటికి వచ్చాడు. తలుపువేసి ఒక్కక్షణం పక్కగా నిల బడ్డ తండ్రివైపు చూశాడు.

ముఖం ఎర్రగా కందిపోయివుంది. తల ఎగరేశాడు. చకచకా అడుగులు వేసుకుంటూ బయటకు నడిచాడు. చేతిలో కీచెయిన్ విసు రుగా తిరుగుతోంది.

మరుక్షణం పెద్దశబ్దంతో రివ్వున రోడ్డుమీ దకు దూసుకుపోయింది లూనా.

అతను వెళ్లినవైపే చూస్తుండిపోయాడు ధనుంజయరావు.

సుబ్రమణ్యం చిన్నగా దగ్గాడు. ధనుంజయ రావు కదిలి, సుబ్రమణ్యం వైపు చూసాడు. నెమ్మదిగావచ్చి సుబ్రమణ్యం చేతిలో నంచి పక్కనపెట్టి, తనూ కూర్చుని అడిగాడు.

"ఏమిటో ఇవ్వాళ చెందూ అదోలా ఉన్నా డు. ఏవంటాడు?"

ధనుంజయరావు వెంటనే సమాధానం చె ప్పలేదు. చెందూ మాటలు గుర్తుకొచ్చాయి. ముఖం కఠినంగా మారింది. మాటలు అదిమి పెడుతూ కోపంగా చెప్పాడు. "ఏమంటాడు? ఒళ్లు కొవ్వెక్కి! తిని కూర్చుంటున్నాడు కదూ! చదవమంటుంటే ఆపొగరు. మాటకి మాట సమాధానం చెపుతున్నాడు".

సుబ్రమణ్యం ఒక్కక్షణం స్నేహితుడివైపు పరిశీలనగా చూసాడు. చిన్నగా నిట్టూర్చి, నచ్చ చెప్పే ధోరణిలో అన్నాడు. "అంటున్నానని అనుకోకు. అయినా చెట్టంత కొడుకుతో అలాగే నటయ్యా మాట్లాడటమూ, మందలించటమూ నూ! చెందూ చిన్నపిల్లాడా? ఈరోజుల్లో పిల్లలు ఎలా ఎదిగిపోతున్నారో తెలుసుగా!"

"సర్లే... వాడి మొహం!" నిర్లక్ష్యంగా అన్నా డు ధనుంజయరావు.

సుబ్రమణ్యం నవ్వాడు. "ధనుంజయా! అక్కడే, అక్కడే నువ్వు పొరపాటు పడ్డావు. చెందూవయసులోవున్న ఏకాలేజీ కుర్రాణ్ణ యినా అడుగు! కన్నెపిల్లల గురించి, కౌగి లింతల గురించి క్రికెట్ కామెంటరీలా చెప్పక పోతే- అపుడు అడుగు!"

"చెబుతారు... అదే నాబాధ. అనవసరమ యిన వాటి గురించి అతి తెలివితేటలుండి, అవసరమయిన చదువుని నిర్లక్ష్యం చేస్తే ఎలా?

"వాళ్లకి బుద్ధిపుట్టి చదువుకోవాలి కాని, మనం చెప్పేకొద్దీ మొండి తేలతారు"

"అలా అని వదిలి పెడతామా? ఏదో విధంగా కట్టుబాట్లలో, క్రమశిక్షణలో ఉంచాలి కాని!"

"నిజమే... క్రమశిక్షణ మంచిదే! కాని, అది అతికాకూడదు. కట్టుబాట్లు, క్రమశిక్షణ అనేవి పిల్లలకు మంచిబుద్ధి నేర్పేవిలా ఉండాలికాని వారి స్వేచ్ఛకి సంకెళ్లు కాకూడదు. బందీని కటకటాల మధ్య బంధించే కొద్దీ వాటిని ఛేదించుకు పోవాలనే చూస్తాడు"

ధనుంజయరావు కాలుమీద కాలు వేసు కుంటూ అన్నాడు.

"అలా అని గాలికి వదిలేస్తామా వెధవ ల్ని?"

"అక్కడే నువ్వు పొరబడ్డావు. చెందూకి నువ్వు క్రమశిక్షణ నేర్పావుకాని, ప్రేమని పంచలేదు. నీ ధోరణి చూస్తున్నానుగా! నువ్వు ఎపుడయినా చెందూని ప్రేమతో దగ్గరకు తీసుకుని అతని అవసరాలేమిటో కనుక్కున్నావా? కాస్త ఆలో చించు. ఎంతసేపూ డిసిప్లైన్ అంటూ చంపు తావు. అతని వయసేమిటో కూడా ఆలో చించవు. అందుకే చెందూకి మొదట నుండీ నువ్వంటే భయం. వయసు వచ్చేసరికి అదే కోపంగా మారింది. కోపం వెంట నిర్లక్ష్యం, ఆవేశం, అసహనం మామూలే! అసహ్యంలోకి దిగక ముందే నువ్వు మేలుకుంటే మంచిది"

"హు! ఏమిటో, నీ వేదాంతమేమిటో నాక ర్థం కావడంలేదు తప్పంతా నాదే అయినట్లు మాట్లాడతావు. ప్రేమా, ఆప్యాయం అంటూ ముద్దు చేస్తే గారాబం ఎక్కువయి చెడిపోతా రు. తలకెక్కుతారు. నా మటుకు నేను ఇలాంటి వాళ్లని, పొగరుబోతు వెధవల్ని తిట్టి, కొట్టి దారిలో పెట్టాలనే అనుకుంటాను. ఆ మాత్రం నేనంటే భయం ఉంది కాబట్టి ఈ మాత్రం అణిగి ఉన్నాడు. లేకపోతే చేతికి అందేవాడా?"

సుబ్రమణ్యం నవ్వాడు. ధనుంజయరావు భుజంమీద చెయ్యి వేసి అన్నాడు "కానీ ధనుంజయా! నీకు ఇపుడు అర్థం కాదు. ఇంకా చెందూ పాలుతాగే పసివాడనే అనుకొంటున్నావు. తిట్టి, కొట్టి చెప్పాలను కుంటున్నావు. క్రమశిక్షణలో పెట్టాలనుకుంటున్నావు. కాని అతను ఎలాంటి వయసులో ఉన్నాడో తెలుసా? ఈ వయస్సు లక్షణమే- తనూ పెద్ద వాడయ్యాడు, తనకీ అన్నీ తెలుసు అని చాటుకోవడం. తనను ఎవరయినా చిన్నబుచ్చినా, అవమానించినా భరించలేరు. వెర్రి ఆవేశం వస్తుంది. నిగ్రహశక్తి తక్కువ. ఆలోచన తక్కువ. ఏదో చేయాలని తపన. తనను అందరూ అర్థం చేసుకోవాలనే కోర్కె. అందరినీ ప్రేమించాలని, సంతోషపెట్టాలని ఏవేవో అర్థం లేని ఊహలు... కలలు. వాటిలో ఏ కాస్త ఎదురుతిరిగినా భరించలేని నిరాశ. ధనుంజయా! నువ్వు తెలుసుకోవడం లేదు. ఒక్కసారి చెందూ కళ్ళల్లోకి చూడు స్నేహంగా! కోపంగా కాదు. స్నేహితుడిలా మాట్లాడు. తండ్రిగా కాదు. అధికారం చెలాయిస్తూ కాదు. మనం అనుకుంటాం కానీ, వాళ్ళకి ఏం ఖర్చులుంటాయని, ఉంటాయి! ఏవో కోర్కెలుంటాయి. సినిమా చూడటం ఈ రోజుల్లో తప్పేమీ కాదు. మరీ ఎక్కువ కాకపోయిన మినిమమ్ చూడవచ్చును. రెండు రోజులు వరుసగా చూసాడని చావగొట్టావు పద్దెనిమిదేళ్ల కొడుకుని. కాని మాన్పించగలిగావా? నీమీద కోపంతో ఈసారి దొంగతనంగా వెళతాడు. చేతులారా చెడగొడ్తున్నావు ధనుంజయా! ఒక్కసారి- స్నేహంగా మాట్లాడు. అతని అవసరాలేమిటో కనుక్కో! డిసిప్లిన్, డిసిప్లిన్ అంటూ కటకటాల్లో బంధించాలని చూడకు. అతడు సంకెళ్ళు తెంచుకుపోవాలనే చూస్తాడు. ఆ తర్వాత బాధపడి ప్రయోజనం లేదు. కానీ ధనుంజయా! ప్రేమ క్రమశిక్షణ అనేవి పిల్లలకు సమపాళ్ళలో ఉండాలి. ఈ రెండింటిలో ఏది తక్కువయినా, ఎక్కువయినా పక్కదోవపడతారు. ఈ రెండూ రైలు పట్టాలవంటివి. వాటిమీద జాగ్రత్తగా రైలు నడపడం మీ వంతు. నువ్వన్నట్లు అతి ప్రేమ చూపించినా గారాబంతో చెడిపోతారు. అతిక్రమశిక్షణతో వ్యవహరించినా ద్వేషం పెంచుకుంటారు. ముఖ్యంగా ఈ వయస్సు పిల్లలు మరీ! ఏమిటోలే! పిల్లల్ని కనడం తేలికే! పెంచడమే కష్టం!" నిట్టూరుస్తూ అన్నాడు సుబ్రమణ్యం.

ధనుంజయరావు రెప్పవేయకుండా స్నేహితుడి వైపే చూస్తున్నాడు.

వాకిట్లో ఆటో ఆగిన శబ్దం అయింది. స్నేహితులిద్దరూ గుమ్మం వైపు తలతిప్పారు.

శాంతి!

ధనుంజయరావు భార్య! గుడికి వెళ్ళి వస్తున్నట్లుంది. చేతిలో చిన్న పూలబుట్ట. నుదుటి బొట్టు కిందుగా కనుబొమల మధ్య అద్దిన కుంకుమ. పేరుకు తగినట్లుగా ముఖం ప్రశాంతంగా ఉంది. ఎర్రరాయి ముక్కుపుడక ఆమె తెల్లటి ముఖానికి మంచి అందాన్నిస్తోంది. తీరుగా వేసిన ముడి ఆమెకు గంభీరత్వాన్ని ఆపాదిస్తోంది. చెవిపక్కగా తెల్లగులాబి.

సుబ్రమణ్యాన్ని చూస్తూనే నమస్కరించి "బాగున్నారా అన్నయ్యగారూ! చాలారోజులకి వచ్చారు!" అంటూ పలకరించి, భర్తవైపు తిరిగి "ఎంతసేపయింది మీరు వచ్చి?" అంది.

ధనుంజయరావు మాట్లాడలేదు. అతని ముఖంలోని గంభీరత్వాన్ని చూసి కొద్దిగా సందేహించింది. ఆమెకేదో అనుమానం వచ్చి కొడుకు గదివైపు చూసింది. తలుపువేసి వుంది.

అయితే, మళ్ళీ-ఈ తండ్రీకొడుకులకి ఏదో పడినట్లుంది!

చిన్నగా నిట్టూర్చి సుబ్రమణ్యం వైపుతిరిగి, వాతావరణం తేలిక పర్చటానికన్నట్లు అడిగింది.

"ఏమిటండీ విశేషాలు?"

సుబ్రమణ్యం దాని కోసమే చూస్తున్నాడు. ధనుంజయరావు సీరియస్‌నెస్ వాతావరణానికి గంభీరత్వాన్ని ఆపాదిస్తోంది. దానిని చెదరకొట్టాలి. ఎందుకంటే దాని సృష్టికర్త కొంతవరకూ తనేగా.

నవ్వాడు. "ఏమున్నాయి? హొటలు రేట్లు తగ్గించమని ప్రభుత్వం గోల! గారెల్లో చిల్లి




ఎక్కువవుతోందని, అట్టు గాలికి ఎగిరిపోతోందని, బొండాం చిక్కిపోతోందని కష్టమర్ల గోల! ఇవిగో! కొబ్బరి చట్నీ కోసమని, ఇవుడే గుడికెళ్ళి కొబ్బరి చిప్పలు కొనుక్కొస్తున్నాను. ఆఖరుకి అవీ ధరలు మండిపోతున్నాయి. భక్తులు పెరుగుతూనే ఉన్నారు కాని, ఇదివరకులా గుడికి వచ్చినపుడు కొబ్బరి కాయ తేవడంలా! హారతి కర్పూరంతో సరిపెడుతున్నారు. ఏమిటోలే!"

శాంతి నవ్వుతూ అంది. "కాఫీ తెస్తానుండండి!" లోపలకు వెళ్ళబోయింది.

ధనుంజయరావు కల్పించుకున్నాడు ఇక బాగుండదనుకుని, జోకగా అన్నాడు- "ఆయనది కాఫీ, భోజనహోటల్. మన కాఫీ నచ్చుతుందా?"

సుబ్రమణ్యం ఫెళ్ళున నవ్వి అన్నాడు "భలేవాడివే! మా హోటల్‌లో నేను ఏదీ తిననయ్యా బాబూ! ఇంటికెళ్ళి శుభ్రంగా మా ఆవిడ వండిపెట్టింది తింటాను. ఇదుగో! నాకేమీ వద్దమ్మాయి. వచ్చి చాలాసేపయింది. నేవెళతాను. చూసి చాలారోజులయింది, చూసి పోదామని వచ్చాను... వస్తా మరి!" లేచాడు.

అతనితో తోడుగా వీధి వరకూ నడిచి వెళ్లాడు ధనుంజయరావు. సుబ్రమణ్యాన్ని పంపించి లోపలికి వచ్చి తన బెడ్ రూమ్‌లోకి నడిచాడు.




ధనుంజయరావు చిన్నప్పటినుండి కష్టపడి పైకివచ్చిన వాడేమీకాదు. జల్సాగా తిరిగినవాడే! పెళ్లయిన తర్వాత భార్యతరపు ఆస్తి వచ్చింది. దానితో భార్య పేరుతోనే "శాంతి ఎంటర్ ప్రయిజెస్" స్థాపించి బిజినెస్ ప్రారంభించాడు.

మొదట్లో కుర్చీలు, డైనింగ్ టేబుల్స్, బీరువాలతో ప్రారంభమయిన బిజినెస్ రెండేళ్లు తిరిగేనరికి ఫ్రిజ్‌లు, టి.వి.లదాకా వచ్చింది. వీటితోపాటు ధనుంజయరావు హోదాకూడా పెరుగుతూ వచ్చింది. విజయవాడలోనే ఇల్లు, తర్వాత హైదరాబాదులో ద్రాక్షతోట కొన్నాడు.

కానీ...

దురదృష్టం ఏమిటంటే- ధనుంజయరావుకి సొసైటీలో ఎంత గౌరవం, హోదా ఉన్నాయో ఇంట్లో అంత నిర్లక్ష్యం, క్రోధం ఎదురవుతాయి.

ముఖ్యంగా చందూ మూలంగా!

చెందూ గుర్తుకొస్తేనే మండిపడతాడు ధనుంజయరావు. ఈమధ్య మరీను! అసలు చెప్పినమాట వినకపోవడం, నిర్లక్ష్యం, పొగరు, చదువూ సంధ్య లేకుండా చెడుతిరుగుళ్లు తిరగటం ఎక్కువైంది. ఎలాగయినాసరే వాడిని ఒకదారిలో పెట్టాలి! దానికి కావల్సిన ఆయుధం తన చేతుల్లోనే వుంది బెల్టు రూపంలో! ఆదర్శప్రాయుడైన తండ్రిగా, డిసిప్లిన్డ్ వ్యక్తిగా సొసైటీలో కీర్తింపబడాలని ఆయన తాపత్రయం!

కాని చెందూ దృష్టిలో తనో రాక్షసుడిగా ముద్రింపబడుతున్న సంగతి గమనింపలేకపోయాడు.

చెందూ... తండ్రి పేరు వింటేనే భగ్గున మండిపడతాడు.

తననో చిన్నపిల్లాణ్ణి చేసి ఇష్టమొచ్చినట్లు తిట్టడం, కొట్టడం.. అధికారం చెలాయించబోవడం. అదేమంటే డిసిప్లిన్ అనడం!

జైలులో ఉన్నట్లు అన్పిస్తోంది రోజురోజుకీ!

సినిమాకి వెళితే తప్పు!

డబ్బు అడిగితే తప్పు!

ఫ్రెండ్స్‌తో తిరిగితే తప్పు!

ఎంతసేపూ చదువు... చదువు... చదువు....

ఆవేశంతో ఒళ్లు మండిపోతూ వుంటుంది చందూకి!

ఈ ఇద్దరికీ సర్ది చెప్పలేక సతమతమయిపోతూవుంటుంది శాంతి.

ముఖ్యంగా ఈమధ్య రెండుమూడు రోజుల కొకసారి ఏదో ఒక గొడవ అవుతోంది.

ఆరోజు అలా విసురుగా, కోపంగా వెళ్లిన చందూ థియేటరుముందు హౌస్‌ఫుల్ బోర్డు చూసి తిట్టుకున్నాడు. ఒక్కసారిగా చెప్పలేని నీరసం వచ్చింది. కోపం వస్తోంది! ఎందుకో, ఎవరిమీదనో తెలియదు. నిజానికి ఎక్కడికి వెళ్లడానికీ బయటికిరాలేదు. తండ్రిమీది కోపంతో వచ్చేశాడు. మధ్యలో నిర్ణయించుకున్నాడు సినిమాకి వెళితేకాని మనశ్శాంతిగా వుండదని.

లూనా స్లోగా నడుపుతూ వస్తున్న చెందూ కళ్లు హఠాత్తుగా మెరిశాయి.

దూరంగా గబగబా జనాన్ని తప్పించుకుంటూ ముందుకు నడుస్తున్న కాంతి.

తన పక్కనే లూనా ఆగడంతో ఉలిక్కిపడిన కాంతి, చెందూని చూసి తేలిగ్గా నవ్వేస్తూ,

"నువ్వా!" అంది.

చెందూ లూనా దిగాడు. నడిపించుకుంటూ, కాంతిపక్కనే నడుస్తూ అన్నాడు "ఏమిటి విశేషాలు! కన్పించడంలేదు?"

కాంతి నవ్వింది.

హఠాత్తుగా అడిగాడు— "ప్లీజ్ కాంతీ! కాసేపు కంపెనీ ఇవ్వకూడదూ? బోర్ ఫీలవుతున్నాను. ఎందుకో మనసేమీ బాగుండలేదు!"

కాంతి కళ్లెత్తి చెందూ ముఖంలోకి చూసింది.

భుజం చుట్టూ పవిట కప్పుకుని, చేతిలోని పుస్తకాలు గుండెలకి హత్తుకుంటూ "పద!" అంది.

కాసేపటికి ఇద్దరూ, ఎదురెదురుగా కూర్చుని ఉన్నారు పార్కులో పచ్చికమీద.

"కాంతీ!"

"ఊఁ!"

"నిజంగా ఈపెద్దవాళ్లు ఎందుకిలా ప్రవర్తిస్తారు? ఛ!" చిరాకుగా అన్నాడు.

కాంతి అనుమానంగా చూసింది— "మళ్లీ ఇంట్లో ఏమయినా గొడవ జరిగిందా?"

కాంతికి ఈ అనుభవం కొత్తకాదు. అతనికి ఇంట్లో ఏదో జరగడం, మనశ్శాంతి లేదంటూ రోడ్ల వెంట తిరుగుతూ, కాంతి కన్పిస్తే కాసేపు కబుర్లు చెప్పమనడం— ఇంతక్రితం రెండు మూడు సార్లు జరిగింది.

కాంతికి అంత ఇష్టం ఉండేదికాదు చెందూతో పబ్లిక్‌గా అలా పార్కులో కూర్చుని మాట్లాడటం.

కాని అతని ముఖంలోకి చూస్తూ కాదనలేకపోయేది. క్లాస్‌మేట్! పైగా ధనుంజయరావు తన తండ్రికి బాగా పరిచయస్థుడు.

మొహమాటం కొద్దీ వచ్చేది. మొదట్లో ఏమిటోగా, భయంగా అన్పించేదికాని, ఇపుడలా అన్పించడంలేదు.

అతని సమస్యలన్నీ ఏకరువుపెడుతూంటే శ్రద్ధగా వింటూ కూర్చునేది.

చెందూ చెబుతున్నాడు— "కాసేపు... సరదాగా టేప్‌రికార్డర్ పెట్టుకుంటేతప్పా. డిస్కో మ్యూజిక్ బాగుందని సాయంత్రం పెట్టుకున్నానా? వచ్చికాసెట్ దాచేసాడు"

అతనిలోని ఆవేశం, ఉక్రోషం చూస్తుంటే నవ్వొస్తోంది కాంతికి.

పసితనం ఛాయలు ఇంకాపోలేదు ఆ మాటల్లో!

"ఊ" అంది శ్రద్ధగా వింటున్నట్లుగా.

"నేను మాత్రం తక్కువ తిన్నానా? మాటకు మాట బాగానే చెప్పానులే! అయినా కాసెట్ దాచేస్తే, మరో కాసెట్ తేననుకున్నాడో ఏమో"

"టేప్‌రికార్డర్ దాచేస్తే?" నవ్వు ఆపుకుంటూ అంది కాంతి.

ఏదో చెప్పబోతూ ఎందుకో కాంతి కళ్లలోకి చూసి ఆగిపోయాడు.

ముఖం చిన్నబోయింది. "వద్దులే నీకు వేళాకోళంగా వున్నట్లుంది!"

కాంతి కంగారుగా అంది— "అబ్బే! వేళాకోళం కాదు.... చెప్పు!"

చెందూ ఆవేశంతో అన్నాడు. "ఎందుకో ఆ ఇంట్లో వుండాలంటేనే అసహ్యంగా వుంది. హాయిగా ఈ చదువయ్యేవరకూ ఏ హాస్టల్లోనో వుండి తర్వాత ఎక్కడికో అక్కడికి..."

చప్పున అందుకుని— "ఎక్కడికి?" అంది కాంతి.

"చెప్పానుగా... నాకే తెలియదు" విసుగ్గా

అన్నాడు.

"చెందూ! ఏమీ అనుకోకు! చూస్తుంటే నువ్వేదో అనవసరమయిన ఊహలు పెట్టుకుని కలలు కంటున్నట్లున్నావు. లేనిపోని ఆలోచనలు మానుకుని హాయిగా, బుద్ధిగా చదువుకో. దగ్గర్లోకి వచ్చాయి పరీక్షలు"

"అబ్బా... కాంతీ! నువ్వూ అదేమాట"

నవ్వింది. "ఈ రోజుల్లో అందరూ అదే చెబుతారు. కాకపోతే మీ డాడీ కాస్త కోపంగా చెప్పారు, నేను స్నేహంగా చెబుతున్నాను. అదే తేడా! నిజం చెప్పు చెందూ! బాగా చదువుతున్నావా?"

చెందూ వెంటనే సమాధానం చెప్పలేదు. కాసేపాగి ముక్తసరిగా— "ఆ!" అన్నాడు.

"నీ ముఖం చూస్తుంటేనే తెలుస్తోంది ఎలా చదువుతున్నావో!"

"నిజం కాంతీ! నన్ను నమ్ము. ఆ ఇంట్లో నాకు మనశ్శాంతి అనేది లేదు. అసలు చదువుకోబుద్ధి పుట్టడంలేదు."

"ఎవరేమన్నారు నిన్ను? చదువుకోవద్దన్నారా? హాయిగా నీకో స్పెషల్‌రూమ్ వుంది. ఇంకేం?"

"నీకు తెలియదు. డాడీ ముఖం చూస్తేనే ఒళ్లు తెలియని ఆవేశం వస్తుంది. అసహ్యం వేస్తుంది. నన్ను చూస్తూనే ఏదో ఒకటి అంటాడు. నేనూ ఊర్కోను. నేనూ అంటాను. ఫలితం? మైండ్ చెడిపోతుంది" కోపంగా, అసహనంగా గడ్డిపరకలు పీకుతూ చెప్పాడు

"అంకుల్ ముఖం చూస్తేనే అంత అసహ్యమయితే అసలు ఆయన వచ్చే టైములో నువ్వు ఇంట్లో వుండమాకు. లేకపోతే నీ గదితలుపులు వేసుకో. ఆయనేదో అన్నారని నీ చదువు..."

"నిజమే... కాని ఎపుడొస్తాడో, ఎపుడు ఊడిపడతాడో తెలియదాయె. ఒళ్లుమండిపోతుందంటే నమ్ము!"

గడ్డిమీద వెనక్కివాలి పకపకా నవ్వింది కాంతి- అతను చెప్పిన తీరుకి.

ఆమె నవ్వుకి ముగ్ధుడయినట్లుగా చూశాడు.

ఇద్దరూ ఓ పదినిమిషాలు కూర్చున్నారు. తర్వాత లూనామీద ఎక్కించుకుని కాంతిని ఇంటికి కొంచెం ఇవతలగా దింపి, ఓ పావు గంటకి ఇంటికి చేరుకున్నాడు.

★ ★ ★

ఆరోజు అక్టోబరు పన్నెండోతారీఖు. ఎగ్జామ్స్ మొదలయి రెండోరోజు.

చెందూ ఈసారి కూడా బాగా చదవకపోయినా, ఫీజు కట్టిన పాపానికి పరీక్షకు హాజరయ్యాడు.

మార్చి పరీక్షల్లో- చదవక రెండు పేపర్లు, స్కోరింగ్ రాదని మరో రెండు పేపర్లు డ్రాప్ చేశాడు.

తను ఒక్కడే అలా చేశాననుకున్నాడు. పరీక్షహాలు బయట తెల్సింది చాలామంది అలాగే చేశారని. డ్రాప్ చేసిన సంగతి చాలా గొప్పగా, స్టైయిల్‌గా చెప్పుకుంటున్నారు వాళ్లు.

అదేదో చాలా సాధారణమయిన విషయమన్నట్లుగా పక్కకునెట్టి, అప్పటికప్పుడు ఆరాత్రి ఏ సినిమాకి వెళ్లాలో కూడా అక్కడే ప్లాన్ చేసేశారు.

మళ్లీ ఈసారి అక్టోబరు ఎగ్జామ్స్‌కి బాగా చదవాలనుకున్నాడు.

కాని... ఎందుకో...

ఎవరిమీదనో కోపం, కసి! డాడీమీదనా... ఏమో!

తనమీదనే తనకి విసుగు.

దానికితోడు... వరసపెట్టి వన్‌డే మ్యాచ్‌లు!

ఇంట్లో టివి పెట్టుకుని కూర్చుంటే డాడీ మండిపడ్తాడని చదుకోడానికని చెప్పి ఫ్రెండ్ ఇంటికి వెళ్లి టి.విని అంటిపెట్టుకుని కూర్చునేవాడు.

టి.వి. ముందు కూర్చుని క్రికెట్‌మ్యాచ్ చూస్తుంటే మరో ప్రపంచం గుర్తుకు రాదు.

ఇది చాలనట్లు... ఇప్పుడే అభిమాన హీరో సినిమా రిలీజ్ అయింది. మొదటిరోజు... మొదటిఆట చూడకపోతే ఆరోజు అన్నం సహించదు. నిద్రపట్టదు!

ఇన్ని విషయాలతో బిజీగా తలమునకలయి వున్న చెందూకి అసలు పుస్తకం ముట్టుకున్న గుర్తేలేదు.

ఇప్పుడు పేపర్ చూస్తుంటే అసలు అది తన సబ్జెక్టేనా అని సందేహం వస్తోంది. ఒక్కొక్క ప్రశ్న చూస్తుంటే ఎపుడో గతజన్మలో చదివిన గుర్తు!

అప్పటికీ చాలా స్లిప్స్ కట్‌చేసి బూట్లకింద, బెల్టు చాటునా, పాంట్ లోపలి జేబుల్లో దాచాడు.

వాటిని తీయాలంటే ఒకటి- బెరుకుగా ఉంది. ఎందుకంటే ఈ ఇన్విజిలేటర్ కొత్తగా ట్రాన్స్‌ఫర్ అయివచ్చిన కామర్స్ లెక్చరర్! పేరు సాయినాథ్. చూడటానికి కుర్రవాడిలా ఉంటాడు. టక్‌చేసి, సన్నగా, ఎపుడూ ఉత్సాహంగా ఉంటాడు. అయినా చాలా స్ట్రిక్ట్ అని మొదటి వారంరోజుల్లోనే తెల్సిపోయింది. ఎంత ఉత్సాహంగా ఉంటాడో, అంత గంభీరం అయిపోతాడు.



మిగతా లెక్చరర్స్‌లా స్టూడెంట్స్‌కి భయపడే రకంకాదు.

హాలులో అటూ ఇటూ తిరుగుతున్నా క్రీ గంట అందరినీ గమనిస్తూనే ఉన్నాడు.

అతన్నిచూస్తూ స్లిప్స్ బయటికి తీయా లంటే భయంగా ఉంది. రెండు— అసలు ఆ ప్రశ్నలకు సమాధానాలు తనదగ్గర ఉన్నాయా అని? ఏ ప్రశ్నకి ఏది జవాబో తెలిస్తేగా?

ఇన్ని ఆలోచనలమధ్య...మరో ఆలోచన!

ఎగ్జామ్స్ తర్వాత...కాలేజ్ స్టూడెంట్స్‌కలిసి కొండపల్లికి ఏర్పాటు చేసుకున్న ఎక్స్‌కర్షన్!

ఆ ఎక్స్‌కర్షన్ ప్రోగ్రామ్‌కి డబ్బు వసూలుచేసే బాధ్యత చెందూదే!

ఇంకా ఎంతమంది ఇవ్వాలి? రమేష్ తాలూకుది తనే కడుతున్నాడు. ఇంకా నల్గురు ఇవ్వాలి.

కాంతి రాసేసి ఖచ్చితంగా చెప్పింది.

ఇరవయిముగ్గురు మగస్టూడెంట్స్‌తోపాటు, ఎనిమిదిమంది లేడీస్‌కూడా రావడానికి సిద్ధపడ్డారు.

"ఏయ్! మిష్టర్!"

కరకుగా ధ్వనించిన ఆ గొంతువిని ఆలోచనలలోనుండి ఒక్కసారిగా తూలిపడ్డట్లయి ఉలిక్కిపడ్డాడు చెందూ!

పిలిచింది తననికాదు!

తనకు రెండు బెంచీల అవతలవున్న రమేష్‌ని!

రమేష్ చెయ్యి లెక్చరర్ సాయినాథ్ చేతిలో ఉంది.

రమేష్ చేతిలో నలిగిపోయిన కాగితపు చుట్టలు ఉన్నాయి.

రమేష్ చేతిలోనుండి బలవంతాన ఆ కాగితాన్ని లాక్కుని తీవ్రంగా అడిగాడు— "ఏమిటివి?"

రమేష్ మనసులో కొంచెం భయపడ్డా, పైకి ప్రదర్శించకుండా మౌనంగా ఉండిపోయాడు.

"నిన్నే... అడిగితే సమాధానం చెప్పవేం?" రెట్టిస్తూ అన్నాడు సాయినాథ్.





రమేష్ ఓరగా తలతిప్పి ముందుబెంచి వైపు చూసాడు.

ఆ బెంచిలో ఒకమూలగా, గోడవారగా వున్నాడు తమ నాయకుడు, ఆపద్బాంధవుడు కాశీరామ్.

అందరూ తలతిప్పి రమేష్‌వైపే చూస్తున్నారు.

కాశీరామ్ నవ్వాడు సన్నగా!

మెత్తగా...కత్తితో కోస్తున్నట్లుగా నవ్వాడు!

ఆ నవ్వులో అభయముంది! ఆకుపచ్చకళ్ళు చిన్నగా ముడుచుకుని, విశాలమయ్యాయి.

రమేష్‌కి తెలుసు ఆ సిగ్నల్! తృప్తిగా ఊపిరిపీల్చుకున్నాడు.

హాలంతా నిశ్శబ్దంగా ఉంది.

ఒక్కసారిగా-

ఖంగున పెద్దశబ్దం అయింది ఆ హాలులో!

అందరితోపాటు, సాయినాథ్ తలతిప్పిచూసాడు అటువైపు!

కిందపడ్డ కత్తిని తాపీగా పైకితీస్తూ నవ్వాడు కాశీరామ్ అదోలా!

సాయినాథ్ అప్రయత్నంగా తడబడ్డాడు. ఊహించలేదు ఆ పరిణామం! మరుక్షణం మామూలయిపోయాడు.

నెమ్మదిగా నడిచాడు కాశీరామ్‌వైపు!

సాయినాథ్‌కి తెలుసు కాశీరామ్ తనని కవ్విస్తున్నాడని! కావాలని యుద్ధానికి ఆహ్వానిస్తున్నాడని!

తను ఈ కాలేజీకి రాగానే అతనిగురించి అందరూ హెచ్చరించారు. జాగ్రత్తపడమని, అతనికి రాజకీయంగా అండదండలున్నాయనీ, అసలు పట్టించుకోవద్దనీకూడా చెప్పారు.

ఇతన్ని తనుచూసాడు! కాని ఇలా ముఖాముఖి ఎదుర్కోవడం ఇదేమొదలు.

కాశీరామ్, కత్తినితీసి చేతిమీద అటు ఇటు రుద్ది, ఓరగా సాయినాథ్‌వైపుచూసి పక్కనేపెట్టి, కామ్‌గా, బుద్ధిమంతుడిలా, రాయడం ప్రారంభించాడు.

మిగతా స్టూడెంట్స్ పరీక్ష రాయడంమానేసి ఈ దృశ్యాన్నే చూస్తున్నారు.

పెద్దగొడవ జరగబోతోందని రమేష్‌కి తెలుసు!

తనని...అందరిలో నిలబెట్టి ప్రశ్నించిన మొట్టమొదటి లెక్చరర్ వీడే! అందుకే బుద్ధిచెప్పాలి! ఎప్పుడూ తమజోలికి రాకుండా పాఠం చెప్పాలి!

చెందూకూడా థ్రిల్లింగ్‌గా చూస్తున్నాడు.

ఏమీతెలియని పరీక్షరాయాలంటే విసుగ్గా, చిరాకుగా వుంది.

సాయినాథ్ కాశీరామ్ పక్కగానిలబడి మునివేళ్ళతో బల్లమీద తట్టాడు.

"మిష్టర్! ఏమిటిది?"

కాశీరామ్ తలెత్తాడు. చిన్నగా, అమాయకంగా అన్నాడు.

"తెలీదా! దీనితో...చేస్తే అప్రేషను...పొడిస్తే మర్డరు"

పక్కనే ఉన్న స్టూడెంట్ కిసుక్కున నవ్వాడు.

సాయినాథ్ ముఖం ఎర్రగా కందిపోయింది. దవడఎముక బిగిసింది.

"షటప్! యూ రాస్కెల్!" చటుక్కున కాశీరామ్ చొక్కా పుచ్చుకుని పైకిలేపాడు. ఒక్క క్షణం కాశీరామ్ నివ్వెరపోయాడు.

తన స్టూడెంట్‌లైఫ్‌లో తనమీద ధైర్యంచేసి చెయ్యివేసిన మొదటివ్యక్తి!

అంతే!

చిన్నగా మూసుకున్న కళ్ళు పెద్దవయ్యాయి.

పాముకళ్ళల్లా పచ్చగా కనుగుడ్లు ధగాధగా మెరిశాయి.

స్టైల్‌గా నములుతున్న చూయింగ్‌గమ్ తుపుక్కున పక్కకి ఉమ్మేశాడు.

ఫుల్‌హేండ్స్‌ని వెనక్కిమడిచి, మణికట్టుదగ్గరున్న కడియాన్ని ఒకసారి అటూ ఇటూ జరిపాడు.

ఒక్కసారిగా చేతిని గాలిలోకి విసురుగా లేపాడు.

అతడు ఊహించినట్లుగా అది సాయినాథ్ ముఖాన్ని తాకలేదు.

సాయినాథ్ బలమైన చెయ్యి మధ్యలోనే అడ్డుకుంది.

కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు సాయినాథ్.

చూడు... నీ ఆటలు నాదగ్గర కాదు! నన్ను చాలా తక్కువగా అంచనా వేస్తున్నావు." కాశీరామ్ పళ్ళు పటపటా కొరికాడు.

బలవంతాన చెయ్యి విడిపించుకోబోతూ చూసాడు. హడావిడిగా లోపలికి పరిగెత్తుకొస్తున్న ప్రిన్సిపాల్‌ని, తదితర లెక్చరర్స్‌ని!

వాతావరణంలో వేడి తాత్కాలికంగా సద్దుమణిగింది.

కాని కాశీరామ్‌లో కసి క్రమంగా రాజుకోసాగింది.

తీర్చుకోవాలి... పగతీర్చుకోవాలి... దెబ్బకి దెబ్బ తీయాలి!

కాటు వేయడానికి సమయం కోసం కాసుక్కూర్చున్న పాములా వేచి ఉన్నాడు. కాని ఎక్కడా బయట పడలేదు.

కొన్నిరోజులతరువాత అనుకోకుండా హఠాత్తుగా జరిగింది ఆ సంఘటన!

సాయినాథ్ ఇంట్లో నుండి వస్తున్న ఆ అమ్మాయిని చూసాడు కాశీరామ్!

ఎవరూ... పద్మకదూ! తన క్లాస్ మేట్!

చకచకా రాకెట్ వేగంతో ఆలోచనలు కదిలిపోయాయి అతని మెదడులో! చప్పున చేతిలో ఉన్న సిగరెట్‌ని పక్కకి పడేశాడు.

రోడ్డుకి పక్కగా తొలిగి నించున్నాడు. అతనికి కొంచెం దూరంలో ఉన్న రమేష్, చెందూ అతనిసైగతో పక్కకి చేరారు. అంతసేపూ వాళ్ళు రోడ్డుమీద నిలబడి, గోడలకు అతికించివున్న సినిమా వాల్‌పోస్టర్స్ చూస్తున్నారు.

తలవంచుకుని నడుస్తున్న పద్మ— "హలో సిస్టర్!" అన్న పిలుపుతో ఉలిక్కిపడి ఆగిపోయింది.

కదిలి ముందుకు వచ్చాడు కాశీరామ్!

రెండడుగులు వెనకగా ఆగిపోయారు రమేష్, చెందూ!

"ఎక్కడి నుండి వస్తున్నావు?" అదోలా నవ్వుతూ అన్నాడు.

కాశీరామ్‌ను చూడగానే వెన్నులో వణుకు పుట్టింది పద్మకు. అయినా తమాయించుకుని

చెప్పింది "సాయినాథ్‌సార్ ఇంటి దగ్గర నుండి! కామర్స్‌లో కొంత డౌట్ వస్తే..."

"డౌటా... వెరీగుడ్! పైకివస్తావు. బాగానే ఉంది... కాని సారుగారు... నీచెయ్యి పుచ్చుకుని ముద్దు పెట్టుకోవడంలోనే నాకు డౌటు వస్తోంది!" కవ్విస్తున్నట్టుగా నవ్వుతూ అన్నాడు.

"ఛ! అదేమిటి!" వణికిపోతూ అంది పద్మ.

అమ్మాయి అలా భయపడిపోతుంటే చక్కిలిగింతలు పెట్టినట్లుగా ఉంది కాశీరామ్‌కి! చదరంగంలో చావబోయే పావు!

"అదేమిటి సిస్టర్! అలా బుకాయిస్తావు? నా కళ్ళారా నేను స్వయంగా చూస్తే!" అని పక్కకు తిరిగి— "ఏరా! రమేష్?" అని అడిగాడు.

రమేష్ బుద్ధిగా తలూపి— "గట్టిగా కౌగలించుకున్నాడు కూడా!" అన్నాడు.

పద్మకి కళ్ళనీళ్ళ పర్యంతం అయిపోయింది. "నో!నో! అదేం లేదు..."

"భయపడకు సిస్టర్! ఎవరితోనయినా చెబితే చంపేస్తానని భయపెడుతున్నాడా? బెదిరిస్తున్నాడా? బ్లాక్‌మెయిల్ చేస్తున్నాడా? నేనున్నానని తెలియదు కాబోలు పిచ్చినన్నాసికి! అనవసరంగా వర్రీ అవకు! వెళ్ళు... ఇంటికి వెళ్ళు!" బుజ్జగిస్తున్నట్లుగా అన్నాడు.

దాదాపు ఏడుపుగొంతుతో అంది పద్మ.

"ప్లీజ్... అనవసరంగా లేనిపోని గొడవలు సృష్టించమాకండి! సార్ అలాంటివారు కాదు... ప్లీజ్!"

కాశీరామ్ నవ్వాడు మళ్ళీ అదోలా!

"ఎందుకంత భయం! నిజం చెప్పడానికి? ఏం చెందూ! నువ్వు చూడలా! మన సిస్టర్‌ని ముద్దుపెట్టుకోవడం?" చెందూవైపు చూస్తూ కళ్ళెగరేసి అన్నాడు. ఈ దృశ్యాన్ని కళ్ళప్పగించి చూస్తున్న చెందూ తృళ్ళిపడి, గబగబా తలూపాడు అవునూ కాదూలకు మధ్యస్థంగా.

పద్మ తలెత్తి చూసింది చెందూవైపు.

చెందూ! తనకు తెలుసు! బాగా తెలుసు!

కాని ఇప్పుడు మారిపోయాడు... పూర్తిగా చెడిపోయాడు.

వీళ్ళేదో వలపన్నుతున్నారు! తెలిసిపోతూనే ఉంది! కాని... ఇలా... తను... ఇరుక్కుపోతోందేమిటి?

కాశీరామ్ చూయింగ్‌గమ్ నోట్లో వేసుకుని నములుతూ అన్నాడు— "వెళ్ళు! హాయిగా ఇంటికి వెళ్ళు! వెళ్ళి రెస్టు తీసుకో! నేనున్నాను భయపడకు!"

పద్మ బెదిరిపోతూ చూసింది. "ప్లీజ్! ఏమీ అల్లరి చేయద్దు! అసలు అలాంటిదేమీ జరగలేదు! ఆయన అలాంటివారు కాదు!"

"బస్... ఓకే ఓకే! నీకు తెలునుగా ఎక్కడ ఆడపడుచులు ఆపదల్లో చిక్కుకుంటారో అక్కడ ప్రత్యక్షమవుతాడు ఈ కాశీ అన్న!"

"కాని... నాకేం ఆపద జరగలేదు"

కాశీరామ్ మనసులో నవ్వుకున్నాడు. "పిచ్చిపిల్ల"

పద్మ ఇక అక్కడ ఉండదల్చుకోలేదు. గబగబా పరుగులాంటి నడకతో ముందుకు వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళినవైపే చూస్తూ పకపకా నవ్వాడు కాశీరామ్!

"ఏవిటిగురూ?" అర్థంకాక అడిగాడు రమేష్!

రమేష్ భుజంమీద చెయ్యివేసి చెప్పాడు. "అసలు కథ రేపే ప్రారంభం!"




మర్నాడు...

పుస్తకాలు చేతిలో పట్టుకుని కాలేజి కాంపస్‌లో అడుగుపెట్టిన పద్మ...

స్థాణువైపోయింది.

భూమి గిరగిరా తిరుగుతున్నట్లని

పించింది.

అక్కడ గోడమీద రకరకాల రాతలు రాసివున్నాయి పెద్దపెద్ద అక్షరాలతో..

కామాంధుడు సాయినాథ్... డౌన్ డౌన్!

ట్యూషన్ పేరుతో ఆడపిల్లలను ఇంటికి పిల్చి సరసాలు సాగిస్తున్న సాయినాథ్... డౌన్ డౌన్!

కొన్నిచోట్ల అయితే అసభ్యంగా బొమ్మలు వేసి.. రకరకాలుగా అసహ్యకరంగా రాసివున్నాయి.

కళ్ళు తిరుగుతున్నట్లనిపించింది పద్మకు.

అందరూ ఎక్కడివాళ్ళు అక్కడే నిల్చుండిపోయి తననే వింతగా చూస్తున్న భావన.

దూరంగా నినాదాలు విన్పిస్తున్నాయి.

కాలేజి ప్లేగ్రౌండ్స్‌లో...

అట్టలు పట్టుకుని అరుస్తున్నారు స్టూడెంట్స్ గ్రూప్.

వాళ్ళమధ్య కాశీరామ్, రమేష్, చెందూలుకూడా వున్నారు.

"సాయినాథ్..."

"డౌన్... డౌన్!"

"విద్యార్థులపై లెక్చరర్ల దౌర్జన్యం..."

"...నశించాలి!"

"ఆడపిల్లలపై అత్యాచారాలు..."

"నశించాలి..."

"సాయినాథ్‌ని!"

"డిస్మిస్ చేయాలి..."

"కాలేజి ఆడపడుచులకి రక్షణ ఇవ్వలేని ఈ ప్రిన్సిపాల్..."

"డౌన్! డౌన్!"

"కామాంధుడి కోరలనుండి లేడీస్‌ని.."

"రక్షించండి!"

"డౌన్! డౌన్!"

"ప్రిన్సిపాల్ డౌన్ డౌన్! సాయినాథ్ డౌన్ డౌన్!"

అంతకంతకి నినాదాలు మార్మోగిపోతున్నాయి. అక్కడ గ్రూప్‌లో ఉన్నవాళ్ళందరిలో ఆవేశం తారాస్థాయినందుకుంది.

అందరూ గుంపులుగా అటూఇటూ తిరుగుతూ, కావాలని గందరగోళం సృష్టిస్తున్నారు.

అంతలో...

మరో పదిమంది స్టూడెంట్స్ వచ్చారు—వాళ్ళు వేరే గ్రూప్!

వీళ్ళతో అంతగా కలవరు!

"కాశీరామ్! ఎందుకు ఇంత గొడవ! అసలు పద్మ ఒప్పుకుంటోందిగా తప్పేమీ జరగలేదని!" నచ్చచెప్పబోయారు.

దూకుడుగా అడిగాడు కాశీరామ్—

"ఆడపిల్లలు నిజాన్ని ఒప్పుకుంటారా చప్పున! వాడే భయపెట్టాడు! మేము కళ్ళారా చూసాము కాబట్టి..."

"కళ్ళారానా! ఏం చూశారు?" వాళ్ళలో ఒకతను కాస్త గట్టిగా అడిగాడు.

కాశీరామ్ కాస్త తగ్గాడు!

తన గ్రూప్‌లో వాళ్ళుకూడా నినాదాలు మానేసి చూస్తూ నిలబడ్డారు.

కాశీరామ్‌కిది నచ్చలేదు.

ఈ గొడవ ఇంతటితో సమసిపోవడానికి వీలులేదు! నో! ఇంకా ఎక్కువకావాలి!

చప్పున అతని కళ్ళుమెరిశాయి.

ఆ ఆయుధం ఇన్‌డైరెక్టుగానే ప్రయోగించాడు... "అంటే? మేము గుడ్డివాళ్ళమనా నీ ఉద్దేశం? లేక... మీవాడనా? వెనకేసుకొస్తున్నారు ఆ లెక్చరర్‌ని!"

కాశీరామ్ అనుకున్నదానికంటే ఎక్కువగానే పేలింది బాంబు.

"షటప్! అనవసరంగా కులాలప్రసక్తి తీసుకురాకు. ఆ మాటకొస్తే ఆ రోజు మీవాడనేగా హాస్టల్‌వార్డెన్ మీద నీ రాజకీయపు పలుకుబడి ఉపయోగించి కేసు మాఫీ చేయించావు" తీవ్రంగా అన్నాడు ఎదుటి గ్రూప్‌లోని వ్యక్తి.

చాలు! ఈ కాస్త ప్రసక్తిచాలు... కాస్త ఆజ్యంపోస్తే అదే రాజుకుంటుంది.

కాశీరామ్ రాజకీయపు బుర్ర చురుకుగా పనిచేసింది.

చప్పున అందుకున్నాడు ఆమాటని... గొంతు తీవ్రంచేసి "మీవాడు, మావాడు అంటే





విషయం చాలా దూరంపోతుంది జాగ్రత్త... టేక్‌కేర్!''

"నే... ఎందుకూరుకోవాలి! నీ సంగతి నీకంటే నాకు బాగాతెలుసు! ఆ సంగతి నీకు కూడా తెలుసు! అయినా..." పాతకక్షలన్నీ గుర్తుకు తెచ్చుకుని తవ్వేపోస్తున్నాడు ఆ స్టూడెంట్.

కాశీరామ్ గొంతు తీవ్రస్థాయినందుకుంది.

చూస్తుండగానే... రెండు గ్రూపులయిపోయాయి.

అసలు సంగతి ఎపుడో మరుగునపడిపోయింది.

కులము, మతము.. నాలుకలు జాపుతూ... వికృతంగా.. అగ్నిజ్వాలలను సృష్టించాయి. ఎక్కడినుండో సోడాసీసా గాలిలో ఎగురుతూ వచ్చింది. మరుక్షణం... "అమ్మా!" అంటూ ఒక స్టూడెంట్ పక్కకు పడిపోయాడు. అతని చెయ్యి పైనుంచి కింది వరకు రక్తసిక్తమయిపోయింది.

దానితో ఇరుపక్షాలలో ఉద్రిక్తత తారాస్థాయి నందుకుంది.

వెర్రెత్తినవాళ్ళలా కలియబడ్డారు.

ఎవరు ఎవరిని కొడుతున్నారో వాళ్ళకే తెలియదు.

ఆరోగ్యంగా, పరుగులు తీసే క్రీడలకు ఆలవాలమయిన ఆ ప్లేగ్రౌండ్ పది నిముషాలలో మతకలహాలకు రణరంగమయింది.

కాలేజి చరిత్రలో ఎపుడూ అంత గొడవ జరగలేదు.

ప్రిన్సిపాల్ పోలీసులకు ఫోన్ చేశాడు. పది నిమిషాలకు ప్లేగ్రౌండ్‌లోకి ప్రవేశించాయి పోలీసు జీపులు రెండు.

ఒక్కసారిగా స్టూడెంట్స్ చెల్లాచెదురయిపోయారు.

పోలీసులు అందరినీ తరిమితరిమి కొట్టారు.

దూరంగా పోయిన స్టూడెంట్స్ ఊర్కోలేదు. పోలీసుల మీదికి రాళ్ళు విసరసాగారు. ఇద్దరు పోలీసులకు తీవ్రంగా గాయాలు తగిలాయి.

దాదాపు అరగంట తర్వాత వాతావరణం సద్దుమణిగింది.

ప్లేగ్రౌండ్ నిర్మానుష్యంగా, నిశ్శబ్దంగా అయిపోయింది.

అటూ ఇటూ పరుగులు పెడుతూఉండే స్టూడెంట్స్‌తో ఉత్సాహంగా కళకళలాడే ఆ ప్లేగ్రౌండ్ పోలీసుల బూట్ల శబ్దాలతో ధ్వనించిపోయింది.

పరీక్షలు అతికష్టం మీద కండెక్ట్ చేయగలిగారు. అదీ పోలీసుల సాయంతో.

కాశీరామ్, రమేష్, చెందూ అసలు పరీక్షలకు హాజరవలేదు.

ఈ గొడవలతో ఎక్స్‌కర్షన్‌ప్రోగ్రామ్ కాన్సిల్ అయిపోయింది.

రెండురోజుల అనంతరం...

మాజీ మినిష్టరు కబురుపెడితే వెళ్ళికలిశాడు కాశీరామ్.

"ఏమిటీ! బొత్తిగా కనబడటం మానేశావు?"

"బిజీ" కాశీరామ్ అటూ ఇటూ తిరుగుతూ చెప్పాడు. మాజీ మినిష్టరు కూర్చోమన్నా కూర్చోడు. కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతూ, అవీ ఇవీ సర్దుతూ మాట్లాడుతుంటాడు.

"ఏమిటి... ఏదో గొడవ సృష్టించావట!"

కాశీరామ్ అవునన్నట్లుగా సన్నగా విజిలేసి, కనుబొమలెగరేశాడు.

"నే విన్నది నిజమేనన్నమాట! కాని... కథ అంతటితో ఆగిపోగూడదయ్యా! పైగా కులకలహాలతో ప్రారంభించారు... నుసి అయ్యేదాకా నడిస్తేకాని తృప్తిగా వుండదు. చప్పచప్పగా లేదూ?"

కాశీరామ్ కూడా అసంతృప్తిగా అన్నాడు "నిజమే... నాకూ అలానే అన్పించింది. పోలీసులు రావడంతో తేలిగ్గా సమసిపోయింది. లేకపోతే మహరంజుగా వుండేది కథ... చిన్న సైజు కురుక్షేత్రమయి వుండేది"

మాజీ మినిష్టరు బ్రేవుమని త్రేన్చి అన్నాడు— "నిజమేననుకో... కాని అది మీ కాలేజి కాంపస్‌కే పరిమితమయితే ఎలాగయ్యా! మరి నా నియోజకవర్గప్రజలకి తెలిసేది ఎలాగని?"

"అంటే...?"

ముసిముసిగా నవ్వాడు మాజీ మినిష్టరు.

"నీకు అర్థంకాదు... అసలు కథ వేరేవుంది. నువ్వు గొడవచేసావే... ఆడు... ఆ సాయినాథ్ లెక్చరర్ ఎవరనుకున్నావు? అపోజిషను పార్టీ వాడు... వాళ్ల కార్యకర్తకూడా! ఆడు ఇక్కడున్నా డనుకో... మనకి కొన్ని ఓట్లు హుళక్కి- ఆడిని ఎలాగైనా సిటీకి దూరంగా తరమాలి"

కాశీరామ్ కొత్త విషయం వింటున్నట్లుగా చూసాడు మళ్లీ ఆలోచనలో పడి "నిజమే! కాని ఎలా? అసలు విషయం మరుగునపడిపో యిందిగా?" అన్నాడు.

"అదే మళ్ళీ బయటకులాగాలి. ఆడిని పిచ్చికుక్కను తరిమినట్లుగా తరిమి తరిమి కొట్టాలి?"

కాశీరామ్ క్షణంసేపు పెదవి కొరుక్కుంటూ నిలబడ్డాడు. కాసేపు అటూ ఇటూ పచార్లు చేసాడు. హఠాత్తుగా ఆగి... మాజీ మినిష్టర్ వైపు చూస్తూ అన్నాడు—

"గొడవ చేద్దాం... నిరాహారదీక్షలు.. ఊరే గింపులు.... ధర్నాలు..."

మాజీమినిష్టరు కొంచెం అసంతృప్తిగా చూ స్తూ "చూడు- ప్రయత్నించు" అన్నాడు.

కానీ....

ఆ అవసరం రాకుండానే సాయినాథ్ ట్రాన్స్ ఫర్ పెట్టుక్కుని వెళ్ళిపోయాడు. కారణం...

పద్మ హఠాత్తుగా కాలేజీ మానేయడం.

అనవసరమయిన గొడవల్లో ఆ అమాయకు రాలిని ఇప్పటికే బలిచేశారు.

ఆమె జీవితం భగ్నం కాకముందే వెళ్ళిపో వడం మంచిదని వెళ్ళిపోయాడు. మనస్ఫూర్తి గాకాదు... విరక్తిగా.

ఈ కాలేజి రాజకీయాల రొంపిని అస హ్యించుకుంటూ వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఉదయం ఆరుగంటల సమయం.

తూర్పుదిక్కు ఆకాశం కుంకుమ అద్దినట్లు గా ఎర్రగా వుంది. అదో విధమయిన "ఉదయ పుగాలి" వీస్తోంది. అలాంటి సమయంలో-

పైజమా, లాల్చీవేసుకుని ఉన్న ధనుంజ యరావు మధ్య హాల్లో సోఫాలో కూర్చుని ఒక చేత్తో కాఫీ కప్పుపట్టుకుని, మరో చేత్తో పేపరుప ట్టుకు చూస్తూ, నెమ్మదిగా కాఫీ తాగుతున్నాడు

గుమ్మం దగ్గర అలికిడి అయింది.

ధనుంజయరావు పేపర్లో నుండి ఓరగా తలెత్తి అటువైపు చూశాడు.

గుమ్మం దగ్గర చెందూ నిలబడి వున్నాడు. కళ్ళల్లో కోపంలేదు. ఏదో సందేహిస్తున్నట్లుగా ఉన్నాడు. ఒక్కక్షణం తటపటాయించి తండ్రి కి కొంచెం దగ్గరగా వచ్చి నిలబడి పిలిచాడు

"డాడీ!"

ధనుంజయరావు కాఫీ కప్పు పక్కనపెట్టి కళ్ళెత్తి చూసాడు.

"డాడీ!"

"ఊ!" కాలుమీద కాలువేసుకుని విలా సంగా సోఫాలో జారిగలపడుతూ అన్నాడు. గర్వంగా వుంది. ఇపుడు వాడికి ఏదో అవసర మొచ్చినట్లుంది. అందుకే ఆ బతిమాలుతు న్నట్లుగా, అభ్యర్థిస్తున్నట్లుగా వున్న స్వరం.

చెందూ మాట్లాడలేదు.

"ఏమిటీ!" ధనుంజయరావే అడిగాడు. ఆ కంఠంలో కుతూహలం వుంది. ఇంత పొద్దున్నే తనతో వీడికి ఏం అవసరం వుందా- అని.

"డబ్బు కావాలి!" సూటిగా చెప్పాడు చెందూ.

ధనుంజయరావు కనుబొమలు చిట్లించా డు. ముఖం ఎర్రబడింది. సోఫాలో మళ్ళీ సర్దుకు కూర్చున్నాడు. డబ్బు! ఎపుడూ డబ్బు! ఈ వయసులో వీడికి ఎన్ని ఖర్చులు? లాభంలే దు! తగ్గించాలి. తీక్షణమయిన చూపులతో "ఎందుకు?" అని ప్రశ్నించాడు.

బలవంతాన తెచ్చిపెట్టుకున్న వినయం ఆ ప్రశ్నతో గాలికి ఎగిరిపోయింది. చెందూ ముఖం కోపంతో ఎర్రబడింది. గుండె ఆవే శంతో కొట్టుకోసాగింది.

ఛీ... ప్రశ్నలు! వెధవ అనుమానాలు! నోరు తెరిచి అడిగాడుకదా ఒకే ఒక్క కొడుకు. ఇస్తే అరిగిపోతుందా? కాస్త డబ్బు అడిగితే, లక్షలు ఖర్చుచేస్తున్నట్లు సవాలక్ష ప్రశ్నలు.

చెందూ మాట్లాడకపోవడం చూసి తనే




అన్నాడు ధనుంజయరావు "నిన్నే... మాట్లాడవేం?" చెందూ గిర్రున తిరిగి "అవసరంలేదు!" కఠినంగా అని చకచకా తన గదిలోకి వెళ్ళి ధడేలున పెద్ద శబ్దమయ్యేలా తలుపు వేసుకున్నాడు.

గంటవరకూ లోపలి నుండి రాలేదు. తర్వాత గబగబా బయటకు వచ్చాడు ఎర్రబడిన కళ్ళతో. అయిదు నిముషాలలో డ్రెస్ చేసుకుని, లూనా మీద రోడ్డు మీదకు వెళ్ళిపోయాడు.

ఇదంతా గమనిస్తూనే ఉన్నాడు ధనుంజయరావు.

పళ్ళునూరాడు. వెధవకి ఎంత పొగరు? డబ్బు ఎందుకు అని అడిగితే తననేదో అవమానం చేసినట్లు ఫీలింగ్స్! అది కూడాతప్పే

అణచాలి... పొగరు అణచాలి!

శాంతి వచ్చింది, లోపల నుండి చేత్తో వక్క పొడి డబ్బాతో.

భర్తకి అందిస్తూ అంది— "ఏమిటీ... మళ్ళీ ఏమయినా అన్నారా? చెందూ కోపంగా వెళ్ళాడు!" ధనుంజయరావు సమాధానం చెప్పకుండా, ఒక్కక్షణం పక్కనే నిలబడ్డ శాంతిని చూశాడు.

చిన్నగా నిట్టూర్చి అన్నాడు— "కూర్చో శాంతీ!"

"వద్దులేండి! నేను ఇలా నిల్చుంటేనే మీకు ఇష్టం!" వ్యంగ్యంగా అన్నదో, సరదాగా అన్నదో పట్టించుకోలేదు ధనుంజయరావు.

"శాంతీ!"

"ఏమిటి?"

"నేనొకటి అడుగుతాను. సూటిగా చెబుతావా?"

"చెబుతాను. అయినా మీరు అడగబోయేదేమిటో తెలుసు. చెందూ గురించేగా?"

"అవును"

"అయితే ఏమిటంటారు?" కొంచెం విసుగ్గా అంది.

"వాడు...బాగా చదువుతున్నాడా?"

"ఏమో... తెలియదు" కుండబద్దలు కొట్టినట్లుగా వచ్చింది సమాధానం.

ఉలిక్కిపడ్డట్టుగా చూసాడు భార్యవైపు. "అంటే?..." అన్నాడు.

"అది తెల్సుకోవాల్సింది మీరు... నేనుకాదు!"

కోపంగా అన్నాడు— "అంటే... తల్లిగా నీకు బాధ్యత లేదంటావా?"

ఒళ్ళుమండింది శాంతికి. ఆమె కళ్ళ ముందు రకరకాల దృశ్యాలు కదిలిపోతున్నాయి. ఏవేవో బయటకు చెప్పాలని వుంది. అయినా కంట్రోల్ చేసుకుంటూ కొంచెం హేళనగా అంది. "ఉంది. కాని, మీరు నన్ను వంటింటికి, పడకటింటికే పరిమితం చేసారు. చిన్నప్పటి నుండీ వాడి పోషణకు, నిన్న మొన్నటి వరకు కూడా ఆయానే పెట్టారు. అపుడు లేని బాధ్యత ఇపుడెందుకు వస్తుంది?"

శాంతి మాటల వెనక మరో అర్థం ధనుంజయరావు చురుకైన మెదడు చప్పున గ్రహించింది. దవడఎముక బిగుసుకుంది. కోపంగా భార్యవైపు చూస్తూ అన్నాడు— "ఎందుకు? నేనొకటి అడిగితే మరొకటి గుర్తు చేస్తావు?"

"ఎలా మర్చిపోతాను మరి. పాపం! ఒంటరిగా వచ్చిన ఆయా వెళ్ళేటపుడు మరో ప్రాణితో వెళ్ళింది. అదంతా మీ పుణ్యమేగా మరి!"

"శాంతీ! జాగ్రత్తగా మాట్లాడు. అసలు..."

"హయ్యోరామ! నేనేమన్నానండీ అంత కోపం? మొదటి నుండీ పగలు వంటింటికీ, రాత్రి పడకటింటికీ పరిమితమయిపోయి ఎంతో క్రమశిక్షణతో మీరు నేర్పిన కట్టుబాట్లను సదా ఆచరిస్తున్నందుకు మీ భార్యగా సంతోషిస్తున్నాను!"

ఆవేశంతో ముక్కుపుటాలు అదురుతుండగా అన్నాడు ధనుంజయరావు.

"హు! ఎందుకలా ఆడిపోసుకుంటావు? సాయంత్రం గుడికి వెళ్లడంలా? నేనేదో ఇంట్లో కట్టిపడేసినట్లు మాట్లాడతావేం?"

"ఏం.... గుడికికూడా వెళ్ళకూడదా? పక్కవాళ్ళింటికి వెళితే తప్పు! గుడికి వెళితే తప్పు. మేమూ మనుషులమే! మాకూ కోర్కెలుంటాయండీ!" విరక్తిగా నవ్వుతూ అంది.

"మారిపోతున్నావు శాంతీ! మారిపోతున్నావు"

"మారిపోతున్నానా? ఇంకా నయం. కొడుకు ఎలాగో చెయ్యిదాటిపోయాడు. పెళ్లామయినా గడపదాటనందుకు సంతోషించండి." పిడుగుల్లా వచ్చాయి మాటలు.

సోఫాలో నుండి దిగ్గున లేచాడు ధనుంజయరావు. "శాంతీ! ఏమిటి నీ ఉద్దేశం?"

భర్తకళ్ళల్లోకి సూటిగా చూస్తూ అంది— "ఏముంది, భార్యా పిల్లలు కూడా మనుషులే... ఖైదీలుకాదు. డిసిప్లైన్ అంటూ చంపొద్దని చెబుతున్నాను"

"నిన్ను ఖైదీగా చూసానంటావా? అలాంటిదానివి ఎందుకు ఈ జైలులో కాపురం చే





యడం? పారిపోకపోయావా?''

నవ్వింది హేళనగా. "ఏమవుతుంది? మళ్లీ తీసుకొచ్చి బంధిస్తారు. ఆసమయంలో నాకన్నా మీరే ఎక్కువ భయపడతారు సమాజానికి. పరువు, డబ్బు వున్న మనుషులు కదామరి''

పళ్ళబిగువున అన్నాడు— "నీకు...నీ కు...అసలు బుద్ధిలేకుండా పోతోంది''

విసుగ్గా అంది శాంతి— "చూడండి. నాకు అవతల పని వుంది''

చిత్రమేమిటంటే, ధనుంజయరావు సొసైటీలో ఎంతహు ందాగా, గంభీరంగా ప్రవర్తిస్తా, డే, ఒక్కొక్కసారి అంత తేలికైపోతాడు భార్య ముందు. మొదట్లో కొడుకువలెనే, భార్యని కూడా అణచివుంచాలని చూసాడుకాని సాధ్యపడలేదు. మొదట్లో శాంతి భర్తకు భయపడినా క్రమక్రమంగా అది విసుగులోకి దించింది. ఇపుడంతగా బెదరదు. ఎందుకంటే భర్త బలహీనతలేమిటో బాగా తెలుసు. ఎక్కడా బయటపడకపోవడం ఆమె ప్రత్యేకత. గింజుకుంటున్నట్లుగా అన్నాడు ధనుంజయరావు— "అసలు విషయాన్ని అవతలకు నెట్టేశావు. ఊ! చందూ బాగా చదువుతున్నాడా?''

"నాకు తెలియదని చెప్పాను''

"ఎందుకంత కోపం?" ఉక్రోషంగా అన్నాడు.

"ఆనందం గురించి నాకు తెలియదు'' నిర్లిప్తంగా అన్నది.

"డొంక తిరుగుడెందుకు?''

"మీరడిగిన ప్రశ్నలకు సూటిగానే సమాధానాలు చెబుతున్నాను''

"చెందూ కాలేజికి వెళుతున్నాడా?'' ఒక్కొక్క అక్షరమే ఒత్తిపలుకుతూ అన్నాడు.

"ఇంటి దగ్గరనుండి వెళ్ళడమే నాకు తెలుసు!''

"పోనీ! రాత్రిళ్ళు ఎన్నింటికి వస్తున్నాడో తెలుసా?''

"తెలియదు''

"అదీ తెలియదా?''

"ఊహు! వాడు వచ్చేసరికి నేను నిద్రపోతాను''

"అంటే... వాడు అంత ఆలశ్యంగా''

"అబ్బబ్బ! ఈ ప్రశ్నలతో నన్ను చంపకపోతే ఆ పర్యవేక్షణ ఏదో మీరే చేయరాదూ?'' అని కొంచెం హేళనగా అంది. మళ్ళీ "అవును లే! వాడు ఎపుడొచ్చేదీ మీకెలా తెలుస్తుంది పాపం! మీరు వచ్చేది ఎపుడో తెల్లవారుఝామున కదా!''

దెబ్బతిన్నాడు ధనుంజయరావు. మళ్ళీ మాట్లాడలేదు.

శాంతి కాఫీ కప్పుతీసుకుని వెళ్ళబోతూ గుమ్మంలో అలికిడి అయితే తలతిప్పి చూసింది.

కాంతి!

నవ్వుతూ ఆహ్వానించింది. "రా కాంతీ! బాగున్నావా?''

కాంతి నవ్వుతూ ధనుంజయరావువైపు చూసి చేతులుజోడించి "నమస్తే అంకుల్!'' అంది. ధనుంజయరావు గంభీరంగా తల ఊపాడు.

"చెందూ లేడా ఆంటీ?'' శాంతివైపు చూస్తూ అంది.

"దేనికి?'' ధనుంజయరావు ప్రశ్నించాడు.

"వారంరోజుల క్రితం టెక్స్టుబుక్ తీసుకున్నాను... ఇచ్చేద్దామని!''

"సరే... కూర్చో!''

కాంతి తటపటాయిస్తూ నిల్చుంది.

"ఫరవాలేదు కూర్చో కాంతీ!'' అన్నాడు.

కాంతి మౌనంగా కూర్చుంది. శాంతి లోపలికి వెళ్ళింది కాఫీ కలపడానికి.

ధనుంజయరావు క్షణంసేపు మౌనంగా వుండి, కాంతివైపు చూస్తూ అడిగాడు. కాని ఆ ముఖంలో ఇంతక్రితం తిన్న దెబ్బతాలూకు ఎరువుదనం తగ్గలేదు. మనసులో భార్యమీద ఉక్రోషంగా వుంది.

"కాంతీ!''

"ఏం అంకుల్?''

"చెందూ రెగ్యులర్‌గా క్లాసులకు అటెండ్ అవుతున్నాడా?''

"అవుతున్నాడనే అనుకుంటున్నాను

అంకుల్!''

"బాగా చదువుతున్నాడా?''

తలొంచుకుంది. ముక్తసరిగా "ఊ" అంది.

"నూటిగా చెప్పు! నిజం చెప్పు! తల వంచు కుంటావేం?''

"చెందూ బాగా చదువుతాడు అంకుల్!''

ధనుంజయరావు కొంచెం విసుక్కున్నాడు— "ఇపుడు చదువుతున్నాడా అని..''

భయం భయంగా చూస్తూ చెప్పింది— "తెలీదు!''

ఇంతలో లోపల నుండి శాంతి వచ్చింది కాఫీ కప్పుతో. కాంతి చేతికి ఇస్తూ "తీసుకో కాంతీ!'' అంది.

"వద్దు అంటీ... ఇపుడే తాగివస్తున్నాను. ఇంటినిండా బంధువులు. నిన్న వచ్చారు. ఈ పుస్తకం చదవడానికి కుదరడం లేదు. అనవసరంగా నాదగ్గర ఎందుకు? చెందూ అయినా చదువుకుంటాడనే ఉద్దేశంతో...''

శాంతి నవ్వింది. "వస్తాడు... ఇంత క్రితమే బయటకు వెళ్ళినట్టున్నాడు!''

కాంతి మౌనంగా కాఫీ తాగి, అయిదు నిముషాలు కూర్చుని వెళ్ళిపోయింది.

శాంతి భర్తవైపు చూడకుండా, కాఫీకప్పు సర్దుతూ అంది— "బాంబే ప్రయాణం అన్నారు. ఎపుడు?''

"లేదు... కాన్సిల్ అయింది!''




ఆ రాత్రి....

చెందూ గదిలో మంచంమీద పడుకున్నాడు. పక్కనే పుస్తకం బోర్లావేసి వుంది. ఆలోచిస్తున్నాడు.

సిగ్గుగా ఉంది. ఫ్రెండ్స్ అడిగితే ఏం చెప్పాలి? షేమ్! ఛీ... వెధవ డబ్బు అడిగితే తనేదో దొంగతనం చేస్తున్నట్టు, చెయ్యరాని పని చేస్తున్నట్టు అనుమానాలు. హాయిగా, ఆ కిషోర్ డాడీ చూడు! కిషోర్ ఎంత అడిగితే అంత ఇస్తాడు. ఒక్కొక్కసారి కిషోర్ అడగనుకూడా అడగడుట! తనే బీరువా తీసి, తనకి కావల్సిన డబ్బు తనే తీసుకుంటాడు. తనకీ ఉన్నాడు ఓ రాక్షసుడు ఎందుకు?

చెందూకి ఉక్రోషంగా ఉంది. కసిగా ఉంది. కోపంగా ఉంది. చేతిలో దిండు నలుగుతోంది. పంటికింద పెదవి నలుగుతోంది.

ఆఖరికి ఒక నిర్ణయానికొచ్చాడు.

లాభం లేదు... అడగాలి. తప్పదు. వెధవ మొహం వేసుకుఅయినా అడుక్కోవాలి! ఇదే ఆఖరుసారి! ఇక జన్మలో అడగడుకాక అడగడు! కావాలంటే తనే సంపాదిస్తాడు.

దిగ్గున మంచం మీదనుండి లేచాడు.

కర్టెన్ తొలగించి హాల్లోకి వచ్చాడు.

అపుడే ధనుంజయరావు భుజం మీద ఉన్న టవల్‌తో చేతులు తుడుచుకుంటూ తమ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళబోతున్నాడు.

"డాడీ!''

ధనుంజయరావు వెనక్కి తిరిగి చూసాడు ఆశ్చర్యంగా.

పొద్దున్న అంత కోపంగా వెళ్ళిన చెందూలో ఇంతలో ఎంత మార్పు! డబ్బు కావాలేమో! ధనుంజయరావు వచ్చి సోఫాలో కూర్చున్నాడు.

"డాడీ!''

"ఏమిటి... డబ్బు కావాలా?''

"ఊ!''

"ఇస్తాను... కాని ఏం చేస్తావు?''

చెందూకి ఒళ్ళు భగ్గునమండింది. అదే... ఆ ప్రశ్నే కోపం తెప్పించేది. మాట్లాడలేదు.

"చెప్పవేం? బట్టలు కుట్టించుకోవాలా?''

"ఊహూ!'' పళ్ళు బిగువున అన్నాడు.

"పుస్తకాలు ఏమయినా కొనాలా?''

"లేదు!''

"మీ కాలేజి ఫ్రెండ్స్... ఎక్స్‌కర్షన్... పిక్నిక్స్

లాంటివి ఏమయినా...''

''కాదు!''

''మరి?''

భగ్గుమన్నట్లుగా చెప్పాడు చెందు— ''ఆ ప్రశ్నలే వేయొద్దంటాను''

ధనుంజయరావులో కోపం రాజుకోసాగింది. ''ఏం? ఎందుకు? అడిగే హక్కు లేదా నాకు?''

చెందూ ఒక్కక్షణం ఏదో ఆలోచనలోపడిన ట్లుగా అయి, తర్వాత కవ్వింపుగా అన్నాడు—

''అబద్ధం చెప్పడం నాకు ఇష్టం లేదు!''

''పోనీ! నిజమే చెప్పు... ఎందుకు?''

''సుఖం కొనుక్కోడానికి!''

ధనుంజయరావుకి తెలుసు తనని కవ్విస్తు న్నాడని. కనుబొమలు ముడిచి తనూ అడిగా డు కాస్త వ్యంగ్యంగా ''ఏ సుఖం? ఎలాంటి సుఖం?''

''చెప్పను!'' బింకంగా వచ్చింది సమాధానం.

''ఖరీదెంత?''

''మీరిచ్చే డబ్బును బట్టి!''

''చెందూ! నీ వయసెంతో తెలుసా?''

''తెలుసు! ఆ వయసుకు ఉన్న మనసు విలువెంతో కూడా తెలుసు. తెలియంది మీ కే!''

ఇంతసేపూ గొంతులో అదిమిపెట్టి ఉంచిన కోపం, ఆవేశం ఒక్కసారిగా ఒళ్ళు విరుచుకుని బయటకు వచ్చాయి. ధనుంజయరావు ముఖం ఎర్రగా కందిపోయింది. దిగ్గున సోఫా లోనుండి లేచాడు.

''రాస్కెల్... ఎంత ధైర్యం నీకు!'' అంటూ చెయ్యి గాలిలోకి ఎత్తాడు.

చెందూ ఊర్కోలేదు. మెరుపులా పక్కకు కదిలి, తండ్రి చేతిని మధ్యలోనే పట్టుకుని అన్నాడు— ''ఆగండి! జాగ్రత్తగా మెల గండి!'' కఠినంగా కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ అన్నాడు.

అపుడు వాళ్ళిద్దరూ తండ్రీకొడుకుల్లా లేరు.

యుద్ధ భూమిలో శత్రుసైనికుల్లా వున్నారు.

అప్పటికే కంగారుగా లోపలనుండి పరిగె త్తుకు వచ్చింది శాంతి.

''చెందూ... ఏమిట్రా? ఏమయింది?''

చెందూ తండ్రికి దూరంగా జరిగి అన్నా డు— ''ఏమయిందా? నా ఖర్మ! ఇలాంటి తండ్రి ఉండటం!''

''చూడు! చూడవే... నీకొడుకు మాటలు. డబ్బుకావాలిట. సుఖం కొనుక్కుంటాడట! రా స్కెల్!'' ఫిర్యాదు చేస్తున్నట్లుగా అరిచాడు.

శాంతి చెందూవైపు చూస్తూ కోపంగా అంది— ''చెందూ! నిజమేనా?''

చెందూ విసురుగా తల ఎగరేసాడు. ''ఎందుకు? ఏమిటి? ఎంత? అని సవాలక్షప్ర శ్నలు వేస్తుంటే ఒళ్ళుమండి అలా చెప్పాను. అయినా నేనేదో డబ్బు దుబారా చేస్తున్నట్లు. అడగక అడగక అడిగితే అన్నీ ప్రశ్నలే! అన్నీ అనుమానాలే! వెధవ ఇంటరాగేషను!''

''పోనీ ఎందుకో చెప్పచ్చుగా! ఇంతలో ఏంపోయింది?''

''ఏముంది! కాలేజీ ఎలక్షన్స్‌లో పోటీచేస్తు న్నాను. అందుకు!''

అంతసేపు బుసలుకొడ్తున్నట్లుగా ఉన్న ధనుంజయరావు కల్పించుకున్నాడు.

''ఎలక్షన్సా! అంతపెద్దవాడివయ్యావన్న మాట! ఇవ్వను! ఛస్తే ఇవ్వను!''

చెందూ కోపం తారాస్థాయిని అందుకుంది ఆమాటతో! ఆవేశంతో రొప్పుతూ అన్నాడు—

''దాచుకోండి! భద్రంగా దాచుకోండి! మూ టలు కట్టుకోండి! మీరే అనుభవించండి! కా ని...కాని..అనుభవిస్తారు ముందు ముందు! నేనేమీ తప్పుపని చేయడంలేదే! మీ సొసైటీలో రోటరీక్లబ్, లైన్స్‌క్లబ్ అంటూ వాటికి ప్రె సిడెంట్‌గా పోటీచేస్తే అది హోదా! గొప్ప తనం! కాని కాలేజి ఎలక్షన్స్‌లో నేను పోటీచేస్తే అది విచ్చలవిడితనము!''

''నోర్ముయ్! బుద్ధిగా కూర్చుని చదువు. డబ్బు ఇస్తాను. అంతేకానీ...''

''అయితే ఇవ్వండి!'' మొండిగా అన్నాడు చెందూ.

మళ్ళీ మొదటికి వస్తూ అడిగాడు ధనుంజ యరావు— ''ఏం కొనాలి?''




"పుస్తకం!"

"ఏమిటా పుస్తకం?"

కసిగా చెప్పాడు చెందూ— "కోర్కెలకు సమాధి!"

దవడబిగువున అన్నాడు ధనుంజయరావు. "చందూ! ఏదోలే అని నిర్లక్ష్యం చేస్తున్నాను. ఇకనుంచి సహించను. చంపేస్తాను జాగ్రత్త... పిచ్చిపిచ్చివాగుడు కట్టిపెట్టు"

"మీరు చంపడానికి నేను ఉంటేకదా!"

శాంతి కంగారుగా అంది. "చెందూ... ఏమిట్రా నీ మాటలు?" భర్తవైపు తిరిగి "మీరయినా ఊర్కోండి. వాడితోపాటు మీరు!" అంది.

"ఉండు మమ్మీ! చెప్పనీ... ఎపుడో వెళ్ళిపోతాను. ఇంట్లోనుండి వెళ్ళిపోతాను. చెప్పకుండా మాత్రం వెళ్ళను! చెప్పే వెళతాను. గుర్తుంచుకోండి!"

"వెళ్ళరా వెళ్ళు! బెదిరిస్తున్నావేం? డొక్క మాడితే మళ్ళీ నువ్వే తిరిగి వస్తావు!"

"అసంభవం!"

శాంతి కోపంగా అరిచింది. "సర్లే... ఊర్కోండి. సిగ్గులేకుండా ఇంటినిపడి ఏమిటా అరుపులు!"

చెందూ చెయ్యిపుచ్చుకుని లోపలికి లాక్కెళుతూ అంది— "డబ్బు నేనిస్తాను రా చెందూ!"

కసిగా చూస్తూ గొణిగాడు ధనుంజయరావు. "చెడగొట్టవే! నీవల్లనే వాడు అతిగారాబంతో చెడిపోతున్నాడు. ఎవరిని అని ఏంలాభం?"

ఆరాత్రి చెందూ, ఎంత బ్రతిమలాడినా అన్నం తినలేదు. శాంతి చిన్నగా నిట్టూర్చింది. రోజురోజుకీ ఈ తగాదాలు ఎక్కువయిపోతున్నాయి. ఇద్దరిమధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమంటోంది.

ఆరాత్రి ఎవరి ఆలోచనల్లో వాళ్ళు గడిపారు.

ధనుంజయరావు, చెందూ బాగానే నిద్రపోయారు. ఎటొచ్చీ నిద్రపోనిది శాంతి ఒక్కతే!

★ ★ ★

మర్నాడు సాయంత్రం... ధనుంజయరావు సుబ్రమణ్యం హెూటల్‌దగ్గరికి వెళ్ళాడు. ఏమీ తోచకపోయినా, మనసు బాగుండకపోయినా... సుబ్రమణ్యం హెూటల్‌కి వెళ్ళి కూర్చోవడం అలవాటే! నిజానికి....కావాలంటే, కల్పించుకోవాలంటే చాలా వ్యాపకాలున్నాయి. కాలక్షేపాలున్నాయి.

కానీ మనశ్శాంతి లేనపుడు సుబ్రమణ్యం చెప్పేమాటలే మందు! ఎంతో ఊరట కల్గిస్తున్నట్లుగా ఉంటాయి ఆయన మాటలు.

సాయంత్రంవేళ అవడంతో...హెూటల్ బాగా రష్‌గా ఉంది. సుబ్రమణ్యం కౌంటర్‌దగ్గర బాగా బిజీగా ఉన్నాడు. డిస్టర్బ్ చేయడం ఇష్టంలేక, ఒకమూలగా కూర్చున్నాడు పేపరు చూస్తూ!

ఆరోజెందుకో...మనసు అదోలావుంది.

ముఖ్యంగా చెందూ గురించే ఆలోచన!

రోజు రోజుకీ చెయ్యిదాటిపోతున్నాడా? వాడిలో నిర్లక్ష్యం పెరిగిపోతోంది. పెద్దలంటే గౌరవం తగ్గిపోతోంది.

దారిలోకి ఎలాతేవాలి?

"ఏమిటండీ ఆలోచిస్తున్నారు?" అన్న స్వరం విన్పించి తల విదిలించాడు ధనుంజయరావు.

ఆ వ్యక్తి ఎవరో చప్పున గుర్తుకురావడంలేదు! ఎక్కడో చూసాడు! కానీ ఎవరు?

ధనుంజయరావు ఆ వ్యక్తివంకే చూస్తుండిపోయాడు.

ఆ వ్యక్తి నవ్వుతూ, ధనుంజయరావుకి ఎదురుగా కుర్చీలో కూర్చుంటూ "గుర్తుపట్టలేదాండీ నన్ను?" అన్నాడు

చప్పున గుర్తుకు వచ్చింది.

శ్రీధర్!

చెందూ కాలేజీలో లెక్చరర్!

నవ్వాడు. "హలో" అన్నాడు.

శ్రీధర్ ఆశ్చర్యంగా చూస్తూ అన్నాడు— "మీరేమిటి ఎ.సి. హెూటల్స్‌లో కూర్చోవలసినవారు. ఒంటరిగా ఈ మూల! మీ స్నేహితుడు సుబ్రహ్మణ్యంగారు బిజీగా ఉన్నట్లున్నారు. అందుకనా ఇక్కడ కూర్చున్నారు?"

"అపుడపుడూ ఏమీ తోచనపుడూ.. అల

వాటే!'' చెప్పాడు ధనుంజయరావు.

అంతలో ఏదో గుర్తొచ్చినట్లు కదిలి అడిగాడు "అన్నట్లు శ్రీధర్‌గారూ! ఏమంటున్నాడు మా చెందూ! ఏమైనా చదువుతున్నాడా?''

"తెలియదు!'' చిన్నగా చెప్పాడు శ్రీధర్.

"అదేమిటి?'' ఆశ్చర్యంగా అన్నాడు ధనుంజయరావు.

"క్లాసులకి రావడంలేదు కనుక!''

"శ్రీధర్‌గారూ... అంటే...''

"అవునండీ! రెగ్యులర్‌గా ఎటెండ్ కావడంలేదు. కాని, మీరు 'చదువుతాడా?' అని అడిగివుంటే తడుముకోకుండా సమాధానం చెప్పేవాడిని "చాలాబాగా'' అని''

"పోనీ... పోనీ... ఎక్కడికి వెళుతున్నాడో ఏమయినా తెలుసా?'' కంగారుగా, మాటలకు తడుముకుంటూ అన్నాడు ధనుంజయరావు.

ఈ విషయం ఆశ్చర్యంగా ఉంది. సాధారణంగా చెందూ కాలేజి ఎగ్గొట్టటం ఎపుడూ లేదే!

"తెలుసు!'' గంభీరంగా అన్నాడు శ్రీధర్.

"ఎక్కడికి?'' ఆత్రంగా అడిగాడు ధనుంజయరావు.

"ఇంకెక్కడికి? కాలేజికే?''

"అంటే?'' అర్థంకాక తెల్లబోతూ అడిగాడు.

"క్లాసులకు ఎటెండ్ అవడంలేదు కానీ, కాలేజి కాంపస్‌లో మాత్రం అవర్ అవర్‌కి ప్రత్యక్షం!''

"నిజమా...''

"ధనుంజయరావుగారూ... నిజానికి మీ అబ్బాయి గురించి మీ దగ్గర చెప్పకూడదు. కాని నా స్టూడెంట్. అతని భవిష్యత్‌దృష్ట్యా చెప్పక తప్పదు. చెందూకి ఓ గర్ల్‌ఫ్రెండ్ ఉందంటే నమ్మగలరా? చెందూకేకాదు- ఈరోజుల్లో కుర్రాళ్ళకి అందరికీ అదో ఫాషన్- ఓ గర్ల్‌ఫ్రెండ్ వుండటం!''

ధనుంజయరావు చెవులు వినడం మానేశాయి.

ఆయన కళ్ళముందు రకరకాల దృశ్యాలు.

చెందూ, మరో అమ్మాయి... చెట్టావట్టాలేసుకుని పార్కుల్లో తిరుగుతూ... బీచ్‌లో పరిగెడుతూ... చప్పున తెప్పరిల్లి అన్నాడు— "శ్రీధర్‌గారూ.. నిజమా... మైగాడ్.. ఎంతవయసని వాడికి? అపుడే గర్ల్‌ఫ్రెండ్స్... కాలేజి ఎగ్గొట్టటాలు... వ్యవహారం శృతిమించలేదు కదా!''

"శృతిమించటమేకాదు... దాటిపోయినా ఆశ్చర్యపోనవసరంలేదు!''

"అంటే... అంటే... ఎలా?''

శ్రీధర్ నవ్వాడు. "నన్నుకాదు... కాలేజికి ఎదురుగావున్న మెడికల్‌షాపువాడిని అడగండి. ఈ కాలపు కుర్రాళ్ళు... ముఖ్యంగా స్టూడెంట్స్.. వెర్రినాగరికతా వ్యామోహంలోపడి, ఎలా కొట్టుకుపోతూ, చెడిపోతున్నారో బాగా చెబుతాడు. ఎందుకంటే బిజినెస్ వాడిది కదా!''

శ్రీధర్ చెప్పినదేమిటో మొదట అర్థంకాలేదు ధనుంజయరావుకి.

అర్థం అయ్యేసరికి కళ్ళు మంకెనపూలు అయ్యాయి. గుప్పిళ్ళు బిగుసుకున్నాయి.

కాసేపటికి శ్రీధర్ వెళ్ళిపోయాడు.

అపుడు వచ్చాడు సుబ్రమణ్యం. ధనుంజయరావు ముఖం చూస్తూనే ఉలిక్కిపడ్డాడు.

నెమ్మదిగా అడిగాడు విషయమేమిటని. ధనుంజయరావు గొణిగినట్లుగా చెప్పాడు.

ధనుంజయరావు నెమ్మదిగా తలెత్తాడు. ఆ కళ్ళు ఎర్రగావున్నా... నిస్సహాయతని సూచిస్తున్నాయి.

నెమ్మదిగా గొణిగినట్లుగా అన్నాడు— "చెబుతాను! వాడి అంతు తేలుస్తాను!''

సుబ్రమణ్యం అన్నాడు— "నిజమే.. కాని.. ఇపుడు నువ్వెళ్ళి చెందూని తిట్టడమో, కొట్టడమో చేస్తే చెందూ మారతాడని అనుకోవడం నీ భ్రమ. మంచిమాటలతో చెప్పు''

పిడుగుల్లా వచ్చాయి మాటలు ధనుంజయరావు నోట్లోంచి.

"మంచిమాటలా! ఆ బ్రూట్‌కి మంచిమాటలా? ఎంత కసిగా ఉన్నదంటే కన్పిస్తే కాల్చేయాలనిపిస్తోంది!''

"ధనుంజయా! చెందూగురించి నువ్వు మరీ విపరీతంగా ఆలోచనలు చేస్తున్నావు....




గొప్ప ఆశలు పెంచుకుంటున్నావు. ఏవో కలలు కంటున్నావు"

"తప్పా? అయినా ఒక్కగానొక్క కొడుకు"

"అందుకని? ఇదామార్గం? చెడ్డదాని దారిలోకి... మంచి మార్గంలోపెట్టే పద్ధతి ఇదిమాత్రం ఖచ్చితంగా కాదు!"

"నిజమే సుబ్రమణ్యం! కాని ఈ వయసు తీగ మీద నడకలాంటిది. చెడవైపుకు మళ్ళినా, మంచివైపువచ్చినా ఈ వయసులోనే"

"ఆమాత్రం అర్థంచేసుకున్నావుకదా! చాలు. పిల్లల్ని ఈ వయసులోనే వేయికళ్ళతో కనిపెట్టికుని ఉండాలి. జాగ్రత్తగా కాపాడాలి. స్నేహితునిలా ట్రీట్‌చేయాలి"

కోపంగా అన్నాడు ధనుంజయరావు.



''ఇంకా నయం. నెత్తికెక్కించుకోవాలన్నావుకాదు. సుబ్రమణ్యం! నీకు తెలియదు. అనుభవం తక్కువ. ఇలాగే... స్నేహితుడు.. హితుడు అంటూ చూస్తూ ఊర్కుంటే మనకే పాఠాలు చెబుతారు. అందుకని ఎక్కడ ఉంచాలో అక్కడే ఉంచాలి కొడుకయినా, కూతురయినా సరే!''

హఠాత్తుగా లేచి అన్నాడు— ''వస్తాను సుబ్రమణ్యం! వాడి అంతు తేలుస్తాను. గర్ల్ ఫ్రెండ్స్ ఏమిటో... ఈ తిరుగుళ్ళు ఏమిటో...''

చకచకా వెళుతున్న ధనుంజయరావుని వారిస్తూ కంగారుగా అన్నాడు సుబ్రమణ్యం—

''జాగ్రత్త! అసలే ముక్కోపివి! ఆవేశంలో ఏంచేస్తావో నీకే తెలియదు. చెందూని ఏమీ అనమాకు! నెమ్మదిగా చెప్పు!''

ధనుంజయరావు నిర్లక్ష్యంగా నవ్వేసి బయటకు నడిచాడు.

★ ★ ★

''చెందూ!'' ధనుంజయరావు అరుపుకి ఆ ఇల్లు ప్రతిధ్వనించింది.

ఆ స్వరానికి లోపల వంటచేస్తున్న శాంతి ఉలిక్కిపడి, హడావిడిగా హాల్లోకి పరిగెత్తుకొచ్చింది.

భర్త స్వరూపం చూస్తూనే హడలిపోయింది.

ధనుంజయరావు చెందూ గది దగ్గరకువెళ్ళి తలుపు తోయబోయి, బయటికి గడియ వేసి ఉండటంచూసి, వెనక్కి తిరిగాడు.

శాంతి నిల్చుని వుంది.

''శాంతీ! చెందూ ఏడి?''

''ఎ..ఎందుకు... ఏమయింది?''

''అడిగినదానికి సమాధానం చెప్పు! చెందూ ఏడి?''

''ఏమో తెలియదు!''

ధనుంజయరావు మాట్లాడలేదు. కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి. ఒకచోట నిలువలేనట్లుగా అటూఇటూ పచార్లు చేస్తున్నాడు.

దాదాపు అరగంట తర్వాత...

బయట లూనా శబ్దం అయింది.

వంటింటి గుమ్మం దగ్గర కూర్చున్న శాంతి గుండె గుబగుబలాడ సాగింది.

ఏ జరగబోతోంది? ఏమయింది అసలు?

పులిలాగా వరండాలో అటూ ఇటూ పచార్లు చేస్తున్న భర్తను చూస్తుంటే— ఏదో జరగకూడనిదే జరిగినట్లనిపిస్తోంది.

వేలితో కీచెయిన్ గిర్రున తిప్పుతూ, హుషారుగా విజిల్‌వేస్తూ, డాన్స్‌చేస్తున్నట్లుగా నడుస్తూ లోపలికి వచ్చిన చెందూ గుమ్మందగ్గరే ఆగిపోయాడు.

ఎదురుగ ధనుంజయరావు.

పులిలాగా. బెబ్బులిలాగా నించునివున్నాడు.

ఆ కళ్ళు సూటిగా చెందూనే చూస్తున్నాయి.

ఆ కళ్ళు అగ్నిగుండాల్లా వున్నాయి.

చెందూ క్షణంసేపు ఉలికిపడినట్లుగా అయినాడు. అది క్షణికం మాత్రమే!

మరుక్షణం...

నిర్లక్ష్యంగా తలఎగరేసి లోపలికి-తన గది వైపు నడవబోయాడు.

''చెందూ!''

శాంతి ఉలిక్కిపడింది

కాని... చెందూ ఓరగ తలతిప్పి, కళ్ళ చివర్లనుంచి నిర్లక్ష్యంగా చుస్తూ ''ఏమిటి?'' అన్నాడు.

''ఎక్కడనుంచి వస్తున్నావ్?''

''అన్నీ మీకు చెప్పాలా! రోజూ చెప్తున్నానా?''

''నోర్ముయ్ రాస్కెల్... ఏ గర్ల్‌ఫ్రెండ్ దగ్గర గడిపి వస్తున్నావురా?'' గద్దించాడు ధనుంజయరావు. శాంతికి ఏదో అర్థమవుతోంది. కంగారుగా చెందూవైపు చూసింది.

చెందూ గతుక్కుమన్నాడు ఆ ప్రశ్నవిని! మరుక్షణం తమాయించుకుని ఆశ్చర్యం నటిస్తూ...''ఏమిటి మీరనేది? గర్ల్‌ఫ్రెండ్స్ ఏమిటి? గడపడమేమిటి?''

అలా అమాయకంగా అడుగుతూంటే ధనుంజయరావులో కోపం ఇంకా పెల్లుబుకుతోంది.

''అబద్ధాలు కూడానా? నిజంచెప్పు! కాలేజ




కి వెళుతున్నావా? ప్రతి క్లాసుకి అటెండ్ అవుతున్నావా? ''

పొగరుగా సమాధానం చెప్పాడు. ''ఎందుకు అంత అనుమానం నామీద? ''

మరుక్షణం చెందూ చెయ్యి దొరకపుచ్చుకుని, విసురుగా లాగి, చెంపలు పగిలిపోయేట్లు కొట్టాడు ధనుంజయరావు.

ఈ హఠాత్పరిణామం ఎవ్వరూ ఊహించలేదు.

కళ్ళప్పగించి చూస్తుండిపోయింది శాంతి.

వాతావరణం భయంకరమయిన నిశ్శబ్దంతో నిండిపోయింది.

కందిపోయిన బుగ్గలను చేత్తోపట్టుకుని దిమ్మెరపోయినట్లుగా కళ్లప్పగించి చూస్తుండిపోయాడు చెందూ.

మరుక్షణం...

గబగబా పరుగులాంటి నడకతో తనగది వైపు నడిచి తలుపుతోసి ధబేలున వేశాడు. ఆ తలుపు ఎంత విసురుగా వేసాడంటే ఆశబ్దం కాసేపటివరకూ ఆహాల్లో ప్రతిధ్వనిస్తునే వుంది.

ధనుంజయరావుకి ఇంకా తృప్తితీరనట్లుగానే ఉంది. కసిగా ఉంది. కసిదీరా చావకొట్టాలనిపిస్తోంది. వెధవ! రాస్కెల్! చెయ్యిదాటిపోతున్నాడు! అసహనంగా చేతులు నలుపుకుంటూ సోఫాలో కూలబడి కణతలు వత్తుకోసాగాడు.

శాంతి భర్తవైపు చూసింది. పలకరించబుద్ధి కాలేదు.

హుషారుగా, ఉత్సాహంగా లోపలికి వచ్చిన చెందూ...

కందిపోయిన బుగ్గలతో...వెర్రివాడిలా చూస్తు నిలబడ్డ చెందూ...ముఖమే గుర్తు వస్తోంది. చెందూ గదిదగ్గరకు వెళ్ళి తలుపుతడుతూ...''చెందూ...'' ప్రేమ నిండిన స్వరంతో పిలిచింది.

లోపల నుండి సమాధానం రాలేదు.

సన్నగా వెక్కిళ్ళు విన్పిస్తున్నాయి.

''బాబూ చెందూ!'' మళ్ళీ పిలిచింది. సమాధానంలేదు.

అయిదు నిముషాల వరకూ అలా తలుపు తడుతూనే వుంది. పిలుస్తూనే వుంది. కాసేపటికి వెళ్ళిపోయింది.

డైనింగ్ టేబుల్ మీద అన్నీ సర్ది మౌనంగా వచ్చి కూర్చుంది. భర్తని పిలవలేదు.

మనసులో కసిగా ఉంది.

ధనుంజయరావు వచ్చి కూర్చున్నాడు. డైనింగ్ టేబుల్‌మీద అన్నీ సర్ది ఉన్నాయి. తను వచ్చి కూర్చోవడం చూసి కూడా శాంతి లేచిరాలేదు.

పౌరుషం వచ్చింది.

కూర్చోనీ! పెట్టకపోతే మాననీ! ఏం? తనకి చేతులులేవా? పెట్టుకు తినలేడా?

గబగబా పళ్ళెంపెట్టుకుని వడ్డించుకోసాగాడు.

శాంతికి ఒళ్ళు మండిపోతోంది. అసహ్యంగా వుంది.

ఛీ! ఏం మనిషి! అవతల కన్నకొడుకుని చావబాది, కొడుకు అన్నంతినకపోయినా, తన మానాన తాను శుభ్రంగా పెట్టుకు తింటున్నాడు. అంత కోపమే? అంత పట్టుదలేమిటి మనిషికి? ఏదో చేసాడని...వయసొస్తున్న పిల్లాడిని పట్టుకుని అంతగా కొట్టాలా? వయసొచ్చింది. ఎందుకు?

భోజనం గబగబా పూర్తిచేసి చేతులు కడుక్కుని, విజయ గర్వంతో శాంతి వైపుచూసాడు.

శాంతి ముఖం చిట్లించి చప్పున తల తిప్పుకుంది.

ధనుంజయరావు తన బెడ్‌రూమ్‌లోకి వెళ్లిపోయాడు.

శాంతి మళ్ళీ చెందూ గది దగ్గరకి వచ్చి పిలిచింది. సమాధానంలేదు. నిశ్శబ్దం!

చిన్నగా నిట్టూర్చి, టేబుల్‌మీద గిన్నెలన్నింటిమీద మూతలు పెట్టి సర్దేసింది. అన్నం తినబుద్ధికాలేదు.

మౌనంగా వెళ్ళి పడుకుంది. భర్తకు దూరంగా...

ధనుంజయరావు పలకరించలేదు. శాంతి రావడంచూసి అటు తిరిగి పడుకున్నాడు.

శాంతి ఏమిటి? ఎందుకు? అని కారణాలు

అడగలేదు. అసలు పెదవి విప్పలేదు. నిర్వికారంగా పక్కకు వత్తిగిలి పడుకుంది.

కాసేపటికే భర్త గురక వినిపించసాగింది.

చాలా సేపు ఆలోచనలలో గడిపింది. ఎపుడో మధ్య రాత్రి నిద్రపట్టింది.

చాలా సేపటికి ఉలిక్కిపడి కళ్లు తెరిచింది శాంతి...

చీకటి!

గోడ గడియారం రెండు గంటలు కొట్టింది. తలతిప్పి చూసింది. భర్త అటు తిరిగే పడుకుని ఉన్నాడు. చప్పున చెందూ గుర్తుకు వచ్చాడు.

ఏంచేస్తున్నాడో?

నిశ్శబ్దంగాలేచి, చప్పుడు కాకుండా గదితలుపులు తెరిచి హాల్లోకి వచ్చింది.

ధనుంజయరావు బెడ్‌రూమ్‌కి ఎదురుగా ఉన్నదే చెందూ రూమ్. శబ్దం చేయకుండా నడిచి వెళ్ళి చెందూగది దగ్గర నిలబడి, ఎందుకో అనుమానం వచ్చి తలుపునెట్టింది.

దగ్గరకువేసివున్న తలుపు చిన్నగా శబ్దంచేస్తూ తెరుచుకుంది.

గుండె గుబగుబలాడసాగింది.

చెందూ బెడ్‌వైపు చూస్తూనే స్థాణువైపోయింది. గుండె కొట్టుకోవడం మానేసింది.

బెడ్ ఖాళీగావుంది.

చెందూ ఏమయినట్లు? ఎక్కడికి వెళ్లాడు?

"చెందూ! చెందూ!" వణికే స్వరంతో పిలిచింది. సమాధానం రాలేదు. ఆ పిలుపే ప్రతిధ్వనించింది ఆ గదిలో.

అప్పటికే గొంతులో నుండి ఏడుపు అలలకు మల్లే తన్నుకువస్తోంది. కాళ్లలోనుండి వణుకు ప్రారంభమయింది.

తడబడే అడుగులతో బాత్‌రూమ్ వైపు వెళ్లిచూసింది. బాత్‌రూములోనూ లేడు.

వెళ్లిపోయాడు... ఇంట్లోనుంచి వెళ్లిపోయాడు.

మరుక్షణం...

పిచ్చిదానిలా తన బెడ్‌రూమ్‌లోకి పరిగెత్తి

'ఏమండీ లేవండీ!" అంటూ భర్తని కుదపసాగింది.

"అబ్బ! ఏమిటే గొడవ!" నిద్రకళ్లతో ఒళ్లు విరుచుకుంటూ లేచిన ధనుంజయరావు భార్యస్వరూపం చూసి ఉలిక్కిపడ్డాడు.

హిస్టీరియా వచ్చినదానిలా ఏడుస్తోంది శాంతి. "చెందూ ఇంట్లోనుంచి వెళ్లిపోయాడండి"

హఠాత్తుగా ఏడుపు ఆపి అదోవిధమయిన గొంతుతో అంది.

"మీరే వాడిని వెళ్లగొట్టారు! మీవల్లనే వెళ్లిపోయాడు. సంతోషించండి. హాయిగా అనుభవించండి.

మీ కళ్లు చల్లబడ్డాయా?" మళ్లీ ఏడుపు మొదలెడుతూ అంది.

ధనుంజయరావు వెర్రివాడిలా చూస్తుండిపోయాడు.

చప్పున కదిలి హాల్లోకి పరుగులాంటి నడకతో వచ్చి చెందూ గదివైపు చూశాడు.

తలుపులు బార్లా తెరిచివున్నాయి.

బెడ్‌మీద దుప్పటి చెదిరిపోయి వుంది. దిండు ఒకమూలకి వుంది.

శాంతి ఏడుపు వింటుంటే మనసు అధైర్యపడసాగింది.

చెందూ వెళ్లిపోయాడా? నమ్మబుద్ధికావడంలేదు.

ఏంచేయాలో తోచడంలేదు.

ఓ అయిదు నిముషాలకి...

సుబ్రమణ్యం ముందు చేతులు నలుపుకుంటూ, వడిలిపోయిన ముఖంతో, నిస్సహాయంగా నించుని వున్నాడు ధనుంజయరావు..

సుబ్రమణ్యం అంటున్నాడు— "నేను ఎనాడో ఊహించాను ఈ పరిస్థితి. ధనుంజయా! నిన్నుఎప్పటికప్పుడు హెచ్చరిస్తూనే ఉన్నాను. ఇపుడు తెలిసి వచ్చిందా? చేతులు కాలాక ఆకులు పట్టుకుని ఏంలాభం? రోజులు మారిపోయాయయ్యా? ఇదివరకులా అనుకున్నావా? తిట్టినా, కొట్టినా పడివుండటానికి. ఈరోజుల్లో కుర్రాళ్లే వేరయ్యా. సరే... ఇంతకీ ఏం చేద్దామనుకుంటున్నావు. పోలీసు రిపోరు




ఇద్దామా?''

ధనుంజయరావు మాట్లాడలేదు.

మౌనంగా పెదవి కొరుక్కుంటూ నిలబడిపోయాడు.

మనసులో ఏమూలో భయం రెపరెపలాడుతోంది. ఏ అఘాయిత్యం చేయలేదుకదా అని.

తెల్లవారుఝాము అయిదింటివరకూ ఆ ఎంబాసిడర్ విశాఖపట్టణం వీధుల్లో, సందుల్లో తిరుగుతూనే వుంది.

బాక్ సీట్‌లో సుబ్రమణ్యం కూర్చుని ఉన్నాడు.

డ్రెయివ్ చేస్తున్న ధనుంజయరావు దృష్టి హఠాత్తుగా అటువైపు పడింది.

ఆ పార్కులో....

మంచుతెరల మధ్య... సిమెంట్ బెంచి మీద గజగజా వణికిపోతూ, ముడుచుకుని పోయి పడుకున్నది ఎవరు? ఎవరూ?

ఇద్దరూ దిగి వెళ్ళారు. చల్లటిగాలి రివ్వున కొడుతోంది.

సిమెంట్ బెంచిమీద గజగజా వణికిపోతూ ముడుచుకు పోతున్నాడు చెందూ!

సన్నగా మూలుగుతున్నాడు.

''చెందూ...'' అంటూ చెందూ శరీరం మీద చెయ్యి వేసిన ధనుంజయరావు షాక్‌తిన్నవాడిలా చెయ్యితీసాడు.

చెందూ శరీరం సలసలా కాలిపోతోంది.

రెండు రోజులవరకు మూసిన కన్ను తెరవలేదు చందూ.

శాంతి ఇరవైనాలుగు గంటలూ చెందూ పక్కనే కూర్చుని సేవలు చేయసాగింది.

ధనుంజయరావు అంతగా మాట్లాడటంలేదు. హఠాత్తుగా మౌనవ్రతం పాటించసాగాడు.

మూడోరోజుకి జ్వరం తగ్గుముఖం పట్టింది. శాంతి ఆందోళన కాస్త తగ్గింది. చెందూ ఆవేశం తెలుసుకాబట్టి, ఆకోపంలో ఏ అఘాయిత్యం చేస్తాడోనని చాలా భయపడింది. ఆరోజు ఉదయం కార్లో చెందూని తీసుకు వచ్చేవరకూ పిచ్చిదానిలా అలా ఏడుస్తూనే పడివుంది.

ధనుంజయరావు చందూ రూమ్‌లోకి వచ్చాడు ఎలావుందో కనుక్కుందామని. చెందూ చప్పున తల తిప్పుకున్నాడు. ధనుంజయరావు ఇక ఒక్కక్షణం అక్కడ ఉండలేదు. హాల్లోకి వచ్చేశాడు. శాంతి మౌనంగా ఉండిపోయింది.

ఈలోపల రెండుసార్లు కాంతి వచ్చివెళ్ళింది. సుబ్రమణ్యం కూడా తరచూ వచ్చి వెళుతున్నాడు. సుబ్రమణ్యాన్ని చూస్తే శాంతికి కొండంత ధైర్యం.

చెందూ వారంరోజుల్లో బాగానే కోలుకున్నాడు. లేచి తిరుగుతున్నాడు. పుస్తకాలు తీసి చదువు మొదలెట్టాడు. శాంతికి కాస్త ధైర్యం వచ్చింది. మామూలుగానే తమ రూమ్‌లో పడుకోసాగింది.

కాలం నిశ్శబ్దంగా గడిచిపోతోంది. రెండురోజుల అనంతరం....

రాత్రివేళ....

భోజనాలు అయినాయి. ధనుంజయరావు భోజనం చేసి బెడ్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు. చెందూ ముందరే తిని, గదిలో చదువుకుంటూ కూర్చున్నాడు.

శాంతి అంతా సర్దసాగింది. ఆయా ఉన్నంతకాలం అసలు పనే ఉండేదికాదు. కాని ఆయాకు జరిగిన ఆ 'అనుభవం' బాగా గుర్తు అందుకనే ఇంక ఎవ్వరినీ రానీయలేదు శాంతి. వంటపని అంతా స్వయంగా తనే చూసుకోసాగింది.

ఇల్లంతా సర్ది, బెడ్‌రూమ్‌లోకి వెళ్ళింది. ధనుంజయరావు బెడ్‌మీదలేడు. బహుశామేడమీద పచార్లు చేస్తూ ఉండివుండవచ్చునను కొంది.

బెడ్ చివరకూర్చుని చేతికందిన వీక్లీ లాగింది పక్క బీరువాలో నుండి.

స్త్రీల పత్రిక అది!

తీరికగా పేజీలు తిప్పసాగింది.

రెండు పేజీలు కుట్లు అల్లికలు, ఓ రెండు పేజీలు వంటలు, వరలక్ష్మీ వ్రతవిధానం. ఓ నాలుగు పేజీలు భర్తని కొంగుకి ముడివేసుకోవడమెలా? ఆఖరున ఆరుపేజీలు మాత్రం 'మగవాళ్ళపై విమర్శలు- విరుచుకుపడటాలకు




కేటాయించారు.

వినుగుపుట్టింది.

ఏ పత్రిక చూసినా ఏమున్నది గర్వకారణం?

ప్రతిపేజీ సమస్తం వంటింటి ప్రేమ సాహిత్యం!

అలికిడికి తలెత్తబోయింది.

అప్పటికే ధనుంజయరావు చేతులు ఆమె భుజం మీద పడ్డాయి. దగ్గరకు తీసుకోబోయాడు.

"ఛీ! వదలండి!" చేతులు తీస్తూ అంది.

"ప్లీజ్...." మత్తుగా అన్నాడు.

"ఏమిటండీ మీరు? అవతల చెందూ చదువుకుంటున్నాడు"

"ఫర్లేదు... వాడిరూమ్‌లోనేగా... తలుపు దగ్గరికివేసి ఉందిలే..."

అపుడు చూసింది. తలుపు ఓరగా తెరుచుకుని ఉంది. చప్పున లేవబోయింది. కాని ధనుంజయరావు చేతులు ఆమె భుజాల్ని అదిమిపెట్టాయి.

ముఖం చిట్లిస్తూ అంది— "ఛీఛీ! వయసొచ్చినా బుద్ధిపోలేదు. అయినా ఈడొచ్చిన పిల్లాడు ఇంట్లో ఉండగా..."

నవ్వాడు "అంటావేకాని, నీ మనసు నాకు తెలియదా శాంతీ? ఏం వయసొచ్చిందని మనకి? నిజం చెప్పాలంటే... అప్పటి కంటే కూడ అందంగా ఉన్నావు తెలుసా.... ముఖ్యంగా..."

చిరుకోపంతో అంది— "సంతోషించాం కానీ లేవండి. వెళ్ళి తలుపు వేసివస్తాను. అన్నట్లు... చెందూ టీ పెట్టమన్నాడు. చదువుకుంటాడట. ఫ్లాస్క్‌లో పోసి ఉంచాను. డైనింగ్ టేబుల్ మీదనే ఉంది అది. వాడి రూమ్‌లో పెట్టి వస్తాను." లేచింది.

"అబ్బా! వాడి మొహం చదువు. నాకేం నమ్మకంలేదు. సరే నాకెందుకులే... ఇచ్చిరా! మళ్ళీ ఏదయినా అయితే నన్నే అంటారు. ఒక్క నిముషంలో రావాలి!" సగం నిష్టూరంగా అన్నాడు.

నవ్వింది "రాకపోతే?...?"

"నేనే వస్తాను... వచ్చి..."

"మీ వయసెంతండి?"

"ఇపుడు నా వయసెందుకు? ఏం నా మీద నమ్మకం లేదా?" చిలిపిగా అన్నాడు.

"సిగ్గులేక పోతేసరి! అందుకు కాదు. మీరే ఇక్కడికి వస్తానంటున్నారు. కానీ నేను వెళుతాది- దాదాపు మీ వయసులో సగం ఉన్న మీ కొడుకు దగ్గరికి!"

ది బయటకు వచ్చి చూస్తూనే నిశ్చేష్టురాలయింది.

హాల్లో చెందూ!

శాంతి రావడంతో, చప్పున కదిలి, కంగారుగా తనగదివైపు అడుగులు వేయబోయాడు.

"చెందూ!"

వెనక్కితిరిగాడు.

"నువ్వు.. ఇక్కడ ఏం చేస్తున్నావు?"

తడబడుతూ అన్నాడు. "అహ... మంచినీళ్ళ కోసమని... కిచెన్‌లోకి వెళ్ళి వస్తూ..."

"అయితే... మా మాటలు..."

ఆమె మాటలు చెందూ మీద ప్రభావం చూపించాయి. అతనిలో తడబాటుపోయి, ఒక విధమయిన ఎగతాళి తనం వచ్చింది.

ఆమె మాటలు పూర్తి చేస్తూ తాపీగా "...విన్నాను!" అన్నాడు.

హఠాత్తుగా శాంతికి సిగ్గు అనిపించింది. ఏం మాట్లాడాలో తోచలేదు.

"చెందూ...చదువుతున్నావా?...అంటే... బాగా చదువుతున్నావా?... అదే... టీ... ఫ్లాస్క్‌లో..." నవ్వాడు తల్లి అవస్థ చూసి! ఆ నవ్వులో హేళన ఉంది. ఎగతాళి ఉంది.

"మమ్మీ ఎందుకు అంత కంగారు? ఎందుకు అలా మాట మారుస్తావు? మీరు నాకు తల్లితండ్రులే అయినా... భార్యాభర్తలు... దయచేసి తలుపు వేసుకోండి..."

శాంతికి కన్నీళ్ళు వచ్చాయి ఆ మాటలకి. సిగ్గుతో ముఖం ఎర్రబడిపోయింది.

"అహ్... అదికాదు..." కంగారుగా ఏదో అనబోయింది.

"మమ్మీ! ఎందుకు కన్నీళ్ళు? ఏదయినా తప్పుగా అంటే సారీ! అన్నట్లు నాకేం అవసరంలేదు. ఫ్లాస్క్ నేను తీసుకుంటాను. నువ్వే



ళ్ళు!"

మాటలు రానట్లుగా ఉండిపోయింది శాంతి. పవిట జారిన సంగతి కూడ గమనించ లేదు. చెందూ ఒక్కక్షణం తల్లి గుండెలకేసి చూసి, తలవంచుకుని అన్నాడు.

"మమ్మీ కాస్త ఆ పవిటసర్దుకో!"

పిడుగులు పడినట్లు చూసింది శాంతి

"చెందూ...నువ్వు... నువ్వేనా మాట్లాడు తోంది. ఇంతవచ్చిగా తల్లిని... నిజంగా..ను వ్వేనా?"

వెర్రిదానిలా అంది.

నవ్వాడు నిర్లిప్తంగా.

"ఏమిటమ్మా! ఏమంటున్నాను? పచ్చినిజా లు చెబుతున్నాను. డాడీ ఎదురు చూస్తున్నట్లు న్నారు. వెళ్లమ్మా... వెళ్లు. గుడ్‌నైట్ ప్లీజ్!" వెనుతిరిగి చూడకుండా గబగబా అడుగులు వేసుకుంటూ వెళ్లి గదితలుపు వేసకున్నాడు.

బొమ్మలా అలాగే నిలబడిపోయింది శాంతి.

కాసేపటికి కదిలి, నీరసంగా తన గదిలోకి వెళ్లి గడియవేసింది.

మౌనంగా తలొంచుకుని శెడ్ అంచున కూర్చుంది.

ధనుంజయరావు విసుక్కుంటూ అన్నాడు. "ఏమిటి ఆలస్యం? ఏమిటది? వాడేదో వాగుతు న్నట్లున్నాడు చదువు మానేసి..." భుజంమీద చెయ్యి వేయబోయాడు.

శాంతి తీవ్రంగా అంది— "వద్దు... చెయ్యి వేయవద్దు!"

ఆశ్చర్యపోయాడు ధనుంజయరావు "అరె! ఏమిటి ఇంతలోనే అంతకోపం! ఏమ యింది?"

ఉక్రోషంగా కళ్లల్లో నీళ్లు తిరుగుతూవుండ గా అంది "మీకు... మీకు సిగ్గులేదు. ఛీ!"

"శాంతీ! ఏమిటి? ఏమయింది?"

"ఏమిటా? మన ప్రేమకబుర్లు, సరసనల్లా పాలు అన్నీ చెందూ చూస్తూనే వున్నాడు"

ఉలిక్కిపడ్డట్లయి "వాడా? ఆ వెధవ ఇక్క డేం చేస్తున్నాడు?" అన్నాడు.

"మంచినీళ్ల కోసమని కిచెన్‌లోకి వెళ్లి..."

"తలుపు దగ్గరికి వేసివుందిగా!"

"తలుపు దగ్గరికే వేసివుంది. కాని... కాని... వాడి మాటలు వింటుంటే తలబద్దలు కొట్టుకు చావాలనిపిస్తోంది. అయినా... మన ప్రవర్తన ఈడొచ్చిన పిల్లాడిముందు- మార్చుకోకపో వడం మనదీ తప్పు!"

"ఆ! వాడిమొహం!" నిర్లక్ష్యంగా అన్నాడు.

"నిజంగా మీకు తెలియకనే అంటున్నారా? వాడు ఇపుడు ఎలాంటి వయసులో వున్నాడో తెలుసా? అతి ప్రమాదకరమయిన వయసు! ఏమాత్రం గాడితప్పినా..."

"సర్లే! వాడా! అన్ని గుండెలే! నాకు తెలి యకుండానే ఏంచేస్తాడు? అపుడేదో గర్ల్ ఫ్రెండ్స్ అంటూ తిరిగాడుగా! చూశావా? నేని చ్చిన డోస్‌కి గది కదిలి బయటికి వెళుతున్నా డేమో!

అయినా నా సంగతి వాడికి తెలియదూ! డొక్క చింపేయనూ!"

శాంతి ఒక్కక్షణం భర్త కళ్లలోకి చూసింది. "ఏమండీ! అదే... అదే మీరు చేస్తున్న తప్పు. మీ కళ్లకి వాడింకా చిన్నపిల్లాడిలానే కనిపిస్తు న్నట్లున్నాడు. కానీ కాదండీ. వాడు ఇపుడు వయసొచ్చిన ఒక యువకుడు. వాడి మన సులో కూడా ఏవో కోరికలు, అర్థం పర్థంలేని ఆలోచనలు వుంటాయి. మీరు అర్థం చేసుకోవ డంలేదు. ఏదో క్రమశిక్షణ పేరుతో వాడిని కంట్రోల్ చెయ్యాలని చూస్తున్నారు. కాని వాడు... వాడు ఏంచేస్తున్నాడో తెలుసా!"

కనుబొమలు చిట్లించి అడిగాడు- "ఏం చేస్తున్నాడు?"

"చెప్పాలంటే సిగ్గుగా... ఏమిటోగా వుంది. వారంరోజుల క్రితం..."

"ఊ! వారంరోజుల క్రితం?"

"వాడిరూమ్ సర్దుదామని వెళ్లాను. కాని... వాడి క్లాసుపుస్తకాల మధ్యన ఏమున్నాయో తెలుసా? సెక్స్ పుస్తకాలు... ఫొటోలు"

భార్యవైపు వెర్రివాడిలా చూశాడు ధనుంజ యరావు. కోపంగా అన్నాడు. "ఇంతవరకూ వచ్చిందన్నమాట వ్యవహారం. అయినా నీకు బుద్ధిలేదు. అప్పుడే నాకెందుకు చెప్పలేదు?"

వ్యంగ్యంగా అంది- "చెబుతాను! చెబితే ఏంచేస్తారు? వాడిని పిలిచి చావగొడతారు. అంతేగా? అయిందిగా ఒకసారి అనుభవం!"

"సర్లే! లేకపోతే చూస్తూ ఊర్కొంటామా? తోలువలిచేయనూ"

నచ్చచెప్పే ధోరణిలో అంది. "అదే వద్దని చెబుతున్నాను. వాడు చిన్నపిల్లాడు కాదండీ, తిట్టి, కొట్టి చెప్పడానికి, యువకుడు. మీరు కొడితే మళ్లీ తిరగబడి కొట్టేవయసు! మీరు 'తండ్రి' అన్న విషయం ఒక్కక్షణం మర్చిపొండి. స్నేహితునిలా చెప్పండి. నెమ్మదిగా నచ్చచెప్పండి"

"వాడికా? ఆ వెధవకా? ఆ మొండివెధవకా! వినే రకమేనా?"



"అవును. ఆ మొండివెధవకే! గుర్తు తెచ్చుకోండి. వాడిని మొండివెధవలా మార్చింది మీరుకాదూ? సున్నితంగా చెప్పాల్సిందిపోయి, బెల్టు పెట్టి బూటుకాళ్లతో డిసిప్లిన్ పేరుతో చావగొడ్తుంటే మొండివాడుగాకాక మంచివాడుగా, మెత్తగా మారతాడా?"

ధనుంజయరావుకి ఆ మాటలతో సర్రున కోపం ముంచుకొచ్చింది.

"అను... నువ్వూ అను! నాకు మాత్రం లేదా వాడిమీద ప్రేమ. వాడిని ఒకదారిలోకి తేవాలని, మంచి భవిష్యత్ కల్పించాలనేకదా నా తాపత్రయం"

"కాని... ఇదా మార్గం?"

"మరి? ముద్దులు పెట్టుకుంటూ నెత్తికెక్కించుకుని పాఠాలు చెప్పించుకోవాలా?"

"లేకపోతే ఏమిటండీ. నేనంటున్నానని అనుకోకండి. తల్లిదండ్రులం- ఒక వయస్సు వచ్చాక మనమూ కొంతవరకు కోర్కెలను కంట్రోల్ చేసుకోవాలి. కాస్త పద్ధతి మార్చుకోవాలి. కోపం తగ్గించుకోవాలి. వాడిని కొట్టి, మళ్లీ వాడి మొహం చూడాలంటే సిగ్గుగా వుండదూ? అలాగే... వయసొస్తున్న పిల్లలముందు మనం సరసాలాడుకుంటూ కూర్చుంటే సిగ్గుగా, అసహ్యంగా అన్పించదూ? చిన్న పిల్లలు వాళ్ళకేం తెలునులే— అని కొట్టిపారేస్తాము. కాని ఆ సంఘటనలే, అపుడపుడే వికసిస్తున్న వాళ్ళ మనసుల్ని వయసుల్ని ఎలా బెదిసికొడతాయో, వాళ్ళ హృదయాల్లో ఎలాంటి ముద్రలు పడతాయో మీరు ఊహించడంలేదు!"

భార్య అలా బెడ్‌రూమ్‌లో కూర్చుని నీతులు చెబుతుంటే ఒళ్ళుమండింది. సర్దిచెప్పుకోడానికన్నట్లుగా అన్నాడు. "అయినా ఇపుడు మనం ఏం తప్పుచేస్తున్నామని?"

"ఇది ఫారిన్ కాదండి పిల్లల ముందు తల్లితండ్రులు, తల్లితండ్రులముందు పిల్లలు సరసాలాడుకోడానికీ... ముద్దులు పెట్టుకోడానికీను. ఏ వయసులో చేసే పనులు ఆ వయసులో చేస్తేనే అందమూ, ఆరోగ్యమూ"

ఎగసిన ఆవేశం ఒక్కసారిగా పాల పొంగులా చల్లారిపోయేసరికి కోపం వచ్చింది ధనంజయరావుకి. కసిగా అన్నాడు— "నీకు... వెర్రెక్కింది"

శాంతికూడ కోపంగానే అంది. "నిజమే.... వెర్రేఎక్కింది. కొన్నాళ్ళు పోతే పిచ్చికూడ పట్టేటట్లు ఉంది!"

గింజుకుంటున్నట్లుగా అడిగాడు. "అయినా... ఆ వెధవకి ఆ వెధవ పుస్తకాలు ఎక్కడివి? చెడు స్నేహాలు... చెడు తిరుగుళ్ళు- వీడూను!"

హేళనగా నవ్వి అంది— "ఆ పుస్తకాలు ఎక్కడివోకాదు. చాటుగా మీరు కొనుక్కొచ్చి మన మంచం కింద దాచారే, సాక్షాత్తూ అవే".

ధనుంజయరావు ముఖం హఠాత్తుగా ఎర్రబడి, దవడ ఎముక బిగిసింది. ముఖం చిట్లించి అన్నాడు. "అవా? వాడికి... అసలు వాడు మన రూమ్‌లోకి ఎందుకువచ్చాడు?"

పకపకానవ్వింది శాంతి. పడీపడీ నవ్వింది. మంచంమీదకి జారిగిలపడి మరీ నవ్వింది ఆ ప్రశ్నకి!

ఉక్రోషంగా అన్నాడు— "ఎందుకంత నవ్వు?"

"మరి!" మళ్ళీ నవ్వసాగింది. హఠాత్తుగా గంభీరంగా అయి అన్నది. "మన రూమ్, వాడిరూము ఏమిటండీ ఒకే ఇంట్లో ఉంటూ! వాడి రూమ్‌లోకి మనం వెళ్లడంలా ఫ్రీగా... అపుడపుడు చెక్ చేయడానికని... వాడు లేని సమయాలలో...."

"నిజమే అలాగని... మనకి తెలియకుండా- ఇలా మనబెడ్‌రూమ్‌లోకి... మనకీ ఎన్నో రహస్యాలు..." బెడ్‌రూమ్ అన్న పదాన్ని వత్తిపలుకుతూ అర్థోక్తిలో ఆపేసాడు.

"మనమేమీ కొత్త దంపతులము కాదు! శోభనం దంపతులం అంతకంటే కాదు! అయినా మన రూమ్ ఏమిటండీ? పిల్లల్ని ఫ్రీగా లోపలికి రానివ్వాలి. అంతే కాని, మన ము- మన రూము అంటూ వాళ్ళముందే తలుపేసుకుని సరసాలాడుకుంటూ కూర్చుంటే వాళ్ళకి మనమంటే అసలు గౌరవం ఉంటుందా? తల్లితండ్రుల్లా చూస్తారా మనల్ని? పరాయివాళ్ళలా ప్రవర్తించరూ? రహస్యాలు ఏమిటండీ రహస్యాలు! మీరు




ఏవయితే రహస్యంగా ఉంచాలనుకుంటారో అవే వాళ్ళకళ్ళబడతాయి. ఏవయితే గుట్టుగా ఉంచాలనుకుంటారో అవే వాళ్ళ మనసులో కుతూహలం రేపుతాయి. అందుకే వాళ్ళ ముందు రహస్యంగా, గుట్టుగా ప్రవర్తించకూడదు. అసలు వాళ్ళల్లో ఆ ఫీలింగ్ రానీయకూడదు."

శాంతి మాటల్ని మధ్యలోనే త్రుంచేస్తూ వెటకారంగా అన్నాడు.

"ఉపన్యాసాలకేం తక్కువలేదు. ఇంతకీ ఆ పుస్తకాలు ఏంచేశావు? చింపేశావా? వాడికళ్ళ ముందే తగలబెట్టావా?"

ముక్తసరిగా చెప్పింది- "లేదు".

"ఏం? ఎందుకని? ఇన్ని కబుర్లు, ఇన్ని ఉపన్యాసాలు చెప్పి?"

"నిజంగా మీకు ఆలోచనలేదు."

విసుక్కున్నాడు "సర్లే!"

ఇంతక్రితం అయితే కోపగించుకునేవాడు. అతిగా ప్రవర్తించేవాడు. కాని త్వరలోనే తెలుసుకున్నాడు శాంతి ముందు తను త్వరగా తేలిపోతానని. అందుకనే తేలిగ్గా మాటమార్చేయడానికి ప్రయత్నించడమో, విసుగు ప్రతిధ్వనించడమో చేస్తాడు.

కాని శాంతి ఊర్కోదు! ఊర్కోలేదు కూడా.

"లేకపోతే ఏమిటండి. అపని చేస్తే వాడు ఊర్కుంటాడా? మనల్ని తప్పుపట్టడూ? అసలు తన తప్పు ఒప్పుకుంటాడా? అపుస్తకాలు తెచ్చింది మీరు. వాడి ముందు సరసాలు సాగించింది మనము. అది వాడి తప్పా? మన తప్పా? వాడిని అనే ముందు మనవైపు నుండి కూడా తప్పు లేకుండా చూసుకోవాలి?"

ధనుంజయరావుకి మాట మార్చక తప్పలేదు. దానికి తోడు శాంతి నిందలన్నీ తన మీదే వేస్తోంది. అందుకే కోపంగా అన్నాడు. "ఏడీవాడు! ఏం చేస్తున్నాడు? నీకు నోరు లేకపోతే నేను చెబుతాను పిలువు వెధవని!"

సన్నగా వారించింది. "ఆగండి. దేనికయినా ఒక సమయం సందర్భం ఉండాలి. చెప్పండి, కాని ఇపుడుకాదు. దానికీ ఒక ఉల్లాసకరమయిన వాతావరణం, ప్రశాంతకరమయిన పరిస్థితులూ అవసరం. ఈ అర్థరాత్రి వేళ ఇపుడు కాదు. అసలే ఇందాక జరిగిన సంఘటనతో వాడి మనసు గంద్రగోళంగా ఉండి వుంటుంది"

"మరి ఇంకెప్పుడు ఇవుడుకాక? అన్నీ అయ్యాకనా?"

"రేపు చెప్పండి. కొట్టికాదు... నచ్చచెబుతూ! తిట్టికాదు... ప్రేమగా చెబుతూ! వాడికి ఈ వయసులో సెక్స్ గురించి సదభిప్రాయం కలగాలి, సదవగాహనపెరగాలి, ఆరోగ్యకరమయిన ఆలోచనలు కలగాలి. ఇలా చెడు పుస్తకలు చదివి మనసు చెడగొట్టుకొనేలాకాదు"

శాంతి అసలు తనని నోరు ఎత్తనీయకుండా అలా ఏకధాటిగా చెప్పేస్తుంటే కసిగా ఉంది లోలోపల!

దాన్ని సంతృప్తి పరచాలి ఎలాగయినా.

"సర్లే సంతోషించాంకానీ, వచ్చి పడుకో!"

భగ్గున మండింది శాంతి. "ఛీ! మీరు మారరు!" అని బెడ్‌షీట్ బర్రున లాగి నేల మీద వేసుకుని పడుకుంది.

ధనుంజయరావు అదోలా నవ్వి దుప్పటి మీదకి లాగి ముసుగు పెట్టాడు.




మర్నాడు ఉదయం!

అలవాటు ప్రకారం ధనుంజయరావు సోఫాలో కూర్చుని ఒకచేత్తో కాఫీకప్పు పట్టుకుని సిప్‌చేస్తూ మరోచేత్తో పేపరు పట్టుకొని చదువుతున్నాడు.

పక్కనే అలికిడి అయింది.

పేపరు నుండి దృష్టి మరల్చాడు!

చందూ!

చారల పైజమా, అదేరకం లాల్చీ! చిందర వందరగా ముఖంమీదికి పడుతున్నజుట్టు! నిర్లక్ష్యంగా ఉన్న చూపులు! తెచ్చిపెట్టుకున్న గంభీరత్వం!

ధనుంజయరావుకి ఎందుకో నవ్వు వచ్చింది. సన్నగా మనసులోనే నవ్వుకున్నాడు.

చందూ అన్నాడు— "ఎందుకు? పిలిచారట?"

పొద్దున్నే డైనింగ్‌రూమ్‌లో తల్లిచెప్పింది— డాడీకి కన్పించివెళ్ళమని!

"రా! కూర్చో! పనేమీలేదు! నీతో మాట్లాడదామని!"

"ఫర్లేదు... చెప్పండి!" ఇంకాస్త దూరం జరిగి అన్నాడు చెందూ!

ధనుంజయరావు ఓరగా చూసాడు కొడుకు వైపు!

చెందూ కూడా అలాగే కనుకొలకుల్లోంచి చూస్తున్నాడు తండ్రివైపు!

ఏం అడగబోతున్నాడు? అసలు పొద్దున్నే ఎందుకు పిలిచినట్లు?

ధనుంజయరావు చిన్నగా దగ్గి నిట్టూర్చాడు "ఊ! బాగా చదువుతున్నావా?"

చెందూకి ఏది అడిగినా ఫరవాలేదు కాని, తన చదువు గురించి అడిగితేనే ఒక్కసారిగా ఒళ్ళుమండుతుంది. కోపం, ఆవేశం వచ్చేస్తాయి. తన చదువుగురించి ఎవరైనా అడిగితే, తనని ఏదో అవహేళన, అవమానం చేస్తున్న ఫీలింగ్!

అయినా చందూ కోపాన్ని బలవంతంగా దిగమింగి, కనుబొమలు ముడిచి అడిగాడు—

"ఎందుకంత అనుమానం?"

కొంచెం ఎగతాళిగానే అన్నాడు ధనుంజయరావు "అహా! పరీక్షలు దగ్గరికి వస్తున్నాయి కదా... అందుకని!"

చందూ ఒక్కక్షణం మౌనంగా ఉండి "ఆ!" అన్నాడు ముక్తసరిగా.

"రాత్రిళ్ళు ఎన్నింటివరకు చదువుతున్నావు?"

చందూలో అణగదొక్కుతున్న కోపం పెల్లుబుకసాగింది.

"నిద్ర వచ్చేవరకు!"

"అదే! ఎపుడు, ఎన్నింటికి నిద్రపోతున్నావు?"

విసురుగా జవాబు చెప్పాడు చెందూ "ఏమో! టైమ్ చూడటంలేదు."

చందూ చెప్పే సమాధానాలు చూస్తుంటే ధనుంజయరావుకి కూడా కోపం రాజుకోసాగింది.

"ఎందుకంత విసురు? ఏమిటంత కోపం? కానిమాటలు ఏం అడిగానని?"

"కోపమా! నాకెందుకు? అయినా పొద్దున్నే ఏమిటీ ఇంటరాగేషను?"

ధనుంజయరావుకి ఇక సహనం నశించి డైరెక్టుగా అడిగేశాడు.

"నువ్వు నిజంగాక్లాసు పుస్తకాలే చదువుతున్నావా?"

"డాడీ!" అదోలా అరిచాడు చెందూ. తండ్రి భావం మొదట్లో అర్థం కాలేదు. కాసేపటికి అర్థం అయింది.

"ఏమిటా అరుపు? ఇంత వయసొచ్చింది సిగ్గులేదూ! మరొకరు చెప్పాలా?"

అప్పటికే చెందూ ముఖం ఎర్రగా కందిపోయింది. రోషంగా అన్నాడు—

"అదే... అదేమాట నేనంటే?"

ధనుంజయరావు కళ్ళు ఎర్రబడ్డాయి. చేతిలోని పేపరు చుట్టగాచుట్టి విసురుగా నేలమీదికి విసురుతూ అన్నాడు "అనరా అను! ఏముంది. ఎన్నయినా అంటావు. నీనోటికి హద్దెక్కడవుంది? తల్లిదండ్రులమనే గౌరవం ఏకోశానయినా వుంటేకదా నీకు!

"హు! గౌరవం... అలా ప్రవర్తిస్తున్నారా మీరు!"

"అంటే? ఏమిట్రా నీవుద్దేశం?"

"దయచేసి నాచేత చెప్పించకండి!"

ధనుంజయరావు దిగ్గున సోఫాలోనుండి లేస్తూ అన్నాడు "ఏం? అంత కానిపనులు ఏంచేస్తున్నాను నేను? ఏంమాట్లాడుతున్నావో తెలుసా?"

# లైఫ్‌బాయ్ ఎక్కడో ఆరోగ్యం అక్కడ




**లైఫ్‌బాయ్**

**మురికిలోని క్రిములను వదలగొడుతుంది**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS L 98 1611 TL

చెందూ ఇంక సందేహించదలుచుకోలేదు. "మొన్న... అదే... ఆదివారం నైట్"

"ఊ! ఆదివారం నైట్..."

"డాడీ! నిజంగా మీరు చిదంబరంగారింటికి వెళ్ళారా?"

"చెందూ! ఏమిటి నువ్వంటున్నది? అంటే... నేను అబద్ధాలాడుతున్నాననా నీ వుద్దేశం?"

"ఎందుకు డాడీ బుకాయిస్తావు? ఆరాత్రి ఊర్వశి థియేటర్‌లో మిమ్మల్ని, మీతోపాటు వచ్చిన ఆ అమ్మాయిని..."

పద్దెమ్మిదేళ్ళ కొడుకు, తన ఎదుట నిలబడి, కళ్ళల్లోకి సూటిగా చూస్తూ ప్రశ్నిస్తుంటే సహించలేకపోయాడు ధనుంజయరావు. "షటప్... రాస్కెల్!"

"నిజం చెబితే ఉలుకెందుకు?"

"అప్పుడు నువ్వు అక్కడ ఎందుకున్నావు?"

"మీరు కాస్తతలతిప్పి చూసినా మీ వెనకసీట్లో నన్ను చూసి వుండేవారు. అయినా మీకంత తీరిక ఎక్కడిదిలే! ఆవిడ భుజంమీద..." చందూకి దొరికిపోయిన తండ్రిని చూస్తుంటే జాలిగా వుంది. ఏడ్పించాలని వుంది.

ధనుంజయరావు హుంకరించాడు "నోరు మూయ్ చెందూ! నువ్వు హద్దుమీరి ప్రవర్తిస్తున్నావు. అయినా అదేం నువ్వు చదువుకోవడానికి ఫ్రెండ్ ఇంటికి వెళతానని ఇదా చేసేది. సినిమాలకీ... షికార్లకీ..."

నవ్వొచ్చి అంటున్నాడు చందూ! "అనే అధికారం, ప్రశ్నించే అర్హత, అడిగే హక్కు మీరు ఆనాడే కోల్పోయారు. ఈ సంగతి మమ్మీకి తెలిస్తే?"

"చెందూ! నువ్వు... నువ్వు... యూ!"

తలఎగరేశాడు చెందూ. గింజుకుంటున్న తండ్రిని చూస్తుంటే ఏదో తెలియని ఆనందంగా ఉంది. "ఏంచేస్తారు? కొడతారు. కాని లోకం కళ్ళుమూయలేరుగా? నాపక్కన కూర్చున్న నా ఫ్రెండ్ ఆమె ఎవరని అడిగితే ఏమని చెప్పాలి?"

"ఫ్రెండా? అదా? [illegible]"

చెందూ పళ్ళునూరి అన్నాడు "బుద్ధిపోనిచ్చుకున్నారు కాదు. అది మీకనవసరం!"

"చందూ!"

"అంతేకాదు! అస్తమానం నాగదిలోకి నాకు తెలియకుండా వచ్చి, అదేదో గూఢచారిలాగా సోదా చేయవద్దు! ఇలాంటివి నాకు పరమఅసహ్యం!"

ధనుంజయరావు ఈసడించాడు "హు! నువ్వు! నీకోగది! నీకో వ్యక్తిత్వం!"

చెందూ ఊర్కోలేదు. "ఏం? మీరు! మీకో గది! మీకోపెళ్ళాం! మరో ప్రియురాలు!"

"చెందూ!" విసురుగా గాలిలోకి చెయ్యిఎత్తాడు.

చెందూ భయపడలేదు. ఒక్క అడుగు వెనక్కివేసి, కఠినంగా చూస్తూ అడిగాడు.

"మా శ్రీధర్ లెక్చరర్‌ని కలిశారటకదా?"

"అవును... ఏం?" కాస్త చల్లబడి అన్నాడు ధనుంజయరావు.

చెందూకి ఆవేశంతో ముక్కుపుటాలు అదరసాగాయి.

తాడో పేడో తేల్చుకోవాలని వుంది.

తీవ్రమయిన కంఠస్వరంతో అడిగాడు. "అదే... ఎందుకని అడుగుతున్నాను?"

"నా ఇష్టం! అయినా అతను నాకు పరిచయస్థుడు!"

"కలిస్తే పరవాలేదు! కాని నాగురించి ఎందుకు ఎంక్వయిరీ చేశారు?"

"నాకేం అవసరం? అయినా చేస్తాను... ఏం తప్పా?"

"ఓ! గూఢచారిలా నాగురించి అలా ఎంక్వయిరీ చేసేబదులు కాలేజి మాన్పించి ఇంట్లో కూర్చోబెట్టకపోయినారు?"

"ఎందుకంత ఆవేశం? నిజంగా నువ్వు క్లాసులకు ఎటెండ్ అవుతున్నావా?"

"ఆహా! మీ తెలివికి నా జోహార్లు! అదేదో ముసుగులో గుద్దులాట ఎందుకు? నా స్టడీస్ గురించి... నా పర్సనల్ లైఫ్ గురించి..."

"అంటే... నీకూ ఓపర్సనల్‌లైఫ్... అంత పెద్దవాడివయిపోయావా?"

"ఏం... ఎందుకు ఉండకూడదు? నేనేం





చిన్నపిల్లాణ్ణి కాదు! ఆ క్లాసులలో కూర్చుని లెక్చరర్లు వేసే వెధవజోకులు భరించేకంటే... ఎగ్గొట్టడమే వెయ్యిరెట్లు నయం!"

"ఇన్నాళ్ళూ... నేనే అనుకున్నాను. ఇపుడు ఆ లెక్చరర్లు కూడా చులకన అయిపోయారన్న మాట నీదృష్టిలో!"

చందూ చాలా తీవ్రంగా స్పందించాడు. ఆవేశంతో ముక్కుపుటాలు ఎర్రబడ్డాయి.

"డాడీ! నేను చాలా సీరియస్‌గా ఆఖరుసారిగా చెబుతున్నాను. ఇలా నాగురించి ఇంకెప్పుడు మరొకరి దగ్గర ఎంక్వయిరీ చేయకండి! నాకు పరమఅసహ్యం!"

ఇక ఒక్కక్షణం అక్కడ నించోలేదు. విసురుగా తనగదిలోకి వెళ్ళి తలుపేసుకున్నాడు. ధడేల్‌మన్న శబ్దానికి లోపలినుంచి శాంతి వచ్చింది.

భర్త స్వరూపం చూడగానే అర్థమయింది! మామూలే!

మళ్ళీ మామూలుగానే అడిగింది— "ఏమిటి? ఏమయింది?"

"ప్రేమ, గారాబం అంటూ నెత్తికెక్కించుకున్నావుగా! అనుభవించు!" కసిగా అన్నాడు. చెందూ తననేం సాధారణంగా దెబ్బతీయలేదు. వాడు తన మొహంమీదే అన్నమాటలు పొడిచిపొడిచి చంపుతున్నాయి.

"ఎందుకు నామీద కసురుకుంటారు? చెప్పేదేదో సరిగ్గా చెప్పండి!"

"మొన్న... సన్‌డేనైట్ చదూకోటానికని ఫ్రెండ్ ఇంటికని చెప్పి వెళ్ళాడా? కాని వాడు వెళ్ళింది ఫ్రెండ్ దగ్గరికి కాదు. సినిమాకి? ప్రేమ్‌రోగ్ సినిమాకి! సిగ్గులేక అబద్ధాలు కూడాను!"

ధనుంజయరావు ఆశించినట్లుగా శాంతి ఆందోళన, ఆశ్చర్యం ప్రకటించలేదు. తాపీగా అంది "నాకు తెల్సు!"

ఆశ్చర్యపోవడం ధనుంజయరావు వంతయింది. రెట్టిస్తూ అడిగాడు-

"నీకు తెలుసా? ఎవరితో వెళ్ళాడోకూడా తెలుసా? ఆ ఫ్రెండెవరోకూడా తెలుసా?"

"ఆహా! అన్నీ తెలుసు. అయినా వాడేం తప్పుచేసాడని వాడిని అనడం?"

"శాంతీ!"

"నిజమే! వాడు ఆరోజు వచ్చింది ఒక గర్ల్‌ఫ్రెండ్‌తో! వాడి ఎదురుసీట్‌లో మీరు...మీ..మీ దురదృష్టంకొద్దీ వాడు, మీ ఇద్దరి దురదృష్టంకొద్దీ నేను. ఇంట్లో తోచక...ఆరోజు నేనూ ఆ పిక్చర్‌కే వచ్చాను. పిటీ ఏమిటంటే-ప్రేమ్‌రోగ్‌కి వచ్చి ముందువరసలో కన్నకొడుకు, ఆముందువరసలో కట్టుకున్న భర్త ప్రేమకలాపాలు తిలకించడం! ఆహా... అదృష్టం అంటె నాదికాదా?"

"శాంతీ!" ఘ్రాన్పడిపోయాడు.

గుక్కతిప్పుకోవడం కష్టమయిపోయింది.

"ఛీ! అలా పిలవకండి. నాకు పరమఅసహ్యంగా ఉంది. పెద్దవుండి వాడిమీద నింద లు వేస్తున్నారే! మీరేం వెలగపెట్టారని! అవునండి...మీగురించి...వాడి గురించి ఆశలుపెట్టుకోవడం అనేది చూసారా...నాది...నాది పొరపాటు!"

కన్నీళ్ళు వచ్చేశాయి. గొంతుకు ఏదో అడ్డుపడ్డట్లయింది. చప్పున పవిటచెంగు నోటికడ్డం పెట్టుకుని చకచకా లోపలికి వెళ్ళిపోయింది.

వెర్రివాడిలా చూస్తుండిపోయాడు ధనుంజయరావు.

తేరుకునేసరికి అయిదు నిముషాలు పట్టింది.

★ ★ ★

చెందూకి కసిగా వుంది! ఆవేశంగా వుంది.

ఏదో చెయ్యాలి. కాని ఏం చెయ్యాలి?

చాలాసేపు అసహనంగా పక్కమీద దొర్లాడు. చిరాకుగా గదిలో పచార్లు చేసాడు.

రిలీఫ్ కావాలి... మెంటల్ రిలీఫ్!

కాశీరామ్ దగ్గరికి వెళితే?

కాశీరామ్‌ని, రమేష్‌ని కలిసికూడా చాలారోజులయినట్లుంది.

నెలరోజులక్రితం కాబోల్ను కాశీరామ్ రూమ్‌కి వెళ్ళాడు.

ఆ అనుభవం తనకి బాగాగుర్తు! అది తలుచుకుంటే ఒకవైపు థ్రిల్లింగ్‌గా ఉంది. మరోవైపు వెగటుగా ఉంది. అయినా మనసు

ఎక్కువగా దానిగురించే ఆలోచిస్తోంది. కాశీరామ్‌ని ఎక్కువగా కాలేజీలో కలవటమే అలవాటు. కాలేజీలో అంటే క్లాస్‌రూమ్‌లోకాదు, కాంపస్‌లో!

రూమ్‌కి అదే మొదలు వెళ్ళడం!

అంతక్రితం హాస్టల్‌లో ఉండేవాడు కాశీరామ్! కాని చేరిన నెలరోజులకే హాస్టల్‌లో జరిగిన పెద్దగొడవకి కారణమయ్యాడు! ఎపుడూ గొడవచెయ్యకపోతే అతనికి తోచదు! అతని మనస్తత్వమే అంత! హాస్టల్‌రూమ్‌లో తాగి గొడవలుచేసిన రోజులు చాలా వున్నాయి.

డబ్బు విచ్చలవిడిగా ఖర్చుచేస్తాడు. అలాగని...ధనవంతుల బిడ్డ ఏమీకాదు! కాశీరామ్ తల్లిదండ్రులది ఎక్కడో భద్రాచలందగ్గర చిన్నపల్లెటూరు. మధ్యతరగతి కుటుంబం.

మొదటినుండి జల్సాగా తిరిగిన రకం! చదువుమీద శ్రద్ధ ఏనాడు లేదు. అతికష్టంమీద ఇంటర్ అయిందనిపించాడు. కాని-రాజమండ్రిలో...కొత్తగూడెంలో ఎక్కడా సీటు దొరకలేదు డిగ్రీకి!

అతికష్టంమీద...ఎవరిదో రికమెండేషన్‌తో ఈ కాలేజీలో దొరికింది. ఇక్కడికి వచ్చిన కాశీరామ్‌కి ఒక్కసారిగా ఆ సిటీవాతావరణం చూసేసరికి అదేదో స్వర్గలోకంలోకి వచ్చిపడ్డట్లనిపించింది.

అంతే...

డిగ్రీకాలేజి చరిత్రలో గుర్తుంచుకోదగిన వ్యక్తిగా మిగిలిపోయాడు. ఎన్నిసార్లు పరీక్షరాసాడో...ఎన్నిసార్లు ఫీజులు కట్టాడో అతనికే తెలీదు. అయినా...మళ్ళీ మళ్ళీ రాస్తూనే వుంటాడు.

చదివిమాత్రంకాదు! ఎక్కువగా దృష్టికొత్తగా రిలీజయ్యే సినిమాలమీదనే ఉండేది.

నెలనెలా తల్లిదండ్రులనుండి వచ్చే డబ్బు మొదటివారంరోజుల్లోనే ఎగిరిపోయేది.

స్ట్రయిక్‌లలో ప్రముఖపాత్ర వహించే కాశీరామ్ అనుకోకుండా ఒకసారి మాజీ మినిష్టరు దృష్టిలోపడ్డాడు.

అప్పటినుండి ప్రారంభమయింది కాశీరామ్ పతనం.

మొదట్లో చిన్న చిన్న పనులకు ఉపయోగించుకునే మాజీమినిష్టరు, క్రమక్రమంగా వాటిస్థాయినిపెంచి - అపుడపుడు హైదరాబాదుకి కూడా పంపిస్తూ వుండేవాడు.

ఏ పనిచేయడానికయినా సందేహించేవాడు కాదు కాశీరామ్. చెయ్యి భారీగా తడుస్తూ ఉండటం అతనికి అవసరం.

అపుడే...ఆ రోజుల్లోనే మొదలయింది మద్యపానం... క్రమంగా మాదకద్రవ్యాలు...

ఎలా అలవాటుపడ్డాడో అతనికే తెలియదు. హాస్టల్‌లో ఉండేరోజులలోనే విపరీతంగా అలవాటుపడ్డాడు వాటికి.

క్రమక్రమంగా అమ్మాయిల పిచ్చికూడా!

అధికారులు హాస్టల్‌నుండి పంపించేసారు అతని గొడవలు భరించలేక. ముఖ్యంగా స్టూడెంట్స్ చెడిపోతున్నారని.

కాశీరామ్ సిటీలోనే రూమ్ తీసుకున్నాడు. ఈ సంగతులేవీ...భద్రాచలంలోని తల్లిదండ్రులకు తెలియవు. ఎప్పటికయినా కన్నకొడుకు చదువు పూర్తిచేసి వచ్చి తమ జీవితాలకు ఆసరాగా నిలుస్తాడని కలలుగంటూ, ఆశతో ఎదురుచూస్తున్నారు.

కాని వాళ్ళకు తెలియదు...

కొత్తరకం మత్తు ప్రపంచంలో మునిగితేలుతున్న కాశీరామ్...క్రమక్రమంగా ఊబిలో కూరుకుపోతున్నాడని.

ఎక్కువగా రమేష్ కాశీరామ్‌ని అంటిపెట్టుకునే తిరుగుతూ ఉంటాడు.

ఆరోజు....

రమేష్-కాశీరామ్ రూమ్ ఎక్కడ ఉన్నదీ ఎపుడో చాలారోజులక్రితం చెప్పాడు. గుర్తులేదు సరిగ్గా!

అయినా వెతుక్కుంటూ బయలుదేరాడు.

ఎక్కడో...ఇరుకుసందుల్లో...

ఊరికి కొంచెం దూరంగా...వుంది ఆ ఇల్లు!

ఇల్లంటే పెద్దఇల్లుకాదు...

పురాతనమయిన మేడమీది గది!

అదే మొదటిసారి - కాశీరామ్ గదికి వెళ్లడం!




ఓరగా వేసివున్న గది తలుపుమీద చిన్నగా తట్టాడు.

లోపల కూర్చుని ఉన్న రమేష్ లేచివచ్చి తలుపు పూర్తిగా తెరిచి "నువ్వా?" అన్నాడు.

అవునన్నట్లుగా తలూపాడు తను.

లోపలికి అడుగుపెట్టాడు. రమేష్ గది తలుపు మళ్ళీ దగ్గరికి వేసేసాడు.

లోపల కాశీరామ్, రమేష్‌లతోపాటు మరోఇద్దరు ఉన్నారు.

లోపల - అదోవిధమయిన మసకవెలుతురుగా ఉంది. అంతేకాదు...అదోవిధమయిన వాసన గదిలో...పొగమేఘాలు...

"హలో!" అన్నాడు కాశీరామ్ నవ్వుతూ!

అలా నవ్వుతున్నప్పుడు - ఆకుపచ్చకళ్ళు



మూసుకునిపోయి, మళ్ళీ పెద్దవయి తళు క్కున మెరిశాయి.

మురికిగావున్న మెడమీదకి పడిన జుట్టుని సర్దుకుంటూ "రా! కూర్చో!" అన్నాడు.

అపుడు చూసాడు కాశీరామ్‌ని పూర్తిగా పరిశీ లనగా.

కాశీరామ్ వంటిమీద కట్‌డ్రాయర్‌తప్ప మరో ఆచ్ఛాదనలేదు...

నేలమీద పరిచివున్న చాపమీద, కాళ్ళుడు బారచాపి, విలాసంగా గోడకు ఆనుకుని వున్నా డు.

అతన్ని అలా చూడాలంటే అదోలా...అస హ్యంగా వుంది.

రమేష్ మామూలుగా పాంట్‌తో ఉన్నాడు. మిగతా ఇద్దరు లుంగీలు కట్టుకున్నారు.

చందూ...అలా ఊహించుకోలేదు కాశీరామ్ గురించి!

మౌనంగా వెళ్ళి తనూ చాపమీద కూర్చున్నా డు.

మిగతా నల్గురూ...సీరియస్‌గా మళ్ళీ పేకా టలో మునిగిపోయారు

కాశీరామ్, చేతిలోని సిగరెట్ దమ్ము గట్టిగా పీల్చి, పక్కనపెట్టి ముందుకువంగి పేకముక్క లు పంచాడు. అపుడు - పక్కనపెట్టిన సిగరె ట్‌ని చేతిలోకి తీసుకుని గుండెల్నిండా పొగపీ ల్చి. అరమోడ్పుకళ్ళతో గోడకి జారగిలబడ్డాడు.

చెందూ ఆ గదిని పరిశీలించడం మొదలె ట్టాడు.

ఆ గదిని ఆనుకునే మరొకగది.

ఆ గది గోడల్నిండా...రకరకాల సినిమా తారల అర్ధ నగ్నపు ఫోటోలు వున్నాయి. చెందూ కళ్ళముందు రకరకాల దృశ్యాలు కదిలిపోతు న్నాయి.

ఆ వాతావరణం...మనసులోని కొత్త ప్ర పంచానికి తెరలు తొలగిస్తోంది...

కాశీరామ్ మధ్యలో ఏదో బూతుజోక్ కట్‌చేసా డు.

అందరూ ఒక్కసారిగా గొల్లున నవ్వి ఒకరి మీద ఒకరువడ్డారు.

చెందూకి వెగటనిపించినా - బలవంతంగా నవ్వి...తల తిప్పబోతుంటే...దృష్టి అపుడు పడింది

తనపక్కనే కొంచెందూరంలో పడేసిన పుస్తకా లమీద.

నీట్‌గా అట్టలువేసి వున్నాయి.

ఆసక్తిగా ఒక పుస్తకం చేతిలోకి తీసుకుని, మొదటి పేజీ తిప్పాడు!

ఒకక్షణం ప్రపంచమంతా గిర్రున తిరిగినట్ల యింది.

అవి...పూర్తి న్యూడ్‌గా ఉన్న యువతీయువ కుల ఫొటోలు...వివిధ భంగిమల్లో!

చేతుల్లో వణుకు మొదలయింది...

కడుపులో అదోవిధమయిన వికారం! గుండె ల్లో స్పందన! వెన్నులో చలి!

చప్పున మూసేయాలనుకున్నాడు...

కాని మనసులోని కుతూహలం కెరటాల్లా తన్నుకువస్తోంది...

మరో పేజీ తిప్పాడు.

భయం! సిగ్గు! అసహ్యం! ఆసక్తి!

ఆవేశం...సముద్రపు నురగలా పొంగి పొంగి పొరలి పొరలి వస్తోంది.

పట్టి పట్టి చూసాడు! కళ్ళు చికిలించి చూసాడు! పేజీ తిప్పాడు! తృప్తిగా అన్పించ లేదు! మళ్ళీ పేజీ వెనక్కి తిప్పి ముందు పేజీ...

ముందు పేజీ వెనక్కితిప్పి తర్వాతి పే జీ...మళ్ళీ ముందుకి...

గుండె స్పీడుగా కొట్టుకోవడం మొదలె ట్టింది.

కళ్ళముందు వలయాలు. రంగు రంగుల వలయాలు...కలిసిపోతూ...విడిపోతూ...శరీరం తేలికైపోతున్నట్లు అనుభూతి!

ఏదో మార్పు...కొత్త మార్పు తన శరీరంలో కల్గుతోంది! కొత్త వింతైన అనుభూతి! భు జంమీద చెయ్యిపడటంతో ఉలిక్కిపడ్డాడు. రమేష్! తనవంక ఆశ్చర్యంగాచూస్తూ "బాప్ రే! ఇదంతా సిగ్గే!" అన్నాడు.

నుదుటపట్టిన చెమటను తుడుచుకుంటూ




సిగ్గుగా నవ్వాడు చెందూ!

కాశీరామ్ మళ్ళీ ఏదో బూతు జోక్ కట్‌చేసాడు.

అందరూ నవ్వారు!

చందూకి కాసేపటికి బెరుకు, సిగ్గుపోయింది.

ఆ వాతావరణానికి అలవాటుపడసాగాడు.

ఈసారి ఫ్రీగా కాస్త తలఎత్తి ఆ పుస్తకం చూడసాగాడు.

ఇపుడు గుండె అంత తీవ్రంగా కొట్టుకోవటంలేదు.

కాశీరామ్ చిన్నపేకెట్ ఒకటి తీసాడు పక్కనే ఉన్న దిండుకిందనుండి. దానిని ఒకసారి అటూ ఇటూ తిప్పి నవ్వాడు అదోలా

ఆ పేకెట్‌ని రమేష్‌వైపు విసిరాడు.

పుస్తకం చూడటంఆపి, రమేష్‌చేసే పనిని చూడసాగాడు చెందూ.

జేబులోనుండి సిగరెట్ పేకెట్‌తీసాడు రమేష్. వాటిల్లోనుండి సిగరెట్‌తీసి సిగరెట్‌లోని పొగాకునంతా నేర్పుగా బయటకు తీసాడు.

చేతిలోని పేకెట్‌విప్పి దానిలోది నెమ్మదిగా జాగ్రత్తగా అందులో కూరసాగాడు.

అదోవిధమయిన వాసన వచ్చింది.

"ఏమిటది?" చందూ అడిగాడు ఆసక్తిగా.

రమేష్ చిన్నగా నవ్వాడు. కాని సమాధానం చెప్పలేదు.

కాసేపటికి ఆ కార్యక్రమం ముగిసింది. రమేష్ జేబులోనుండి అగ్గిపెట్టితీసి ఆ సిగరెట్ వెలిగించాడు.

గట్టిగా ఒక దమ్ములాగి, ఒక నిముషంసేపు కళ్ళు అరమోడ్పులుచేసి అలాగే కూర్చుండిపోయాడు.

అతని చేతిలోనిది కాశీరామ్ లాక్కున్నాడు. ఓ దమ్ములాగి "హా!" అంటూ గోడకి జారగిలబడ్డాడు.

కాశీరామ్ చేతిలోనిది మరొకతను తీసుకుని గట్టిగా పీల్చాడు. అతని చేతిలోనిది మరొకతను...

మళ్ళీ...తిరిగి రమేష్ చేతిలోనికి వచ్చింది ఆ సిగరెట్.

రమేష్ చెందూవైపు తిరిగి నవ్వాడు.

ఆ నవ్వు అదోలా వుంది. మత్తుగా వుంది. చెందూకి భయంవేసింది.

రమేష్ ఎప్పటిలాలేడు! కొత్తగా ఉన్నాడు. తను రోజూ చూసే రమేష్‌లా లేడు.

అందరిలోనూ...అదోవిధమయిన మార్పు వచ్చింది...

చేతుల్లోని పేకముక్కలు చాపమీద చెల్లాచెదురుగా పడివున్నాయి. గదంతా పొగతో నిండిపోయింది

వలయాలు...వలయాలుగా...

ఏదో మార్పు... అసలు ఈ వాతావరణంలోనే మార్పు.

చెందూ ఉలిక్కిపడ్డాడు.

తన పెదవులదగ్గర ఆ సిగరెట్! అందరూ దమ్ములాగి, పీల్చి వదిలిన ఆ సిగరెట్ తన పెదవుల మీద ఆనించాడు కాశీరామ్!

భయంగా తలతిప్పాడు చందూ!

నవ్వాడు కాశీరామ్... గారపట్టిన పళ్ళతో...దగ్గరగా ఉన్నాడు... అతని నోట్లో నుండి అదోవిధమయిన వెగటుపుట్టే దుర్వాసన వస్తోంది.

ఒళ్ళు జలదరించింది. కళ్ళు మూసుకుని అప్రయత్నంగా పెదవులు విప్పాడు.

రెండు పెదవుల మధ్య ఓగిసింది సిగరెట్.

తనకు తెలియకుండానే దమ్ము లాగాడు చిన్నగా!

మరుక్షణం ఊపిరితిత్తులు ఒక్కసారిగా ఉండలు చుట్టుకుపోయాయి. గాలి అందక ఉక్కిరిబిక్కిరయిపోయాడు.

శరీరమంతా కంపనాలు, ప్రకంపనాలతో ఊగిపోయింది. చెమటలు పట్టాయి. అది ఒక్కనిముషం మాత్రమే.

ఈసారి మళ్ళీ దమ్ములాగాడు! కొంచెం గట్టిగా... ఊపిరి పీల్చినట్టుగా!

ఒక్కసారిగా ఘాటుగా...తియ్యిరిగా...మత్తుగా...ఉన్న ఓ వాయువు ముక్కుపుటాలగుండా ప్రవేశించింది గొంతులోనికి.



మళ్ళీ పీల్చాడు.

చిన్న... అతిచిన్న...చుక్క... వెలుగు చుక్క... ఎక్కడో దూరంగా... సుదూరంగా మిణుకు మిణుకుమంటోంది. క్రమక్రమంగా దగ్గరవు తోంది. వెలుగులు విరజిమ్ముతూ... ప్రచండ మైన కాంతి కిరణాలు వెదజల్లుతూ...

దగ్గరయ్యే కొద్దీ ఆ కాంతి పుంజం వలయా లు వలయాలుగా విడిపోతోంది. ఒక వల యంలో నుండి మరొకటి దూరిపోతూ, చుట్టుకు పోతూ, బయటకు వస్తూ... రంగులు మారు స్తూ...గిరగిరా తిరుగుతున్నాయి.

తన కళ్ళకి అతిచేరువుగా... లెక్కలేనన్ని వలయాలు... ఉయ్యాలలా ఊగుతున్నాయి. అన్నీ మూసుకుపోయి ఒకటిలా అయిపోయి మళ్ళీ విడిపోతూ... కలిసిపోతున్నాయి. తన శరీరాన్ని చుడుతున్నాయి. క్రమంగా తన శరీ రంలో కలిసిపోతున్నాయి. వాటి మధ్య తను తిరుగుతున్నాడా? తన చుట్టూ అవి తిరుగుతు న్నాయా?

తల విదిల్చాడు చెందూ!

తను ఎక్కడ ఉన్నాడు? ఏదో లోకం నుండి హఠాత్తుగా విసిరి వేయబడిన భావన! తలతి ప్పాడు.

ఏదో వాసన! తన మీదికి, వంగి, ముఖంలో ముఖం పెట్టి చూస్తున్న పచ్చటి కళ్ళు! కాశీ రామ్!

ఉలిక్కిపడి పక్కకు పత్తిగిల్లాడు! మిగతా ముగ్గురు తన వంక ఆశ్చర్యంగా, నవ్వుతూ చూస్తున్నారు.

అంటే— ఇంతసేపూ తను కాశీరామ్ తొడ మీద తలపెట్టుకుని వున్నాడా?

కాసేపటికి భళ్ళున వాంతి చేసుకున్నాడు చెందూ.

★ ★ ★

ఆ సంఘటన తర్వాత మళ్ళీ కాశీరామ్ రూము కి వెళ్ళలేదు చెందూ.

మళ్ళీ ఎందుకో...ఇవుడు...ఆరూమ్‌కి వెళ్ళా లనే తపన...

ముఖ్యంగా ఈ తలనొప్పి గొడవలో నుండి... దూరంగా వెళ్ళాలి!

వచ్చిగా, బూతుగా ఉన్న ఆ ఉత్సాహాన్ని పంచుకోవాలని మనసు ఆరాటపడుతోంది. 'ఆ' అనుభూతిని తిరిగి పొందాలనే ఉబ లాటం!

చెందూ ఇక సందేహించలేదు. చెంగున లేచి రెండు నిముషాలలో రెడీ అయి, బయ టకు వచ్చి, గదితలుపులు గొళ్ళెం వేసి రోడ్డు మీదకు వచ్చాడు.

తల్లికి చెప్పలేదు. లోపల వంటింట్లో వుంది!

లూనా బయటకు తీయదలుచుకోలేదు! నడిచే వెళ్ళాడు. మరో ఎదినిముషాలలో కాశీ రామ్ గదిలో ఉన్నాడు.

చెందూను చూస్తూనే కాశీరామ్ ఉత్సా హంగా కళ్ళెగరేసి విజిల్ వేసాడు. ఈసారికూ డా కేవలం కట్‌డ్రాయిర్‌తోనే ఉన్నాడు కాశీ రామ్! బహుశా రూమ్‌లో ఉన్నప్పుడు ఇదే వస్త్రధారణ కాబోలు! లుంగీకూడా కట్టుకోడు! కాశీరామ్‌కి ఈ విషయంలో ఎలాంటి సిగ్గూ లేదు. మామూలుగా తిరుగుతుంటాడు గదిలో మధ్యమధ్యలో పిట్టగోడ దగ్గరకు వచ్చి — అలాగే రోడ్డుమీద వచ్చేపోయేవాళ్ళను చూస్తూవుంటాడు విజిల్ వేస్తూ!

చెందూకి సందేహంగా ఉంది.

ఏమని అడగాలి?

ఆ పుస్తకాలు మళ్ళీ... మరోసారి చూడాలని వుందని చెప్పాలా?

ఆ సిగరెట్ దమ్ము రుచి...మరోసారి పీల్చా లని వుందని చెప్పాలా?

ఆ కొత్త ప్రపంచంలోకి... మరోసారి తొంగిచూ డాలని వుందని చెప్పాలా?

సందేహంగా, మౌనంగా వున్న చెందూని చూసి నవ్వాడు కాశీరామ్!

ఆకుపచ్చ కళ్ళు చికిలించుకుని, మళ్ళీ పెద్దవయ్యాయి.

ఎందుకో కాశీరామ్ కళ్ళకింద నల్లటి గీతలు వచ్చాయి కొత్తగా! ముఖం కాంతిహీనంగా వుంది.

అయినా ఉత్సాహంగానే వున్నాడు.

"ఏమిటి! మౌనంగా ఉండేవాళ్ళంటే నాకు చిరాకు! మాట్లాడు! నీ ఇష్టం... ఏదైనా మాట్లా

# మీకు తెలుసా?



★ వారపత్రికలు కూడా రూ 3/ తక్కువలేని ఈరోజుల్లో జంటమాస పత్రికలు 'విపుల, చతుర' ఒక్కొక్కటి కేవలం రూ 2-50 లభిస్తున్నాయి.

★ సీరియల్స్, సినిమా కబుర్లు మరియు ఇతర శీర్షికలతో వచ్చే అన్ని పత్రికలకు భిన్నంగా ఒక పూర్తి నవలతో 'చతుర', దాదాపు 15 వివిధ భాషా కథలతో 'విపుల' తమ ప్రత్యేకతను నిలుపుకొంటున్నాయి. ఒక్కొక్కటి 132 పేజీలతో నెలనెలా సర్వాంగసుందరంగా వెలువడుతున్నాయి.

★ ఏ భాషలోను, ఏపత్రిక సాహసించనంత భారీగా రూ. లక్షపైబడిన బహుమతులతో కథల/నవలల పోటీ జయప్రదంగా నిర్వహించిన విపుల, చతురలు బహుమతి పొందిన కథల/నవలల ప్రచురణలతో ప్రస్తుతం మార్కెట్‌లో నెలనెలా 1వ తారీఖున విడుదలవుతున్నాయి.

★ పత్రికారంగంలోనే ఒక రికార్డుగా కేవలం ఒక సంవత్సరకాలంలో అమ్మకాలు. దాదాపు 3 రెట్లు పెరిగి, ఇతర తెలుగు మాసపత్రికల కన్నా సుమారు రెండురెట్ల అమ్మకాలతో 'చతుర', $1^1/_2$ రెట్లతో 'విపుల' ప్రస్తుతం మార్కెట్‌లో అత్యంత ప్రజాదరణ పొందుతున్నాయి.

తప్పక చదవండి

**చతుర** **విపుల**

షు!''

చందూ సందేహంగా అన్నాడు.

''ఊహూ!ఏమీ తోచడం లేదు... మనసు బాగోలేదు...''

''మనసు బాగోలేదా...?'' చిత్రంగా కనుబొమలు ఎగరేసి అన్నాడు కాశీరామ్. అవునన్నట్లుగా తల ఊపాడు చెందూ!

''ఒహ్! మనసు బాగాలేకపోవడం! ఛ! ఎప్పుడు? ఎపుడు బాగుపడతారు ఈ జనం? మనసు...బాధ... ఈ మాటలు అసలు మన డిక్షనరీలోనుండే తీసెయ్యాలి... అసలు అవంటే ఏమిటి?... ఎన్నిదారులు? ఎన్ని గమ్యాలు? ఎన్ని ప్రపంచాలు... కావాలేకాని... కోరుకోవాలే కాని... అన్నీ మన చేతుల్లోనే వున్నాయి. అక్కడ ఈ రోగాలు వుండవు... బాధలు వుండవు... మనసు బాగా లేకపోవడాలు వుండవు...''

చెందూకి అతని మాటలు అర్థం కావటం లేదు. మనసంతా ఆ పుస్తకాల మీదనే ఉంది.

కాశీరామ్ హఠాత్తుగా చెప్పడం మానేసి నెమ్మదిగా అన్నాడు.

''చూస్తావా?''

చెందూ ఆత్రంగా అడిగాడు. ''ఏమిటి... పుస్తకాలా?''

''కాదు! హెవెన్! నీ జీవితంలో చనిపోయాక కూడా అందుకోలేని స్వర్గం!''

''ఏమిటది?''

కాశీరామ్ చెప్పలేదు. నవ్వి, రూమ్‌కి నడిచాడు. లోపల నుండి, వచ్చిన కాశీరామ్ చేతిలో సిరెంజి వుంది

చందూకి సగం అర్థంఅయీ అర్థం కానట్లుగా వుంది.

సన్నగా గొణిగినట్లుగా అన్నాడు. ''ఇంజెక్షనా...''

''కాదు! స్వర్గానికి సరాసరి చేర్చే స్పెషల్!''

చెందూ కళ్ళు పెద్దవయ్యాయి.

కాశీరామ్ చెందూకి దగ్గరగా... అతి దగ్గరగా వచ్చాడు.

ఆకుపచ్చ కళ్ళు పెద్దవిచేసి...

చెందూ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు—

''మరి... స్వర్గానికి వెళ్ళొస్తావా?''

ఆ మాటలు హిప్నటైజ్ చేస్తున్నట్లుగా ఉన్నాయి.

కళ్ళు మెస్మరైజ్ చేస్తున్నాయి..

చెందూకి భయంగా ఉంది. పెదవులు స్వల్పంగా వణికాయి.

అయినా... ఆ కొత్త అనుభూతి కోసం...

నెమ్మదిగా చెయ్యిజాచాడు!

సూది చందూ శరీరంలోకి దిగసాగింది.

కాశీరామ్ మాటలుకూడా చెవిలోకి జొరబడుతున్నాయి హిప్నటైజ్ చేస్తున్నట్లుగా!

''సాయంత్రం వస్తావా!''

''ఎందుకు?'' మత్తుగా అడిగాడు చెందూ!

''ఎందుకేమిటి! మరో లోకం చూపిస్తాను! మనలాంటి యువకులు కోరుకునే ప్రదేశమది!''

''ఏమిటది?''

''ఊహు... చెప్పను!'' చిలిపిగా అన్నాడు కాశీరామ్!

మార్ఫియా పనిజేయుడం ప్రారంభించింది.

శరీరంలోని నాడులన్నీ ఒక్కటయి, రక్తమంతా ఇంకిపోయి, శరీరం తేలికయిపోయి ఎక్కడికో ఎగిరిపోతున్న భావన.

ఆకాశపు అంచుల్ని తాకుతున్న భావన...

భూమిమీద కొచ్చేసరికి చెందూకి గంట పట్టింది.

తలతిప్పి చూసాడు.

కాశీరామ్ మత్తుగా ఉన్నాడు. విచ్చలవిడిగా పడిదొర్లుతున్నాడు.

దాహం... విపరీతమయిన దాహం! నాలుక పిడచకట్టుకుపోతోంది! గొంతులో ఎడారి! చెందూ బలవంతాన లేవబోయాడు!

ఒక్కసారిగా ఒళ్ళు తూలింది. కాళ్ళు వణికాయి.

భయంకరమయిన నీరసం!

దాహం!





నెమ్మదిగా మునివేళ్ళమీద లేచాడు. గోడని తడుముతూ గదిలోకి నడిచాడు తూలు కుంటూ!

చిన్న కూజా వుంది. దానిని పట్టుకోవాలంటే చేతులు లేవడం లేదు. శరీరం స్వాధీనం తప్పుతోంది.

అతి కష్టంమీద అదుపు తప్పుతున్న శరీరాన్ని కంట్రోల్ చేసుకుంటూ కూజా చేతిలోకి తీసుకున్నాడు.

ఖాళీ!

ఒక్క చుక్క నీటిబొట్టు కూడా లేదు!

ఒక్కసారిగా దాహం వేయినాలుకలతో విజృంభించింది. నీరసం పెనవేసుకుపోతోంది.

భయంకరమయిన దాహం!

మళ్ళీ తూలుకుంటూ ముందు గదిలోకి వచ్చాడు!

అటు ఇటూ పొర్లుతున్న కాశీరామ్ ఏదో గొణుగుతున్నాడు. తనలో తనే ఏదో మాట్లాడు కుంటున్నాడు.

చెమటలు దిగజారుతున్నాయి.

షర్టు విప్పేశాడు చెందూ!

శరీరం కంట్రోల్ తప్పింది. ఒక్కసారిగా కళ్ళు తిరిగాయి.

అంతే! చాపమీదకి కూలబడిపోయాడు.

దాదాపు మూడు గంటలసేపు అలాగే పడి వున్నారు ఆ యువతరం ప్రతినిధులు.




ఇంటికి వచ్చేసరికి విపరీతమయిన నిస్సత్తువ ఆవహించింది చెందూకి! అయినా చాలా ఆకలిగా ఉండటంతో చకచకా భోజనం చేశాడు. భోజనం పెడుతున్నప్పుడు మమ్మీ ఎందుకో చాలా గంభీరంగా ఉంది. అయినా చెందూ. పట్టించుకోలేదు. తలొంచుకుని తిని తన గదిలోకి వెళ్ళిపోయాడు. రెండుగంటల క్రితం జరిగిన అనుభవం గమ్మత్తుగా ఉన్నా తలచుకోడానికి ఇష్టంగాలేదు.

ఏదో గిల్టీ ఫీలింగ్! తప్పుచేసానన్న భావన!

కాసేపు చదివితేపోలా!

తల ఎగరేశాడు! బద్ధకంగా ఉన్నా లేచి బలవంతాన పుస్తకం తీసాడు.

ఎదురుగా గోడకి తగిలించిఉన్న కాలండర్! ఇంక పరీక్షలు మూడువారాలేనని గుర్తుచేస్తోంది... వెక్కిరిస్తోంది.

మూడు వారాలు!

హఠాత్తుగా అపుడు గుర్తుకు వచ్చింది చెందూకి!

మైగాడ్! ఈరోజు వన్‌డే క్రికెట్ మ్యాచ్ కదూ!

భూమి తల్లకిందులయినట్లనిపించింది! తను ఈ సంగతి మర్చిపోవడమేమిటి! అది తన ఆరోప్రాణం!

చేతిలోని పుస్తకం విసిరి అవతల గిరాటు వేసి ఒక్క ఉదుటునలేచాడు. టేబుల్ మీద పెట్టివున్న ట్రాన్సిస్టర్ ఆన్‌చేస్తూ ఉంటే... గుండెలు టెన్షన్‌తో స్పీడుగా కొట్టుకోసాగాయి.

గవాస్కర్ స్కోర్ ఎంతో?

శ్రీకాంత్ పరిస్థితి? కపిల్ ఔటయివుంటాడా?

మైగాడ్! ఇంకేమయినా ఉందా!

మనసు నిలవడంలేదు! కాలుచెయ్యి ఆడటంలేదు.

ట్రాన్సిస్టర్ చెవిదగ్గర పెట్టుకున్న పదినిముషాల తర్వాత కాని మనసు కుదుటపడలేదు. తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

అంతే!

అయిదింటివరకు గవాస్కర్ బాటింగ్, కపిల్ బౌలింగ్ మధ్య బంతిలా ఎగిరి పడుతూనే ఉన్నది మనసు! పరీక్షలు ఎపుడో ఔటయిపోయాయి!

క్రికెట్‌టెస్ట్ మ్యాచ్ వివరాలు, క్రికెట్ ప్లేయర్ల జీవితరహస్యాలు, హాబీలు, వాళ్ల రికార్డులు, సెంచరీల వివరాలు - ఆఖరికి పొద్దున్నే లేచి వాళ్ళు వాడే టూత్‌పేస్ట్ దగ్గరనుండి, రాత్రి పడుకోబోయే ముందు తీసుకునే ఆహారం వరకూ- అన్ని వివరాలు చెందూ నాలిక చివరనే వుంటాయి.

అలాగే సినిమా తారల అడ్రసులు, ఎవరెవరి సినిమాలు ఏయే సెంటర్లలో ఎన్ని రోజులు ఆడిందీ నిముషాల మీద చెప్పేయగలడు.

అంతేకాదు! అమితాబ్ అభిమాన సంఘానికి ప్రెసిడెంటు! శ్రీదేవి ఫాన్స్ అసోసియేషన్‌కి సెక్రెటరీ! ఉన్నట్లుండి అభిమానులందరూ చందాలువేసుకుని, మొదటి రోజు మొదటి ఆటకి వచ్చిన ప్రేక్షకులకు స్వీట్లు పంచిపెట్టి తమ అభిమానం వెలిబుచ్చుకుంటూ ఉంటారు. తమ అభిమాన నాయికానాయకులతో రెగ్యులర్ కరెస్పాండెన్స్ కూడా జరుపుతూ వుంటారు.

ఈమధ్యన శ్రీదేవి హిందీ ఫీల్డుకి, అమితాబ్ పాలిటిక్స్‌లోకి వెళ్ళిపోయేసరికి, చెందూ జోరు చాలావరకు తగ్గింది.

కాని క్రికెట్ పిచ్చిమాత్రం తగ్గలేదు.

పొద్దున్నేలేచి ట్రాన్సిస్టర్ చెవిదగ్గర, టూత్‌బ్రష్ నోట్లోను పెట్టుకుని బ్రష్‌చేసుకుంటూ, అటూ ఇటూ డాన్స్ చేస్తున్నట్లుగా తిరుగుతూ, ఉన్నట్లుండి నురగ నిండిన నోటితో... "హుర్రే!" "వహ్వా!" అని, గాలిలోనే అంతెత్తున ఎగిరి "యాహూ!" అని అరుస్తుంటే శాంతి మొదట్లో ఈ పిచ్చి అరుపులకి భయపడ్డా తర్వాత... "ఇదేదో క్రికెట్ జడుపుకాబోల్ను!" అని సరిపెట్టుకుని అలవాటు పడిపోయింది.

క్రికెట్ కామెంటరీ వస్తుంటే - చెందూకి అన్నం నీళ్ళు అక్కర్లేదు. ఈ పిచ్చి చూసే ధనుంజయరావు టి.వి. ఇంటికి తీసుకురావటానికి ఒప్పుకోలేదు! "వాణ్ణి చదువుకోనీ! అదయ్యాక తీసుకువద్దాంలే" అంటుండేవాడు.

క్రికెట్ పర్వం అయినాక, కాఫీ తాగుతుంటే, గుర్తుకొచ్చారు - కాశీరాం, రమేష్‌లు!



చెందూకి వాళ్లని చూస్తుంటే ఉత్సాహంగా ఉంది. యువకులు అంటే అలా వుండాలి! జీవితాన్ని అలా అనుభవించాలి. ఉన్న ఈ నాలుగు రోజులూ అలా ఎంజాయ్‌చేయాలి!

నిజంగా అదికూడా ఓ అదృష్టం! నెల నెలా డబ్బుపంపించే పేరెంట్స్...

అంతకంటే ఎక్కువ ఆలోచించదల్చుకోలేదు చందూ.

కాశీరామ్ మళ్లీ సాయంత్రం రమ్మన్నాడు.

ఆ ఊహరాగానే మనసు ఉత్సాహంగా ఉరకలువేసింది.

* * *

అదో హాలు!

ఆ హాలులో దాదాపు పాతికమంది వరకు ఉన్నారు. దాదాపుగా అందరూ ఇరవయి ఏళ్ళ లోపువారే.

హాలంతా చీకటిగా వుంది. ఎదురుగా అందరికీ బాగా కన్పించేలా టేబుల్‌మీద పెట్టి వుంది టి.వి. సెట్.

అయిదు నిముషాలకు ఓ కుర్రాడు వచ్చి వీడియో ఆన్‌చేశాడు. రెండు నిముషాలు, ఎడ్జెస్ట్‌చేసి వెళ్ళి వెనుక కూర్చున్నాడు.

మొదలయింది బ్లూఫిలిమ్.

మధ్యవరుసలో ఒక మూలగా కూర్చుని ఉన్నారు చందూ, కాశీరామ్!

రమేష్ రాలేదు! అర్జంట్ పనిమీద గుంటూరు వెళ్ళాడు.

నెమ్మదిగా కాశీరామ్ చెందూ చేతిని తన చేతిలోకి తీసుకొని గుప్పిటబిగించాడు. చెందూ చెయ్యి వెచ్చగా వుంది. ముఖం వడగాడ్పుకొట్టినట్లుగా వుంది.

ఊపిరి బరువుగా వస్తోంది.

హాలంతా పిన్‌డ్రాప్‌సైలెన్స్‌గా వుంది.

ఎదురుగా కనిపిస్తున్న దృశ్యాలు చందూ శరీరంలో రకరకాల ఉద్వేగాల్ని సృష్టిస్తున్నాయి. కొత్త ఆలోచనలు... అదోరకమయిన అనుభూతి. మాటలకందని అనిర్వచనీయమైన అనుభవాల తాలూకు అనుభూతి! రెప్ప వేయకుండా చూడసాగాడు చెందూ.

కాశీరామ్‌కి అదికొత్తకాదు కాబట్టి- చందూ అవస్థచూసి నవ్వుకున్నాడు.




అరగంట తర్వాత బయటపడ్డారు ఇద్దరూ! చాలా సేపటివరకు చందూ మాట్లాడలేదు! కళ్ల ముందు అవే దృశ్యాలు..

కాశీరామ్ నడుస్తున్నాడు. అతనితోబాటు చందూ!

ఎటువైపు వెళుతున్నారో తెలియదు. నాలుగైదు సందులు తిరిగారు.

కాశీరామ్ హఠాత్తుగా ఆగిపోయాడు! చందూ ఈ లోకంలోకి వచ్చినట్లుగా తుళ్ళిపడి ఆగి తలెత్తి చూసాడు.

ఎదురుగా వుంది - చిన్నసైజులాడ్జి!

"ఏమిటది?"

చందూకి క్రమంగా అర్థమవుతోంది... ఇక్క-డికి ఎందుకు తీసుకొచ్చాడో! కాశీరామ్ నవ్వా

డు. "నువ్విప్పుడు చిన్నపిల్లవాడివి కాదు! వయసులో ఉన్నావు! వయసు ఉన్నది అనుభవించడానికే! సో.. మైడియర్ ఫ్రెండ్..."

చందూ కళ్ళముందు బ్లూఫిలిమ్‌లోని దృశ్యాలు గిర్రున తిరిగాయి. ఇంకేమీ తర్కించదలచుకోలేదు.

లాడ్జిలో అడుగుపెట్టారు. కాశీరామే కౌంటర్‌లోవున్నవాడితో ఏదో మాట్లాడాడు! ఇద్దరూ కాసేపు తర్కించుకున్నారు. అయిదు నిమిషాల తర్వాత, కాశీరామ్, చందూ మెట్లుఎక్కి పైఅంతస్థులోకి వెళ్ళి ఒక గదిముందు ఆగారు.

కాశీరామ్ ఆ గది తలుపునెట్టాడు. చందూ లోపలికి అడుగు పెట్టాడు.

కాశీరామ్ బయటే ఉండి, మళ్ళీ తలుపు వెనక్కి లాగివేస్తూ... కన్నుగొట్టి అన్నాడు.

"సీయూ... గుడ్‌నైట్!"

పక్కరూమ్‌లోకి నడిచాడు కాశీరామ్.

చందూ ఒంటరిగా క్షణంసేపు అలాగే నిల్చుండిపోయాడు.

చిన్నగది. గోడవారగా వేసివున్న మంచం. పరుపు. దానిమీద వెలిసిపోయిన దుప్పటి!

నీరసంగా తిరుగుతున్న ఫాను

ఓవైపు టేబుల్! దానిమీద కూజా, గ్లాసు!

ఎందుకో మనసంతా మొద్దుబారిపోయింది!

ఏమవుతోంది తనకు? అసలు ఏం జరుగుతోంది?

ఆలోచనలు తెగటంలేదు. మనసంతా మూగగా వుంది.

చిన్నగా కదిలి, టేబుల్‌వైపు నడిచి గ్లాసులోకి నీళ్ళువంచి తాగబోతుండేసన్నగా తలుపు మీద చప్పుడయింది.

గాజుల చప్పుడు!!

చప్పున గ్లాసుఎత్తి గటగటా తాగాడు!

భయంగా ఉంది!

నెమ్మదిగా వెళ్ళి తలుపుతీశాడు!

విసురుగా తలుపుతెరుచుకుని లోపలికి ప్రవేశించింది ఒక యువతి. తలుపు గడియపెట్టి వచ్చి మంచంమీద కూర్చుంది.

పాతికఏళ్ల వరకూ ఉంటాయి. ఇంకా ఎక్కువే వుండవచ్చు.

తలలో మల్లెపూలు! కనకాంబరరంగు చీర, అదేరంగు జాకెట్టు వేసుకొని వుంది.

ముఖానికి దట్టంగా పౌడరు అద్దుకుని ఉంది.

పందొమ్మిదేళ్ళ కుర్రాడు.. ఎదురుగా కవ్విస్తున్న యువతి!

భయంగా వుంది! తప్పేమోనన్న ఫీలింగ్!

ఆమెను చూస్తుంటే ఆవేశంగానూ వుంది!

గంటక్రితం బ్లూఫిలింలోని దృశ్యాలు పదేపదే గుర్తుకు వస్తున్నాయి.

చిన్నగా నవ్వి, అలవోకగా పమిట జార్చింది.

అంతవరకే తెలుసు చందూకి!

ఆమె శరీరంలో ఎత్తులుకొలుస్తున్న అతనికి... ఆ పందొమ్మిదేళ్ళ కుర్రవాడికి తాను ఏ అగాధంలోకి పోతున్నాడో తెలియదు...

ఆమె పెదవులు మీటుతున్న అతనికి... ఒక్కొక్కమెట్టు ఎలా జారిపోతున్నాడో తెలియలేదు...

ఆవేశం ఆలోచనని కప్పేసింది!

అతనికి ఆ ఆవేశంలో ఏమీ అన్పించలేదు కానీ, ఎందుకో ఒక్కసారి మాత్రం ఆమె అతని నుదుటిమీద ముద్దుపెట్టుకున్నప్పుడు మాత్రం అమ్మ గుర్తుకొచ్చింది.

అది క్షణం మాత్రమే!

మళ్లీ తమకంగా వెర్రెత్తిన ఆవేశంతో ఆమెను అల్లుకుపోయాడు.

దాదాపుగా రాత్రి రెండుగంటలవరకూ ఆమెతో గడిపి, కాసేపటికి మగత నిద్రలోకి జారిపోయాడు.

వెంటిలేటర్‌లో నుంచి పడుతున్న సూర్యకిరణాలు చెందూ బుగ్గని చురుక్కుమనిపించాయి.

మగతగా, మత్తుగా అటూ ఇటూ మంచంమీద దొర్లాడు.

ఏదో కొత్తలోకంలో విహరిస్తున్నట్లుగా వుంది.




హఠాత్తుగా గుర్తుకొచ్చి, పూర్తిగా కళ్లు తెరిచి చూశాడు.

ఆ యువతి లేదు.

చప్పున మంచంమీదనుండి లేచాడు.

గది తలుపు దగ్గరగా వేసివుంది.

ఎందుకో ఒక్కసారిగా ఎంత ఆపుకుందామన్నా ఆగని నిట్టూర్పు ఒకటి బయటకు వచ్చింది.

బద్ధకంగా ఒళ్లు విరుచుకుని, చేతులు విదిలించాడు.

కిటికీ దగ్గరకు వెళ్లి, తలుపు తీశాడు.

గుప్పున కొట్టింది అదో విధమయిన మురికి వాసన. ఆ లాడ్జికి వెనుకవైపున అన్నీ గుడిసెలే.

చాలామంది పిల్లలు, పెద్దవాళ్లు గుంపులుగా ఒకచోట గొంతుక్కూర్చుని, పళ్లు తోముకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

సన్నగా తలుపుమీద ఎవరో తట్టిన సవ్వడి.

కిటికీ తలుపు మళ్లీ వేసి, వచ్చి తలుపు తీశాడు.

కాశీరామ్... నవ్వుతున్నాడు తమాషాగా.

"హల్లో! గుడ్‌మార్నింగ్" చిలిపిగా అన్నాడు.

చెందూ నవ్వాడు సిగ్గుగా!

కాసేపటికి ఇద్దరూ బయటపడ్డారు ఆ లాడ్జి నుండి.

చెందూకి కాశీరామ్ సహచర్యం గొప్పవరంగా వుంది. చెందూ దృష్టిలో కాశీరామ్ ఒక పెద్ద హీరో అయిపోయాడు.

తనకి తెలియని ఎన్నో విషయాలు కాశీరామ్‌కి తెలుసు.

తనకి ఏమాత్రం పరిచయంలేని గొప్ప ప్రపంచం కాశీరామ్ చుట్టూ వుంది.

అందుకోవాలేగాని, అంతా సుఖమయ అనుభవాలే! రసమయ అనుభూతులే!

అందుకే కాశీరామ్‌తో చనువుగా వుంటున్నాడు చెందూ.

కల్పించుకుని వల్గర్ జోక్సువేసి నవ్విస్తున్నాడు.

అలా బూతుజోకులు వేసుకుంటూ, లేడీస్ గురించి పచ్చిగా మాట్లాడుకుంటుంటే అదోరకమయిన తృప్తి... ఆనందం.

ఇంటికి వెళ్లేసరికి ఎనిమిదయింది. నడిచే వెళ్లాడు.

ఇంటి దగ్గర తండ్రి లేడు. పొద్దున్నే ఎక్కడికో వెళ్లినట్లున్నాడు.

తల్లి కిచెన్‌లో వుంది.

వెళ్లగానే బ్రష్ చేసుకుని, రూమ్ తలుపు బిగించుకుని మంచంమీద పడ్డాడు.

పడుకోవడంతోనే నిద్ర కమ్మేసింది.

అలా ఎంతసేపు పడుకున్నాడో తెలియదు.

పెద్ద పెద్ద శబ్దాలు అవుతుంటే వులిక్కిపడి లేచాడు.

చీకటిగా వుంది.

గ్లాసు తలుపుల్లోంచి బయటి వాతావరణం కన్పిస్తోంది.

దట్టంగా మేఘావృతమై వుంది ఆకాశం. మెరుపులు! వుండుండి వురుములు!

తలతిప్పి గోడగడియారంవైపు చూశాడు.

మధ్యాహ్నం ఒకటిన్నర.

విపరీతమైన ఆకలిగా వుంది... నీరసం.

దానికిమించి బద్ధకం. లేచి కిటికీ తలుపు తీశాడు.

ఒక్కసారిగా, విసురుగా లోపలికి తోసుకువచ్చింది వానగాలి.

శరీరం గజగజా వణికినట్లయింది.

ఆకాశం నల్లగా కాటుక పులిమినట్లుగా వుంది.

ఉన్నట్లుండి గుండెలదిరేలా వురుములు!

చప్పున కిటికీ తలుపువేసి, తలుపుతీసి హాల్లోకి వచ్చాడు.

నిశ్శబ్దంగా వుంది బయట వానహోరు, గాలిజోరు తప్ప.

అలికిడికి రాబోలు లోపలినుంచి శాంతి వచ్చింది.

ఆప్యాయంగా నవ్వి అడిగింది. "ఎక్కడికి వెళ్లావురా! తిండిలేదు, నిద్రాలేదు. ఇలాగ



యితే ఆరోగ్యం ఏంకావాలని?''

చెందూకి చప్పున తలవంచుకోవాలని అన్పించింది.

తల్లి కళ్లల్లోకి సూటిగా చూడాలంటే సంకోచంగా, సిగ్గుగా వుంది.

ఏం చెబుతాడు? ఏమని చెబుతాడు?

తన జీవితంలో తనకు తెలిసిన ఒకేఒక దేవత, ఆరాధ్యదైవం తన తల్లి!

అంతే! మిగతావాళ్లు శత్రువులు.

ఇప్పుడు ఆ దేవతముందు నిల్చున్న తన కాళ్లకింద భూమి కదులుతున్నట్లుగా అన్పించింది.

బలవంతాన నవ్వు పులుముకుని చెప్పాడు.

అయినా మాటలు తడబడ్డాయి.

''రాత్రి రమేష్ వాళ్లింట్లో చదువు పూర్తయ్యే సరికే ఆలస్యం అయింది. ఇక అప్పుడు వచ్చే ఓపికలేక అక్కడే పడుకున్నాను''

అలా చెబుతున్నప్పుడు శాంతి కొడుకు ముఖంలోకి చూసినట్లయితే అతని ముఖంలోని తడబాటును, ఎర్రదనాన్ని, నీలినీడల్ని స్పష్టంగా గమనించివుండేది. కాని పట్టించుకోలేదు. ''సరే! స్నానం చేసిరా ఫ్రెష్‌గా వుంటుంది. భోజనం చేద్దువుగాని''

చెందూ చప్పున కదిలి బాత్‌రూమ్‌లో దూరాడు.

ఎందుకో తల్లితో ఎక్కువసేపు మాట్లాడలేకపోతున్నాడు.

తప్పు చేశానన్న వెరపు వెన్ను తట్టుతూనే వుంది.

వాష్‌బేసిన్ దగ్గర నిలబడి ముఖం కడుక్కుని, ఎదురుగా అద్దంలో చూసుకున్నాడు.

తనేనా!

ఎర్రగా జ్యోతుల్లా వున్న కళ్లు.

చిందరవందరగా వున్న జుట్టు.

పీక్కుపోయిన ముఖం.

ఎంతమార్పు! ఒక్కసారిగా పెద్దవాడయిపోయినట్లనిపిస్తోంది.

ముఖం తుడుచుకుని వెళ్లి, భోజనంచేసి మళ్లీ పడుకున్నాడు.

ఉయ్యాలలా వూగుతూ మళ్లీ నిద్రముంచుకొచ్చింది.

నిద్రపోతూ మగతగా అనుకున్నాడు రాత్రికి బాగా చదవాలని.

కళ్లు మూతలు పడుతుంటే మసక మసగ్గా కనిపించింది కేలండర్, దగ్గర పడుతున్న పరీక్షల్ని గుర్తుచేస్తూ.

ఎన్నో కలలు! ఏవో పిచ్చిఊహలు!

రకరకాల గాజుల హస్తాలు, ఎర్రటి పెదాలు తనని హత్తుకుంటున్నాయి. దగ్గరకు తీసుకుంటున్నాయి.

హఠాత్తుగా ఎర్రటి పెదాలు నల్లగా మసిబొగ్గులా అసహ్యకరంగా అయిపోయాయి.

మళ్లీ ఎవరో తనని దగ్గిరకు లాక్కొని, వూపిరి అందనీయకుండా వుక్కిరి బిక్కిరి చేస్తూ... గాఢంగా ముద్దు పెట్టుకుంటూ...

మెలుకువ వచ్చి, మళ్లీ మగతనిద్ర, మళ్లీ మెలుకువ.

ఈ అవస్థలో సాయంత్రం ఏడింటివరకూ గడిపాడు.

కాసేపటికి పూర్తిగా మెలకువ వచ్చింది.

ఇప్పుడు శరీరం ఎంతో తేలికగా అన్పిస్తోంది.

బయట వర్షం బాగా కురుస్తోంది.

వర్షం కురుస్తున్నా, ఆకాశంలో మబ్బులు లేవు. చంద్రుడు కన్పిస్తున్నాడు.

వెన్నెల దారాల్ని పెనవేసుకుని రాలుతున్న వెండితీగల్లా వున్నాయి వాన చినుకులు.

దూరంగా ఎక్కడో షెహనాయ్ వినిపిస్తోంది.

బిస్మిల్లాఖాన్ షెహనాయ్...

ఆ సమయంలో, చల్లటి ఆ ప్రశాంత వాతావరణంలో, దూరంనుండి విన్పిస్తున్న ఆ రాగం ఎంతో వినసొంపుగా, ఆహ్లాదకరంగా, హాయిగా వుంది.

కాసేపు అలాగే కూర్చుండిపోయాడు చెందూ.

నెమ్మదిగా లేచి హాల్లోకి వచ్చాడు.

తండ్రి లేడు. తల్లి ఒక్కతే సోఫాలో కూర్చుని




వైర్‌బాగ్ అల్లుతోంది.

కొడుకుని చూసి పలకరింపుగా నవ్వి, మళ్ళీ తన పనిలో పడిపోయింది.

వెళ్ళి స్నానంచేసి, పైజామా లాల్చీ వేసు కుంటే ఎంతో ఫ్రీగా, వుల్లాసంగా వుంది.

శాంతి వేడివేడిగా పొగలు కక్కుతున్న టీ తెచ్చి ఇచ్చింది.

టీ తాగి, ఈసారి సిన్సియర్‌గా టెక్ట్స్‌బుక్ చేతిలోకి తీసుకున్నాడు.

చదివి చాలారోజులయిందేమో, ఓపట్టాన కొరుకుడు పడడంలేదు.

అయినా మనసు లగ్నం చేయడానికి ప్రయ త్నించాడు.

అదో విధమైన శబ్దంతో జల్లుగా కురుస్తున్న వాన!

సుదూరతీరాలకు తీసుకువెళ్తున్న షెహ నాయ్ రాగవీచికలు!

మళ్ళీ మత్తు!

పేజీలు... అక్షరాలు అల్లుకుపోయినట్లుగా అవుతున్నాయి.

వాటి స్థానంలో... రకరకాల దృశ్యాలు...

నగ్నంగా పడుకున్న యువతి... ఆమె పక్కనే తను...

మనసు మత్తుగా మూలిగింది.

తీయటిబాధ రెపరెపలాడుతూ, నాలుకలు జాపుకుంటూ గుండెల్లో జ్వాలల్ని సృష్టిస్తోంది.

అంతే!

ఇక చెందూ వశంకాలేదు.

పుస్తకం అప్రయత్నంగా పక్కకు జారిపో యింది.

అలాగే వెనక్కి వాలిపోయి, పైన తిరుగుతు న్న సీలింగ్‌ఫాన్‌వైపు చూస్తుండిపోయాడు.

ఏవో ఆలోచనలు... కోర్కెలు.

సీలింగ్‌ఫాన్ రెక్కల్లో... రెక్కలు మత్తుగా విచ్చుకుంటున్న ఓ సుందర రూపం.

మనసు వూగిసలాడుతోంది.

ఆ అనుభవం కోసం తహతహలాడుతోంది.





తప్పని తెలుసు! తను విషవలయంలో కూరుకుపోతున్నాడని తెలుసు!

అయినా ఆవేశం అన్నింటినీ దిగమింగే స్తోంది.

అతను వశం తప్పుతున్న మనసును కంట్రోల్ చేసుకోలేకపోతున్నాడు.

ఆఖరుకి ఒక నిర్ణయానికి వచ్చాడు.

తప్పదు!

కాశీరామ్ దగ్గరకు వెళ్ళాలి!

ఒక్క ఉదుటన లేచి, పాంటు జేబులో వున్న పర్సు తీశాడు. నాలుగైదు చిల్లర కాగితాలు ఉన్నాయి. అయినా పెద్దగా పట్టించుకోలేదు.

ఆ పర్స్ పైజమా జేబులోకి తోసి బయటకు వచ్చాడు.

బయట వర్షం విపరీతంగా ఉంది.

అదేమీ లెక్క చేయలేదు! లోపల నుండి తల్లి ఏదో అంటోంది కానీ పెద్దగా పట్టించుకోలే దు. ఆ వర్షంలోనే బయలుదేరాడు.

చల్లటి వాతావరణంలో వేడి కౌగిలిలో శరీరా న్ని సేదతీర్చేందుకు...

నడుస్తున్నాడు.

తడవాలి! బాగా తడవాలి!

వేడి ఆలోచనలతో... ఉడుకెత్తే రక్తంతో... బిగించిన గుప్పిళ్ళతో... ఆవేశంతో... ముందుకు సాగుతోంది... మనస్సు, శరీరం.

వడివడిగా...వేడివేడిగా... వర్షాన్ని సైతం లెక్క చేయకుండా... గబగబా నడుస్తున్న చందూ...

బిగించిన గుప్పిళ్ళలో ఉన్నది... సంఘంలోని చీడపురుగుల్ని ఏరివేయాలనే పట్టుదల కాదు...

అంగనల అంగాంగాలనూ పట్టి పట్టితడ మాలనే ధృడ నిశ్చయం.

ఉరకలు వేస్తున్న ఆ రక్తంలో ఉన్నది.. దుష్టశిక్షణ చేయాలనే ఆవేశం కాదు. బిగికౌగి ళ్ళలో నలిగిపోవాలనే తపన...

వడివడిగా పడుతున్న ఆ అడుగులలో ఉన్నది... చెడును, కుళ్ళును కాలరాయాలని కాదు... మార్ఫియా, హెరాయిన్, ఎల్.ఎస్.డిల విందులో స్వర్గారోహణ చేయాలనే ఆశ...

వర్షం పడుతూనే ఉంది... ధారలు ధారలుగా... జల్లు జల్లులుగా!

పూర్తిగా తడిసిపోయాడు!

కానీ చిత్రం! చలి వేయడం లేదు!

శరీరం పొగలు, సెగలు కక్కుతోంది.

కాశీరామ్ రూమ్‌దగ్గరికి వచ్చాడు. మనసు ఉరకలు వేస్తోంది.

పైకి వెళ్ళి, రూమ్ చేరగానే ఒక్కసారిగా వడగాడ్పు కొట్టినట్లయింది అంత చల్లదనంలోనూ!

రూమ్‌కి తాళం వేసి వుంది!

ఒక్కసారిగా, కసి, నిస్సహాయతా పెనవేసుకుని పెల్లుబికాయి.

కసిగా ఒక్క తన్ను తన్నాడు ఆ తలుపు మీద!

పాలపొంగు మీద నీళ్ళు చిలకరించినట్లయింది.

హఠాత్తుగా అపుడు మొదలయింది తడిసిన శరీరంలోనుండి చలి!

పోనీ! తానొక్కడూ వెళితే అక్కడికి?

ఊహు! లాభం లేదు. డబ్బుచాలదు! కాశీరామ్ ఉంటే ఇలాంటి ప్రాబ్లమ్ వచ్చేది కాదు.

నీరసంగా క్రిందకి దిగివచ్చాడు చందూ!

ఇక ఒక్క అడుగుకూడా వేయబుద్ధి కాలేదు!

రిక్షా ఎక్కి ఇంటికి వచ్చేసాడు!

పూర్తిగా తడిసి ఇంటికి వచ్చిన కొడుకుని ఆశ్చర్యంతో చూస్తూ అడిగింది శాంతి.

"అదేమిటి! అపుడే వచ్చేశావేం? ఇపుడేగా వెళ్ళింది!"

"రమేష్ ఇంట్లో లేడు!" అలవాటు పడిన నాలిక తేలిగ్గా అబద్ధం ఆడేసింది.

★ ★ ★

వర్షంలో బాగా తడవడంవల్లనేమో, మర్నాటికి బాగా జలుబు చేసింది. వళ్ళు కూడా కొంచెం వేడిగా ఉంది.

చందూ దుప్పటి కప్పుకుని అలాగే పడుకుని ఉండిపోయాడు.

ఆ రోజు అన్నం తినలేదు.

రాత్రికి జ్వరం వచ్చింది.

శాంతి కంగారు పడిపోయింది.

సమయానికి భర్తలేడు ఇంట్లో! ఒక వేళ ఉన్నా పట్టించుకోడు. అది వేరేసంగతి! సుబ్రమణ్యానికి కబురు చేసింది.

ఆయన వచ్చి డాక్టరును పిలుచుకు వచ్చాడు.

రెండు రోజులకి టెంపరేచర్ కాస్త నార్మల్‌కి వచ్చింది.

దీనితో బయటకు వెళ్ళి కొన్ని సంవత్సరాలయినట్లనిపిస్తోంది. దానికి తోడు నీరసం!

పరీక్షలు అతి దగ్గరలోకి వచ్చేశాయి!

నెమ్మదిగా ఓపిక తెచ్చుకుని, అతికష్టం మీద చదవసాగాడు.

చదువుమీద కాన్‌సన్‌ట్రేషన్ కుదరడం లేదు.

ఏవేవో ఆలోచనలు.

దరిద్రపు ఎగ్జామ్స్!

మధ్యలో ఇపుడే తగలడాలా? సరదాగా అలా తిరిగేందుకు లేదు! బొత్తిగా కట్టిపడేసినట్లయింది.

మహా విసుగ్గా ఉంది. అయినా చదవాలి. తప్పదు!

ఒక నిర్ణయానికి వచ్చాడు!

ఎలాగయినా ముక్కుమూసుకుని ఆ నాల్గు రోజులూ వెళ్ళమారిస్తే మిగతాదంతా.. రంగులమయమే!

అందుకనే బలవంతాన చదవడం మొదలెట్టాడు!

మధ్య మధ్య కందిరీగల్లా ఆలోచనలు జొరబడుతున్నా విశ్వప్రయత్నం మీద మనసు చదువుమీద లగ్నంచేస్తున్నాడు.

పరీక్షలు వచ్చేసాయి!

అందరికళ్ళల్లో ఒక విధమయిన టెన్షన్!

చందూకి అవేమీ పట్టలేదు. అతని మనసంతా పరీక్షల తర్వాత తను గడపబోయే రోజులగురించి ఆలోచిస్తోంది.

లాంగ్వేజెస్ ఎలాగో అయిందనిపించాడు.

గ్రూప్ సబ్జెక్ట్స్ అంతంతమాత్రం!



ఆఖరుపరీక్షరోజునమాత్రం..

మామూలుగానే తలవంచుకుని వ్రాస్తున్నాడు. తెలిసింది తక్కువ! ఆలోచనలు అమోఘం!

అందుకే తెల్లకాగితం నలుపుచేయడమే ధ్యేయంగా పెట్టుకుని చక చకా వ్రాస్తున్నాడు.

అలా వ్రాస్తున్నవాడల్లా...

ఒక్కసారిగా ఎగిరిపడ్డట్టయ్యాడు.

ఏమిటి? ఏమయింది!

కడుపులో ఒక్కసారిగా చురుక్కుమన్న బాధ!

కాసేపటికి మొదలయింది అసలయిన బాధ!

పొత్తికడుపులో... నరాలు మెలి తిరుగుతున్నట్లు... బొడ్డుచుట్టూ ప్రేగులు ఉండలుచుట్టుకుపోతున్నట్లు...

ఆ నొప్పికి అతని శరీరం తట్టుకోలేకపోయింది.

నుదురు అంతా చెమటలు పట్టాయి.

కడుపు చేత్తో పట్టుకుని కాసేపు అలాగే ఉండిపోయాడు. పెదవి బిగపట్టి బాధను దిగమ్రింగటానికి విశ్వప్రయత్నం చేశాడు.

అయిదు నిముషాల తర్వాత పోట్లు కొంచెం తగ్గాయి.

ఉన్నట్లుండి అలా కడుపులో నొప్పి ఎందుకు వచ్చిందో అర్థంకాలేదు.

బహుశ వేడిచేసి అయి ఉండవచ్చు!

ఈమధ్య తను రాత్రనక, పగలనక చదివాడాయెను!

మనసు తాత్కాలికంగా ఉపశమించింది.

పరీక్షలయిపోయిన వారంరోజులకి కాంతి వచ్చింది. ఇంట్లో ఎవరూ లేరు, ఒక చందూ తప్ప!

ధనుంజయరావు ఈ మధ్యన బిజినెస్ వ్యవహారాలలో బాగా బిజీగా ఉంటున్నాడు.

శాంతి గుడికి వెళ్ళింది.

చందూ తన రూమ్‌లో డిటెక్టివ్ నవల చదువుకుంటూ పడుకున్నాడు.

కాంతిని చూస్తూనే సన్నగా నవ్వి విజిల్‌వేసి "హలో!" అంటూ లేచాడు.

కాంతి నవ్వింది స్నేహపూర్వకంగా.

చదువుతున్న పుస్తకం పక్కనపడేసి లోపలికి ఆహ్వానించాడు. కాంతివచ్చి కూర్చుంది. చందూ కిచెన్‌రూమ్‌లోకి వెళ్ళి ప్లేటునిండా బిస్కెట్స్ తీసుకువచ్చి కాంతిముందర పెట్టాడు.

కాంతి చనువుగా నవ్వుతూ అంది. "బాగుంది! ఏమిటీమర్యాద!"

"మరి? ఇంట్లో ఎవరూ లేరని - మానేస్తానా ఏమిటి?"

"సంతోషించాంకానీ, ఎగ్జామ్స్ తర్వాత అసలు కన్పించనేలేదు. ఎలా వ్రాసావు?"

హఠాత్తుగా చందూ మౌనం దాల్చాడు! అంతలో తేలిగ్గా నవ్వేస్తూ అన్నాడు.

"అక్టోబరుకి బెటరుమెంట్ కట్టాలనుకుంటున్నాను."

"చందూ! నువ్వు మొదటినుండి శ్రద్ధగా చదివి ఉన్నట్లయితే ఈ పరిస్థితి వచ్చి ఉండేదికాదు!"

చందూకి ఆ సంభాషణ ఇబ్బందిగా ఉంది.

టాపిక్‌మారుస్తూ "తర్వాత ఏం చేద్దామనుకుంటున్నావు?" అని అడిగాడు.

"ఏముంది? వంట చేద్దామనుకుంటున్నా" ఎగతాళిగా నవ్వుతూ అంది.

చందూ నవ్వాడు... నవ్వుతూ చాలా క్యాజువల్‌గా తల తిప్పాడు.

కాంతికి కుడివైపుగా ఉంది నిలువుటద్దం!

చందు చూపులు హఠాత్తుగా ఆగిపోయాయి ఆ అద్దంమీద!

పక్కగా, సైడ్‌పోజులో కాంతి శరీరంలోని ఒంపుసొంపులు స్పష్టంగా కన్పిస్తున్నాయి అద్దంలో!

నిద్రిస్తున్న గాలితరంగం.. ఒళ్ళు విరుచుకుని లేవసాగింది.

చుట్టలు చుట్టుకుని పడుకున్న కోర్కె నెమ్మదిగా పడగవిప్పుతోంది.

చందూ తలతిప్పాడు కాంతివైపు.







చందూ చూపుల్లోని మార్పుని కనిపెట్టింది కాంతి.

ఇంతక్రితంలా ఆ చూపుల్లో స్నేహభావం లేదు. అమాయకత్వంలేదు.

అదోవిధమయిన ఆకలి... చురుకుదనం...

వలవిసురుతున్నట్టు... పంజా విసురుతున్నట్లున్నాయి ఆ చూపులు.

ఒకటిమాత్రం నిజం!

ఒకప్పటి చందూకి, ఇప్పటి చెందూకి చాలా తేడాఉంది. మనిషిమాట, తీరులో ఏదో చెప్పలేని మార్పు.

ఇంతక్రితం పసితనంపోని, అమాయకంగా ఉండే మాటలు, ఇపుడు కొత్తగా, ద్వంద్వార్థాలతో నిండి ఉంటున్నాయి. చూపు

ల్లో చురుకు పాలు హెచ్చింది.

చందూ నవ్వాడు అదోలా!

కాంతిమనసులోనే ఉలిక్కిపడింది.

నుదుటిమీదకి పడ్డ జుట్టుని తలఎగరేసి సర్దుకుని, బిస్కెట్స్ఉన్నప్లేట్ని కాంతిదగ్గరకు జరిపి "తీసుకో కాంతీ! ఏమిటి, ఆలోచిస్తున్నావు?" అన్నాడు.

"ఊహూ! ఏంలేదు!"

ఇంకా జరిపాడు ప్లేటుని. కాంతి చేతికి అతిచేరువగా! తనవేళ్లు కాంతిచేతికి ఆనించేటంత దగ్గరగా!

చప్పున లేచి నిల్చుంది కాంతి! ముఖంలో అదోరకమయిన భావం తళుక్కునమెరిసి మాయమయిపోయింది.

బయట ఆటో ఆగినశబ్దం విన్పించింది. మరి కాసేపట్లోనే శాంతి వచ్చిందిలోపలికి! హఠాత్తుగా తల్లిరాకనచ్చలేదు చందూకి! అయిష్టంగా ముఖం చిట్లించాడు.

శాంతి కాంతిని చూసి పలకరింపుగా నవ్వి "ఎంతసేపయింది వచ్చి?" అడిగింది.

"ఇపుడే! చందూ ఎగ్జామ్స్ ఎలావ్రాసాడో కనుక్కుందామని!"

"వాడిమొహం!" నవ్వేసి లోపలికి వెళ్లింది శాంతి.

ఓ అయిదు నిముషాలు కూర్చుని కాంతి కూడా లేచింది. వెళ్ళేటపుడు చందూకి చెప్పలేదు.

కానీ ముఖం అప్రసన్నంగా ఉంది.

చేదుమింగినట్లుగా ఉంది.

ఇన్నాళ్లూ... చందులో ఒక అమాయకపు స్నేహితుడిని చూసింది.

కానీ—

ఇపుడు... ఆకలిచూపులతో ఉన్న ఓమగవాడిని చూస్తోంది.

ఎంతమారిపోయాడు?

వయసుతెచ్చిన మార్పా? లేక- ఇంట్లో పరిస్థితులు నెట్టిన కొత్తచేర్పా?

ఎందుకో చెందూ మీద కోపంగా లేదు.

జాలిగా ఉంది.

చెడిపోతున్నాడని సానుభూతిగా ఉంది.




ఈ మధ్య కాలంలో చెందూలో చాలా కొత్తగుణాలు అలవడ్డాయి.

కాశీరామ్ కోసం చాలాసార్లు వెళ్లాడుకాని, ఎపుడువెళ్ళినా రూమ్తాళం వేసిఉండేది. రమేష్ కూడా ఊళ్ళోచాలాతక్కువగా ఉంటున్నాడు. కాశీరామ్ అసలు ఉన్నాడో తెలియదు రూమ్ఖాళీచేసి వెళ్ళాడో తెలియదు.

అందుకే,

ఒంటరిగానే వేటాడాలని నిశ్చయించుకున్నాడు.

కానీ...డబ్బు!

ఎవరిస్తారు? ఎందుకిస్తారు?

డాడీని అడిగితే?

ఒకప్పటి సంఘటన గుర్తుకొచ్చింది. డాడీ డబ్బెందుకని అడిగితే...

సుఖం కొనుక్కోడానికని చెప్పాడు తాను!

అపుడు సరదాగా అన్నా...ఇపుడు నిజమే అయింది.

కానీ...ఎలా?

హఠాత్తుగా మధ్యఇంట్లో బీరువాగుర్తుకొచ్చింది.

ఆ బీరువాలోని మధ్యఅర గుర్తుకొచ్చింది.

అందులోని...

ప్రతిదీపావళికి మమ్మీ వెలిగించే వెండి కుందులు గుర్తుకొచ్చాయి.

దొంగతనం!

శరీరం ఝల్లుమంది.

కాని...అదిక్షణికం మాత్రమే!

కొత్తఆలోచన... పురుగులా... పుట్టగొడుగులా...

నిజమే... ఎప్పటికయినా ఆస్తంతా తనదే... వెండికుందులేంఖర్మ... బంగారపుపళ్ళాలన్నీ తనవే... అలా సమర్థించుకునేసరికి కాస్తమనసు కుదుట పడింది.

ఆరోజు మధ్యాహ్నం...

ఇంట్లో మమ్మీపనిలో ఉన్నప్పుడు...

పిల్లిలా జొరపడ్డాడు ఆమధ్యగదిలోకి! బీరువా తలుపులు తీస్తుంటే చేతులు వణికాయి. గుండె గుబగుబలాడింది.

వెండికుందులు చప్పున చేతిలోని టవల్‌తో చుట్టేసి తనరూమ్‌లోకి తీసుకెళ్ళి మంచంక్రిందకు తోసాడు.

అపుడుకానీ మనసు కుదుటపడలేదు!

వేగంగా కొట్టుకుంటున్న గుండెస్పీడు కొంచెంతగ్గసాగింది. చెమట తుడుచుకుంటూ "హమ్మయ్య" అనుకున్నాడు.

...అంతలోనే...

ఉలిక్కిపడ్డాడు!

ఒక్కసారిగా ఎగిరిపడ్డట్లయ్యాడు మంచంమీద!

మళ్ళీ పోట్లు...

పొత్తి కడుపులో...

కాలుతున్న ఇనుపచువ్వ పెట్టి గిరగిర తిప్పుతున్న బాధ!

నరాలన్నీ ఉండలు చుట్టుకు పోతున్నట్లుగా...

గుండెలో భయంకరమయిన మంట!

ఆ నొప్పి ఎంతగా వచ్చిందంటే... కాసేపటి వరకూ ఊపిరి అందలేదు!

ఏమిటిది?

ఆలోచించలేక పోయాడు!

మంచం మీద వెనక్కి వాలిపోయాడు.

అయిదు నిమిషాలకు తగ్గింది ఆ ఉధృతం!

కాసేపటి వరకు అలాగే పడుకుని కళ్ళు మూసుకుని ఉండిపోయాడు.

పది నిముషాల తర్వాత రెండు గ్లాసుల నీళ్ళు త్రాగాడు!

ఆ రాత్రి...

షాంపూతో తల స్నానం చేసి బయలుదేరాడు!

చందూ చేతిలో చిన్న జిప్‌బాగ్ ఉంది.

అపుడపుడు చెందూ ఆ బేగ్ తీసుకెళ్ళడం మామూలే!

అందుకే చెందూ చేతిలో జిప్‌బేగ్ చూసినప్పుడు శాంతి అనుమానించలేదు.

అందులో వెండి కుందులు ఉన్న సంగతి తెలియదు.

ఇపుడే కాదు. కొన్ని నెలల వరకూ తెలియదు.

ఎందుకంటే- దీపావళి ఎపుడో ఎనిమిది నెలలకి!

బయట-

మార్వాడీ కొట్లో కుందులు మార్చాడు!

మరి కాసేపట్లో చీకటి గదిలో... తెల్లటి పరుపుమీద... ఓ యువతిని పెనవేసుకుని పడిఉన్నాడు.

ఆ క్షణంలో చెందూకు కాంతి గుర్తుకు వచ్చింది.

కాంతి శరీరం మరీ మరీ గుర్తుకు వచ్చింది.

ఆ యువతిలో కాంతి కన్పిస్తోంది తనకి! ముఖం కాంతి విహీనంగా ఉన్నా!

మధ్యలో సన్నగా పలవరించాడు "కాంతీ! కాంతీ!"

"నాపేరు కాంతి కాదు! చంద్రమతి!" సన్నగా గొణిగింది ఆమె!

నవ్వాడు! "నీకు అర్థంకాదు!"

రెండో అనుభవం కొత్తగా అన్పించలేదు.

ఎందుకో వెగటుగా అన్పించింది.

★ ★ ★

రెండు నెలల్లోనే రిజల్ట్సు వచ్చేశాయి.

చందూ తప్పాడు! కాంతికి ఫస్ట్‌క్లాస్ వచ్చింది.

చందూ అది ఊహించిందేకాబట్టి పెద్దగా బాధపడలేదు!

ఆ వార్త వినగానే శాంతి చిన్నగా నిట్టూర్చింది!

కాని చిందులు తొక్కింది ధనుంజయరావే!

"రాస్కెల్! ఏడీ వెధవ! చాలా గొప్పగా చదివానని గొప్పగా పోజులు కొట్టాడే! అపుడు అడిగితే అన్ని నీతులు చెప్పాడే! ఏడీ! సిగ్గులేదూ! తోటి ఫ్రెండు, ఆడపిల్ల ఫస్టుక్లాసులో పాసయితే ఏం మొహంపెట్టుకుని తిరుగుతున్నాడు. అదే ఇంకొకరయితే ఏ లారీకిందో, రైలుకిందో తలపెట్టి ఉండేవారు!"

"సరే ఊర్కోండి! ఏమిటామాటలు! అసలే పరీక్షపోయి వాడు బాధపడుతుంటే మీరేమిటి మధ్యలో!" శాంతి శాంతింపచేయడానికి ప్రయత్నించేకొద్దీ రెచ్చిపోసాగాడు.

లోపల గదిలో, మౌనంగా మంచంమీద కూర్చుని ఉన్నాడు చందూ!

తండ్రి రంకెలు అన్నీ చెవుల్లో మార్మోగుతున్నాయి.

అయినా పెదవి విప్పటంలేదు.

బుసలు కొడ్తున్న ఆవేశాన్ని మునిపంటితో పెదవి కొరుకుతూ ఆపేశాడు!

కళ్ళుతడి అయ్యాయి కూడా!

మనసులో ఏ మూలోమథన!

'చదివి ఉంటేపాసయ్యేవాడేమో! ఇన్ని మాటలు పడాల్సిన అవసరం ఉండేది కాదేమో!'

"ఛీ! ఎంతసిగ్గుగాఉంది! మీవాడికి ఏంక్లాసని తోటివాళ్ళు అడుగుతుంటే తలబద్దలుకొట్టుకు చావాలన్నంత కసిగా ఉంది! అసలు... ఏనాడయినా చదివి ఏడిస్తేనా? వెధవ తిరుగుళ్ళూ... వీడూనూ! ఎపుడూ సినిమాలు... షికార్లూ... ఫ్రెండ్స్... రేడియోలూ... క్రికెట్‌లూ... అదేమంటే పౌరుషం... ఎదిరించడం. ఛీ... మనిషయితేగా? సిగ్గుంటేగా? ఎందుకు తిండి దండగ... ఏ లేనివాడికో కాస్త తిండిపెట్టినా... తిని బుద్ధిగా చదువుకుని పైకివస్తాడు. వీడికి ఆ జ్ఞానం ఉంటేగా! ఏనాడయినా పుస్తకం పట్టుకుని ఏడ్చాడా? ఇంక పనేముంది? హాయిగా ఇంట్లో వంట చేస్తూ కూర్చోమను! నీకు తోడుగా ఉంటాడు!"

చందూ రూమ్‌వైపు మిర్రి మిర్రి చూస్తూ అరిచాడు.

చందూకి ఇక కన్నీళ్ళు ఆగలేదు.

జల జలా రాలిపోయాయి. గొంతులో బిగబట్టిన వెక్కిళ్ళు ఒక్కసారిగా బయటపడ్డాయి.

తండ్రి మీద కాదు.

తనమీదే కోపం... తనమీదే కసి...

నిజమే! డాడీ అన్న దాంట్లో తప్పేముంది? తిండి దండగ. ఇన్ని మాటలు పడి ఇంక బ్రతకడం వేస్టు!

అసలు రేపు ఫ్రెండ్స్‌కి ముఖం ఎలా చూపించాలి? ఆవేశం తన్నుకు వస్తోంది.

ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎర్రబడ్డాయి. ముక్కుపుటాలు అదరసాగాయి.

శాంతి మధ్యలో కల్పించుకోలేదు. కల్పించుకునే కొద్దీ రెచ్చి పోతారన్న సంగతి తెలుసు.

మౌనంగా వుండిపోయింది.

ఆరోజు చందూ భోజనం చేయలేదు.

ధనుంజయరావు కోపంగాతిని విసురుగా చేతులు కడుక్కుని వెళ్ళిపోయాడు. శాంతి కంచంలో అన్నం కలుపుకుని కొడుకు గదిలోకి వెళ్ళింది.

చాలాసేపు బ్రతిమాలిన తర్వాత కాస్త తిన్నాడు.

రెండు రోజుల వరకూ అసలు బయట ప్రపంచం చూడలేదు.

మౌనంగా ఆలోచిస్తూ వుండిపోయాడు.

ఇంట్లో కూడ ఎవరితోనూ మాట్లాడలేదు.

తల్లి పలకరించినా ముక్తసరిగా సమాధానం చెప్పసాగాడు.

కొత్త ఆలోచనలు. ఆలోచనలు!

గొలుసుల్లా...

నిజమే! ఇక తను ఈ ఇంట్లో వుండలేడు. చచ్చే ధైర్యం ఎలాగూలేదు. కాని ఈ ఇంట్లో వుండటం అసాధ్యం!

వెళ్ళాలి! ఎక్కడికో వెళ్ళిపోవాలి!

తను వెళ్ళిపోతే... తన కోసం... డాడీ ఏడవాలి... కుళ్ళి కుళ్ళి ఏడవాలి. చేసిన తప్పేమిటో తెలుసుకుతీరాలి... తనులేని లోటేమిటో

తెలిసిరావాలి. అపుడుకాని తన కసితీరదు. వగ చల్లారదు.

వగ!!

అన్నట్లు ఒక్కడే ఎక్కడికి వెళతాడు?

తనకో తోడు కావాలి. తోడు జోడు.

క్రాంతి పథంలో...

అన్నట్లు -

కాంతి!!

నిజమే! కాంతి!

ఇవుడు చందూ మనసులో కొత్త ఆలోచన రూపుదిద్దు కుంటోంది.

ఆవేశం, కసి, ఆలోచనకు నీళ్ళు పోసాయి!

అసలు ఆ ఆలోచనే థ్రిల్లింగ్‌గావుంది. ఒక ఎడ్వెంచర్‌లావుంది.

నిజమే! ఎన్ని సినిమాలలో చూడటంలేదు?

కాకపోతే కొన్నాళ్ళు కొత్త! తర్వాత అన్నీ అవే సర్దుకుంటాయి.

అంతేకాదు.. కాంతితో కలిస్తేసరి.

తనకు చాలారోజుల నుండి పరిచయం కాంతి.

తన మాటకాదనదు! ఆ కళ్ళల్లో స్నేహమేకాదు, ప్రేమ కూడ వుంది తన మీద. భయంతో బయటపడటం లేదుగాని, తనను ప్రేమిస్తోంది. లేకపోతే తనతోపాటు పార్కులకు, పికార్లకు ఎందుకు వస్తుంది?

ఇక పరీక్షలు కూడ అయిపోయాయి.

ఈపనివల్ల వాళ్ళకి చాలా భారం తగ్గించిన వాడవుతాడు తను.

ఆఖరుకి ఒక ధృఢ నిశ్చయానికి వచ్చాడు చందూ! లేచి పేపరు, కలం తీసుకుని లెటర్ వ్రాయటం మొదలెట్టాడు.

నిజానికి కాంతితో ముఖాముఖి మాట్లాడదామనుకున్నాడు.

కాని కాంతి ఎదుట—అనుకున్నవి అనుకున్నట్లుగా చెప్పలేడు. అంతేకాదు.. ఇలా లెటర్ రూపంలో అయితే తన ఆలోచనలు స్పష్టంగా చెప్పే అవకాశముంది.

పదమూడు కాగితాలు చింపేసిన అనంతరం...

పదునాలుగో కాగితం చదివి నిట్టూర్చాడు గట్టిగా.

ఆలెటర్, కవర్‌లోపెట్టి సంతృప్తిగా తలాడించాడు. కాంతి అడ్రస్‌రాసి అప్పటికపుడు వెళ్ళి పోస్టులో వేశాడు.

పోస్టుచేసి వస్తుంటే...

అపుడు మళ్ళీ కొత్త ఆలోచన...

తను తొందర పడటంలేదుకదా?

ఊహూ! లేదు. కాంతి తనను తప్పకుండా అర్థంచేసుకుంటుంది. తను చేస్తున్న పనిని మెచ్చుకుంటుంది. తనకి జీవితాంతం చేయూత నిస్తుంది. తనని మోసగించదు.

ఇలా సర్ది చెప్పుకున్నాక మనసు అపుడు కాస్త కుదుటపడ్డది.

కాంతికోసం రెండు రోజులు తీవ్రంగా ఎదురు చూసాడు.

కాంతి నుండి ఎలాంటి సమాధానమూ రాలేదు, కాంతి కూడా రాలేదు.

తనే వాళ్ళింటికి వెళదామనుకుని మళ్ళీ ఆప్రయత్నం విరమించుకున్నాడు.

ఈ రెండు రోజులూ కాంతి గురించిన ఆలోచనలతోనే గడిపాడు.

అదేం విశేషమో, సాధారణంగా కాంతి ఎపుడువచ్చినా ఇంట్లో ఎవరూ ఉండరు.

తండ్రి ఇంట్లోలేడు. తల్లి మార్కెట్‌కి వెళ్ళింది.

చందూ ఒక్కడే ఉన్నాడు రూమ్‌లో!

ఈమధ్యన బయటికి వెళ్ళడం కొంత తగ్గించాడు.

కాంతిని చూడగనే ఒక్కసారిగా చందూ ముఖం వేయి క్యాండిల్స్ బల్బులా వెలిగింది.

ఒక్కగెంతులో మంచంమీద నుండి గెంతి కాంతి ఎదురుగా వచ్చాడు.

"రా కాంతీ! నా రూమ్‌లోకి వెళ్దాంరా!"

కాంతి ఒకసారి మౌనంగా కనురెప్పలు ఎత్తి చెందూ వైపుచూసి తల అడ్డంగా తిప్పింది.

"ఇక్కడే కూర్చుందాం"!





"ఇక్కడా!" అయిష్టంగా అన్నాడు.

"అంత రహస్యాలు మాట్లాడు కోవాలా మనం!"

"అహా! అదికాదు..." తడబడినట్లుగా వచ్చాయి మాటలు.

కాంతి సోఫాలో కూర్చుంది.

చందూ కాంతికి ఎదురుగా టీపాయ్‌మీద కూర్చున్నాడు.

రెండు నిముషాలసేపు ఆహాల్లో భయంకర మయిన నిశ్శబ్దం రాజ్యం చేసింది.

చందూ ఓరగా చూసాడు కాంతివైపు. చిన్నగా దగ్గాడు.

"కాంతీ!"

"ఊ!"

"మాట్లాడాలి"

"ఏం మాట్లాడాలి?"

"అదే... అదే... నేను వ్రాసిన లెటర్ అందిందా?"

"అందింది!"

"మరి వెంటనే ఏ సంగతీ చెప్పలేదేం? నా సహనానికి పరీక్షా?"

"కాదు!"

"మరి?"

కాంతి సమాధానం చెప్పలేదు. సూటిగా చందూ కళ్ళల్లోకి చూసింది.

చందూనవ్వాడు అదోలా!

"కాంతీ! మరి నీ అభిప్రాయం?"

"దేన్ని గురించి?"

"అదే! నాతో వస్తావనే అనుకుంటున్నాను!"

"లేదు! రావడంలేదు!" నిర్లిప్తంగా అన్నది.

దెబ్బతిన్నట్లుగా చూసాడు. ఒక్కసారిగా అగాధాలలోకి జారిపోతున్నట్లు, ఆకాశ హర్మ్యాలు కూలిపోతున్నట్లు అన్పించింది.

"కాంతీ! ఏమిటి...ఏమిటి నువ్వంటున్నది?" పెదవులు వణుకుతుంటే అన్నాడు.

"చందూ! ఈ సంగతి మాట్లాడటానికే వచ్చాను. నువ్వు ఎప్పటినుండో పరిచయం. అయినా ఇపుడు నిన్ను చూస్తుంటే నవ్వు వస్తోంది! జాలివేస్తోంది చెందూ! ఎంత చిన్న పిల్లాడిలా ప్రవర్తించావు? ఎంత ఎదిగీ ఎదగని ఆలోచనల మధ్య కొట్టుమిట్టాడుతున్నావు? ఓకే! సరే! వెళ్ళిపోతాం... ఐమీన్... వెళ్ళిపోతావు! కాని ఎలా బ్రతుకుతావు? కాస్త ఆవేశం తగ్గించుకుని ఆలోచించు."

"ఆవేశం కాదు కాంతీ! బాగా...బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. వీళ్ళమధ్య ఈ రాక్షస నిలయంలో నేను ఉండలేను. ఉన్నా సుఖంగా బ్రతకలేను. నాకు స్వేచ్ఛలేదు... స్వాతంత్ర్యంలేదు... కానీ—కానీ కాంతీ! ఇంత మంది మధ్య కరుడుకట్టిపోయిన నా హృదయం కేవలం నిన్ను చూస్తేనే స్పందిస్తుంది. ఆస్పందనకి అర్థం ఏమిటో నా కంటే నీకే బాగా తెలుసు. వీళ్ళమధ్యన ఉంటూ నిన్ను నేను దక్కించుకోలేను. అందుకే, ఈ విశాల ప్రపంచంలోకి..."

పకపకా నవ్వింది కాంతి! కళ్ళవెంబడి నీళ్లొచ్చేలా పడీపడీ నవ్వింది. సోఫాలో జారిగిల పడిమరీ నవ్వింది.

చందూకి ఉక్రోషంతో ముఖం ఎర్రబడింది.

"నా ఆవేశం, నా ఆవేదన నీకు ఎగతాళిగా ఉందా కాంతీ!"

నవ్వు కంట్రోల్ చేసుకుంటూ అంది "ఊహు! లేదులే! చెప్పు! అయితే ఈ విశాల ప్రపంచంలోకి చెట్టాపట్టాలేసుకుని లేచిపోదామంటావు. అంతేనా?"

"నీయిష్టం! ఎలాగైనా అనుకో! కాని నన్ను అర్థం చేసుకో!"

"చందూ! ఈ మధ్యతెలుగు సినిమాలు చూసిచూసి నీకు నిజంగా పిచ్చి ఎక్కింది. కాస్త నేలమీద నిలబడి ఆలోచించడం నేర్చుకో! లేచిపోవడమంటే అదేదో గొప్ప థ్రిల్లింగ్‌గా ఎడ్వెంచర్‌లా ఊహించుకోకు! ఆ తర్వాత బ్రతుకునువ్వు ఊహించలేవు. డ్యూయట్లు పాడుకుంటూ ప్రేమ కుటీరాలలో జీవించడానికి ఇది జీవితం! సినిమాకాదు!"

"ఏమిటి నువ్వు మాట్లాడుతున్నది? తీసుకొస్తాను. మనకు అవసరమయినంత డబ్బు తీసుకువస్తాను"

"అవసరమా? అంటే ఎంత?"

"అంటే... రెండు మూడు సంవత్సరాల వరకూ నరిపడేటంత!"

"ఆ తర్వాత?"

"అబ్బా కాంతీ! ప్రశ్నలతో నన్ను చంపుతున్నావు. అయినా నామీద నమ్మకంలేదా?"

"ఉంది కానీ, నామీదే నమ్మకంలేదు! ఆ పరిస్థితులను భరించే శక్తి నాలోలేదు. సరే! ఆతర్వాత ఏంచేస్తావు?"

"ఉద్యోగం!"

కొంచెం హేళనగా అంది కాంతి "చదువే పూర్తికాలేదు. అంత తేలిగ్గా వస్తుందా ఉద్యోగం?"

"ఎందుకురాదు?"

"ఎంత పిచ్చివాడివి, అమాయకుడవు చందూ! ఇంతక్రితం అన్నావే విశాల ప్రపంచం అని... ఒక్కసారి వెళ్ళి చూడు ఆ ప్రపంచంలోకి. ఎమ్.ఎ.లు, ఎమ్.ఫిల్.లు ఉద్యోగాలు లేక ఎలా పడివున్నారో... అలాంటిది— డిగ్రీనే పూర్తికాని నీకు..."

ఆ మాట కాంతి కూడా అనేసరికి చందూ అభిమానం ఘోరంగా దెబ్బతింది. ఖస్సుమన్నట్లుగా అన్నాడు. "అయితే నాతో రానంటావు. అంతేనా?!"

"ఎందుకంత కోపం?"

"కోపంకాదు కాంతీ! అర్థంచేసుకోమంటున్నాను! నా ఆవేదన పంచుకోమంటున్నాను!"

"అర్థంచేసుకుంటున్నాను కాబట్టే... అయినా చందూ! లేచిపోయి ఏ గుళ్ళోనో పెళ్ళిచేసుకోవాల్సిన ఖర్మ నీకేం పట్టింది? ధైర్యంగానే పెద్దలకి చెప్పు!"

"పెద్దలు హు! వీళ్ళా పెద్దలు! నీకు తెలీదు కాంతీ! మా డాడీ అసలు ఒప్పుకోడు! పైగా చెడకొడతాడు!"

"ఎందుకు ఒప్పుకోరు? ఒప్పించు!"

"డాడీ సంగతి నీకు తెలియదు. ఇది ఇల్లుకాదు నరకం. కొన్నాళ్ళు ఈ కొంపలో వుంటే ఖచ్చితంగా పిచ్చిపడుతుంది"

ఎర్రగా కందిపోయిన చందూ మొఖం చూస్తుంటే అనుమానం వచ్చింది కాంతికి! మళ్ళీ ఏదో గొడవ అయివుంటుంది తండ్రీకొడుకులకి! లేకపోతే ఇలా ఆవేశపడడు.

కాంతికిది అలవాటే కాబట్టే లేచిపోదామని చందూ నుండి లెటర్ వచ్చినా, అంత సీరియస్‌గా తీసుకోలేదు.

చందూ మనస్తత్వం బాగా తెలుసు.

ఏంచెయ్యాలో పాలుపోని పరిస్థితుల్లో ఉక్రోషం ఆపుకోలేక రకరకాల ఆలోచనలు పెట్టుకుని చప్పున ఆవేశపడిపోయేరకం.

ఎదిగీ ఎదగని వయసు! వికసించీ వికసించని మనసు. అందుకే చందూని స్నేహపూర్వకంగానే మందలిద్దామని వచ్చింది.

అనుమానంగా చూస్తూ అడిగింది.

"చందూ! ఏమిటా ఆవేశం! అసలు ఏం జరిగింది? మళ్ళీ ఏమయింది?"

"ఏం కాలేదు! ఏమీ కాకముందే ఇక్కడ నుండి బయటపడాలి"

"అంటే?"

"డాడీ రాక్షసుడు!"

"చందూ తప్పు!" మందలింపుగా అంది.

"ఏది తప్పు? ఎవరిది తప్పు? డాడీ చేసే పనులు తల్చుకుంటూవుంటే కంపరంగా వుంటోంది! ఆత్మహత్య చేసుకోవాలనిపిస్తోంది"

"ఏం జరిగింది? అంకుల్ ఏమన్నారు? తిట్టారా?"

"తిట్టడం ఏంఖర్మ! చెప్పాలంటే చాలా వున్నాయి. నామీద ఎంక్వయిరీలు.. సి.ఐ.డి. నిఘాలు.. చెకింగులు.. నేను వెధవనిట.. చవటనిట.. చదవనట.. చెడు తిరుగుళ్ళు తిరుగుతున్నానట.. నాకు తిండి దండగట.. నాకంటే అడుక్కుతినేవాళ్ళు నయమట.. ఇంకా.. ఇంకా.. ఛీ!"

"ఇంత చిన్న కారణాలా? అయినా అంకుల్ కానిమాటలు ఏమన్నారని?"

"కాంతీ!" పిడుగులు పడ్డట్టు చూశాడు చందూ.

కాంతి సూటిగా చూడకుండా తలొంచుకుని అన్నది.








"చందూ! నేనంటున్నానని అనుకోకు! చనువుకొద్దీ చెబుతున్నాను. నిజం చెప్పు! నిజంగా నువ్వు శ్రద్ధగా చదివావా? ఇంటిపట్టున వున్నావా? చెడు తిరుగుళ్ళు తిరగడంలేదూ? నీకు.. స్నేహితురాలిని నేను ఒక్కదాన్నేకాదు.. సినిమాలకి, షికార్లకి తిరిగే మరొకరు వున్నారు... అవునా?"

"కాంతీ!"

"తెలిసిపోతూనేవుంది వాలకం! అంకుల్ అన్నారని ఆవేశపడిపోకపోతే నీవైపు నుండి ఆలోచించవేం? మరీ అంత ఆవేశమా? బాప్రే!"

ఒళ్ళుమండి చిరాకుగా అన్నాడు.

"అవునులే! ఆఖరుకి నీకు కూడా అలుసైపోయాను".

"అలునుకాదు చందూ! నేను చెప్పేది..."

"మరి? ఇన్నాళ్ళూ నన్ను మనస్ఫూర్తిగా అర్థం చేసుకున్నది నువ్వు ఒక్కదానివే అనుకు న్నాను. కానీ, కాదని ఇపుడు తేలిపోయింది."

"నిన్ను చూస్తుంటే నవ్వాలో, జాలిపడాలో తెలియడంలేదు. వయసొచ్చినా చిన్నపిల్లల మనస్తత్వం పోలేదు. హుందాగా ఉండటం నేర్చుకో!"

చెందుకి ఒక్కసారిగా కోపం ముంచుకొచ్చింది.

"కాంతీ! నువ్వేం మాట్లాడుతున్నావో తెలుసా?"

"అదిగో! ఆ ఆవేశమే వద్దంటున్నాను. కాస్త నిదానించి ఆలోచించడం నేర్చుకోమంటున్నాను!"

విసురుగా అన్నాడు. "నువ్వేమీ నీతులూ - పాఠాలు చెప్పనక్కర్లేదు."

"అయితే నువ్వే తెలుసుకుంటావు త్వరలో. నువ్వు ఎంత అపోహలో ఉన్నావో!" సహనం నశించినట్లుగా గట్టిగా అంది కాంతి.

"కాంతీ! ఇన్ని మాటలు అనవసరం! ఆఖరిసారిగా అడుగుతున్నాను. నాతో వస్తావా?"

"ఎక్కడికి?"

"అదే! ఈ విశాల ప్రపంచంలోకి... స్వేచ్ఛాపథంలోకి..."

"ఆ వెధవ సినిమా డైలాగులే నాకు ఒళ్ళు మంట! విశాల ప్రపంచం. తెగ సంబరపడిపోతున్నావే... మీ యింట్లో నుండి ఒక్క అడుగు బయటకు వేసి చూడు! తెలుస్తుంది! అది ఎంత ఇరుకో!"

"అంటే? నన్ను ప్రేమించడంలేదా? మన ప్రేమ..."

"అందుకే అన్నాను! నీలో వయసేకాని మనసు ఎదగలేదని!"

"కాంతీ!"

"అర్థంకాలేదా? స్నేహానికి, ప్రేమకి వ్యత్యాసం తెలుసుకోలేనివాడివి... అసలు ప్రేమ గురించి మాట్లాడే అర్హత ఎక్కడిది నీకు? అసలు ప్రేమంటే తెలుసా నీకు? ఓ పదినిముషాలు ఎదురెదురుగా కూర్చుని మాట్లాడుకోవడంకాదు ప్రేమంటే! నోట్సులు, పుస్తకాలు మార్చుకోవడం కాదు ప్రేమంటే! డ్యూయెట్లు పాడుకోవడం కాదు ప్రేమంటే!"

దిగ్గున, ఆవేశంతో లేచాడు చందూ.

"కాంతీ! ఇదంతా నాకు ఎందుకు చెబుతున్నావో అర్థంకావడంలేదు."

"నీ మనసు నాకు తెలియందికాదు. ఏ క్షణాన ఎలా మారుతుందో నీకే తెలియదు. ఆవేశం, నిర్లక్ష్యం, అర్థంలేని ఆలోచనలు, నిలకడలేని ఆశయాలు... నీకేం? నువ్వు బాగా డబ్బున్నవాడివి... కానీ నేనలాకాదు. నా తండ్రి ఎంతో కష్టపడి, రెక్కలు ముక్కలు చేసుకుని, ఫీజులు కట్టి చదివిస్తుంటే ఆఖరుకి ఆ చదువు నిసట్టేటిలో ముంచి ప్రేమా, దోమా అంటూ ఎగిరిపోయే వెర్రిదాన్నికాను నేను. అయినా, ఇపుడు నువ్వేదో ఆవేశంలో అంటున్నావుకాని, రేపు మీ డాడీ చుట్టూ తిరుగుతునే ఉంటావు... ఆస్తికోసం!"

"అసంభవం!" అరిచినట్లుగా అన్నాడు.

"ఆ! ఇలా గొంతు చించుకుని అరిచినవాళ్ళే... చివరికి తండ్రిచుట్టూ..."

"నో...ఇంపాసిబుల్... నా తండ్రితో... తండ్రి అని చెప్పుకోడానికి సిగ్గుపడే ఆ వ్యక్తితో పొత్తు కలవడం అసంభం. నా కంఠంలో ప్రాణం ఉండగా జరగదా వని."

చందూ కళ్ళల్లోని ఎరుపుచూసి మనసులోనే భయపడింది కాంతి. అనునయిస్తున్నట్లుగా అంది. "చందూ! సరిగ్గా, కాస్త ఆలోచించి మాట్లాడటం నేర్చుకో!"

మరింత రెచ్చిపోయి చెప్పాడు. "కాంతీ...నువ్వనుకుంటున్నావునేనేదో చిన్నపిల్లాడి మనస్థత్వంతో ప్రవర్తిస్తున్నానని... కాని నీకు తెలియదు. నా చుట్టూ ఎలాంటి పరిస్థితులు పరిభ్రమిస్తున్నాయో... నేను ఎలాంటి మానసిక క్షోభననుభవిస్తున్నానో... వాటినుండి తప్పించుకోడానికి ఎంత ప్రయత్నిస్తున్నానో... ఆ ప్రయత్నంలో... నాకో తోడుకోసం..." హఠాత్తుగా గొంతులోకి ఏడుపు వచ్చింది.

"చందూ! నా మాటవిను. ఈసారి అక్టోబరుకి బాగా చదువు. ఈ పిచ్చి ఆలోచనలన్నీ





పక్కకునెట్టి బాగా ప్రిపేర్ అవు. ఇవన్నీ తాత్కాలికం! ఈరోజు వస్తాయి. రేపు పోతాయి. నువ్వే అనవసరమయిన అపోహలతో... భూతద్దంలోంచి చీమనిచూసి ఏనుగను కుంటున్నావు... ఇపుడు నీ ధ్యేయమల్లా... చదువు.... చదువు... నీమానాన నువ్వు చదువుకుంటే ఎవరు మాత్రం నిన్నేమంటారు''?

"థాంక్స్! నీ అమూల్యమయిన సలహాలకు. కాని ఒకటి గుర్తుంచుకో. ఎపుడో నువ్వే వచ్చి అడుగుతావు, నాతో రమ్మని... ఆరోజు తప్పకవస్తుంది.'' విసురుగా సోఫాలో నుండి లేచాడు చందూ.

తీవ్రంగా చూస్తూ అంది.'' ఇంపాసిబుల్! అది నీభ్రమ. నాలుగు మంచి మాటలు చెబితే బుద్ధిగా మారతావనుకోవడం నాభ్రమ. కాని ఒకటి! ఖచ్చితంగా నీ ఆలోచనా ధోరణి తప్పుదోవలో నడుస్తోంది. అది గుర్తుంచుకో!'' అని చకచకా గుమ్మంవైపు అడుగు వేయబోయి... ఒక్కసారిగా స్థాణువైపోయింది. చందూకూడ వెనుతిరిగి గుమ్మంవైపు చూసాడు.

ధనుంజయరావు గుమ్మాన్ని ఆనుకుని నించున్నాడు.

ఆ నించున్న తీరు చూస్తుంటే చాలాసేపటి నుంచి అక్కడే ఉన్నట్లుంది.

ఆయన కళ్ళు నిప్పులు కురుస్తున్నాయి.

శ్వాస భారంగా పీలుస్తున్నాడు.

కాంతికి గుండెటకటకా కొట్టుకోవడం మొదలయింది. ఆక్షణంలో ధనుంజయరావుని అక్కడ ఊహించలేదు.

భయం భయంగా అంది "అంకుల్... ఎంత...ఎంత సేపయిందివచ్చి?''

ధనుంజరాయరావు కళ్ళు సూటిగా కొడుకునే చూస్తున్నాయి.

అపుడు కదిలాడు. అడుగు లోపలికి వేసాడు.

చందూ ముందుకు వచ్చి నిలబడ్డాడు.

అడుగు దూరంలో! చందూ!

తుపాను ముందరి ప్రశాంతత అవహించింది ఆ హాల్లో!

కాంతికి స్పృహతప్పి పోతుందేమో అన్పిస్తోంది.

ఎర్రబడిన కళ్ళతో కొడుకువైపు సూటిగా చూసాడు.

కళ్ళెగరేసి అన్నాడు. "భేష్! బాగుంది. చాలా బాగుంది! వెరీగుడ్! పో! వెళ్ళిపో! ఏమన్నావ్? వెళ్ళిపోతావు కదూ.. ఊహు! లేచిపోతావుకదూ! ఒరేయ్..'' ఈడ్చిపెట్టి ఛెళ్ళున కొట్టాడు చెంపమీద.

ఆ విసురుకి చందూ తూలి టేబుల్‌మీదకి వడ్డాడు. చెంప ఎర్రగా కందిపోయింది. కాంతి కళ్ళప్పగించి చూస్తుండి పోయింది

వాకిట్లో రిక్షా ఆగిన శబ్దం లీలగా విన్పించింది.

ధనుంజయరావు టేబుల్ మీదకు వడిన చందూ జుట్టుపట్టుకుని పైకిలేపి.. "అవునురా ఇన్నాళ్ళూ తిండిపెట్టి పోషించినందుకు మేము రాక్షసులమైపోయాము... ఇపుడు..ఇపుడు విశాల ప్రపంచం కావల్సి వచ్చింది..కదూ..'' అంటూ మళ్ళీ ధడేల్‌మని వీపు వంచి కొట్టాడు. వెంటనే ఫెడేల్మని గుద్దు...

నేలమీదకు ఒరుగుతున్న చందూ కళ్ళకు గుమ్మంలో మొదట...

పాదాలు... చీరకుచ్చిళ్ళు... ఆతర్వాత తల్లి కన్పించారు మసకమసకగా...

చేతిలోని బుట్ట కంగారుగా పక్కనపడేసి "చందూ'' అంటూ పరిగెత్తుకొచ్చింది.

ధనుంజయరావు చేతిలో చందూషర్ట్‌కాలర్ చిక్కుపడి ఉంది.

శాంతి చప్పున ఒక్కఅంగలో వెళ్ళి భర్తచేతిలోని చెందూ కాలర్ విడిపించింది. వారించేకొద్దీ ధనుంజయరావులో కోపం ఉబికి వస్తోంది.

మళ్ళీ కొడుకు చెయ్యి దొరక పుచ్చుకోబోయాడు.

శాంతిని చూడగానే, కాంతికి ధైర్యం వచ్చింది. "అంకుల్! ప్లీజ్!'' అంటూ ధనుంజయరావు చెయ్యిపట్టి ఇవతలకు లాగింది.

ధనుంజయరావు విడిపించుకోబోయాడు. కాని కాంతి, శాంతి చెరోవైపు, చెరోచెయ్యి పట్టుకుని వెనక్కి లాగారు.

అధాటుగా ముందుకు తూలిపోయాడు చందూ.

ఒక్క క్షణం... కేవలం ఒకే ఒక్క క్షణం. తర్వాత-

చందూ తలెత్తాడు.. కళ్ళు అగ్ని గోళాల్లా మెరుస్తున్నాయి.

వంజా విసరబోతున్న పులిలా చూసాడు.. నుదుటి మీదకివడ్డ జుట్టుని తలఎగరేసి సర్దుకున్నాడు... తండ్రివైపు చూసాడు. కసిగా.. పగతో.. పళ్ళు నూరుతూ!

లేచాడు నెమ్మదిగా... మునివేళ్ళమీద... అంతే!

ఒక్కసారిగా.. పోట్లగిత్తలా.. తలవంచి... బెబ్బులిలా పెద్దగా అరుస్తూ... విసురుగా వెళ్ళి ధనుంజయరావు పొట్టలో గుద్దాడు.

''అమ్మా!'' అంటూ వెనక్కి విరుచుకు పడిపోయాడు ధనుంజయరావు. ఆవిసురుకి గుండె టకటకా కొట్టుకోవడం ప్రారంభించింది. ముఖం ఎర్రగా కమిలిపోయింది.కాంతి, శాంతి చెరోవైపుకి తూలిపడిపోయారు. చందూ అంతటితో ఆగలేదు. క్రిందవడిన తండ్రిమీదకి ఒక్కసారిగా ఎగిరి, కలియబడ్డాడు. తండ్రి మెడదగ్గర షర్ట్‌ని గుప్పిటలో బిగించి పట్టుకుని కసిగా పళ్ళు నూరసాగాడు. మనసు అట్టడుగు పొరల్లో దాగి ఉన్న ద్వేషం... ఒక్కసారిగా లావాలా విరజిమ్మింది. అగ్నిపర్వతం భళ్ళున బద్దలయింది.

ఇద్దరూ తండ్రీ కొడుకుల్లా లేరు! యుద్ధభూమిలో బద్ధశత్రువుల్లా ఉన్నారు.

కెవ్వున అరిచింది శాంతి. చప్పున కదిలి చందూమీద పడి ఇవతలకు లాగింది. లాగేకొద్దీ పట్టు బిగిస్తున్నాడు చందూ.

''చందూ!'' బలమంతా ఉపయోగించి విసురుగా లాగింది. ఆఊపుకి ఇద్దరూ వెళ్ళి గోడ దగ్గర పడ్డారు.

శాంతి చప్పున కొడుకును దగ్గరకు లాగి, గట్టిగా ఒడిసి పట్టుకుంది.

ఈ లోపల కాంతి ధనుంజయరావు చెయ్యి పట్టుకుని లేపింది.

నీరసంగా లేచాడు. సన్నగా మూలుగు వస్తోంది.

తల్లిచేతుల్లో నుండి విడిపించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు చందూ! రొప్పుతున్నాడు! పెనుగులాడుతున్నాడు! ఆయాసపడుతున్నాడు.

శాంతి వెర్రిదానిలా చూస్తూ, గొణుగుతున్నట్లుగా అంది.

''చందూ! ఆయన...ఆయన నీతండ్రిరా!''

''నో!'' పెద్దగా అరిచాడు! ''కాదు! నాతండ్రికాదు! తండ్రి అయితే ఇలాగేనా ప్రవర్తించేది? ఏం మమ్మీ! మాట్లాడవేం? ఆయన నన్నుకొట్టవచ్చు! కానీ, నేనుకొడితే తప్పా? నేనే మీ చిన్నవసిబాలుణ్ణికానే! బానిసని, పశువుని అంతకంటేకానే!...మరి...మరి? ఎందుకు ఇంతనామీద ద్వేషం? ఇంతపగ?'' ఎర్రబడిన కళ్ళు కసిగా మరింతపెద్దవిచేసి ఆవేశంతో ఊగిపోతూ అన్నాడు.

''మమ్మీ! తప్పుకో! ఈరోజు అటోఇటో తేలిపోవాలి! ఆయన...అదే నీమొగుడుకొట్టిన బెల్టుదెబ్బలు, బూటుకాళ్ల తీపిగుర్తులు నాశరీరంమీద ఇంకా మిగిలేఉన్నాయి. వాటినికూడ అప్పగించి ఋణంతీర్చుకోనీ! తప్పుకో మమ్మీ!'' బలవంతాన తల్లిచేతుల్ని విడిపించుకుని తండ్రివైపు దూసుకుపోయాడు.

చప్పున అడ్డంవచ్చి నిల్చుంది కాంతి ''చెందూ! ఆగు!''

చందూ ఆగలేదు.

కాంతి ఇకసందేహించలేదు. చప్పున చందూని గట్టిగా పెనవేసుకుని, అతనిరూమ్ వైపు నెట్టినట్లుగా లాక్కెళ్లింది.

హఠాత్తుగా చందూ కాంతి పట్టుని విదిలించి అన్నాడు. ''చూసావా కాంతీ! ఇప్పటికయినా అర్థం అయిందా? నీకళ్లు తెరుచుకున్నాయా? ఈ ఇల్లెంత నరకమో! ఈ మనుషులెంత రాక్షసులో! ఇవ్వాళ కొట్టారు. రేపు విషంపెట్టి చంపినా చంపుతారు. వీళ్ల విలాసాలకి, సరసాలకి మరినేనేగా అడ్డు!''

ఒక్కసారిగా గొంతు బొంగురుపోయింది.

''కొడుకు, సుపుత్రుడు అంటూ అందరూ నెత్తిన పెట్టుకుంటారే! కాని...నాఖర్మ! నా దురదృష్టం! ఇదిగో...ఇలాంటి ఇంట్లో పుట్టడం!

 

ఇలాంటి తండ్రికి కొడుకుని కావడం! సినిమా చూస్తే తప్పు! టేప్‌రికార్డర్ పెట్టుకుంటే తప్పు! స్నేహితులతో తిరిగితే తప్పు! నేనూ మనిషినే! నాకూ కోర్కెలు ఉంటాయి! నాకూ ఆశలు ఉంటాయి! కాని ఎవరూ అర్థంచేసుకోరేం! మీవే కోరికలు...మీవే ఆశలు. నావికాదా! అవును...అంతేగా...అంతే! ఇక ఈఇంట్లో ఒక్క క్షణం ఉండను! వెళ్లిపోతాను! నన్ను ఇంతగా ఏడిపించి మీరుబాగుపడరు! మమ్మీ! నాగురించి మర్చిపో! చచ్చిపోయాననుకో! అడ్డుతొలగానని పండగచేసుకోండి. కాని...ఒక అభ్యర్థన! ఒక విన్నపం! పేపర్‌లో ఫొటోవేసి వెతికే ప్రయత్నంచేయకండి. ఎందుకంటే మీపేరే బజార్నపడుతుంది." ఆవేశంతో వణికిపోతున్నాడు చందూ!

ఏం చెబ్తున్నాడో తెలియదు...ఏం మాటలాడుతున్నాడో అర్థం కావడంలేదు.

ఆ హాల్లో మిగతా ముగ్గురు చేష్టలుడిగి శిలాప్రతిమల్లా ఉండిపోయారు.

నోటమాట పడిపోయినట్లయింది.

చెందూ జేబులో చెయ్యిపెట్టి విసురుగా నాలుగు రూపాయినోట్లు విసిరి కొడుతూ అన్నాడు. "ఇదిగో డబ్బు...నేనిస్తున్నాను తీసుకోండి! ఎందుకో తెలుసా? ఒకకుక్కనుకొనుక్కొచ్చి ఉంచుకోండి. మీరుపెట్టినన్నాళ్లూ విశ్వాసంతో తోకముడుచుకుని మీపడకగదికి కాపలాకాస్తూ ఉంటుంది. అంతేకాదు...మమ్మీ!"

హఠాత్తుగా ఆగిపోయాడు. ఏదో చెప్పబోతున్న చందూముఖంలో రంగులుమారాయి. చప్పునచేత్తో కడుపు పట్టుకున్నాడు...

నొప్పి...

పొత్తికడుపులో పోట్లుపొడుస్తున్నట్లుగా...

శూలాలు గుచ్చుతున్నట్లుగా...

బొడ్డుచుట్టూ లావాప్రవహిస్తున్నట్లు...

గుండెల్లో అగ్నిగుండం ప్రజ్వరిల్లుతున్నట్లు...

ఇకమాట్లాడలేకపోయాడు. చప్పున తిరిగి గదిలోకివెళ్లి పెద్దగా శబ్దంఅయ్యేలా తలుపేసుకుని మంచంమీదికి వాలిపోయాడు.

కడుపుచేత్తో పట్టుకోవడం శాంతి కళ్లుచూసినా, దిమ్మెరపోయిన మనసు అదిపెద్దగా పట్టించుకోలేదు.

మళ్ళీ తిరిగిమామూలు ప్రపంచంలోకి రావడానికి ముగ్గురికీ పదినిముషాలుపట్టింది.

లోపల చందూకికూడ అంతే!

ఓ అయిదు నిముషాలుఉండి కాంతి వెళ్లిపోయింది.

వెళుతూ ఒక్కసారి ఇల్లంతా కలియచూసి, చందూరూమ్‌వైపు చూసింది.

ఎందుకంటే...

ఆ ఇంటికిరావడం ఇదేఆఖరుసారని తెలును...

ముందుకు నడిచేకొద్దీ...అమాయకమయిన చందూముఖం తాలూకు చూపులు వెంటాడుతూనే ఉన్నాయి.

దిమ్మెరపోయిన మనసు ఇంటికివెళ్లినా కుదుటపడలేదు.




ఈసంఘటన శాంతి మనసులో తీవ్రమయిన కల్లోలాన్ని రేపింది. విపరీతమైన భయంకూడా వేసింది.

తండ్రీకొడుకుల్లా లేరు.

ఇద్దరిమధ్యన వచ్చగడ్డి వేస్తే భగ్గుమంటోంది.

అన్నింటికీ మించి, చందూ తండ్రిమీద కలియబడుతున్న దృశ్యం తలచుకుంటుంటే శరీరం కంపిస్తోంది.

ఏ క్షణాన ఏం జరుగుతుందోనని భయం.

అందుకే ఆలోచించి ఆఖరుకి ఒక నిర్ణయానికి వచ్చింది.

రాజమండ్రిదగ్గర చిన్న పల్లెటూళ్లో శాంతి

అన్నగారు ఉన్నారు. కొన్నాళ్లపాటు చందూని మామయ్యా దగ్గరకు పంపించి అక్కడే ఉంచాలనుకుంది.

పూర్తిగా ఈ వాతావరణానికి దూరంగా.

ఈ పరిసరాలకి సుదూరంగా.

ఆలోచిస్తే అదే మంచిదనిపించింది.

ఈ విషయం భర్తకికూడా చెప్పదలుచుకోలేదు.

ఆరోజే కూర్చుని ఉత్తరం వ్రాసిపడేసింది. అన్నివివరంగా రాయలేదుకానీ, టూకీగా వ్రాసింది.

రెండుమూడు రోజుల్లో వచ్చి తీసుకు వెళ్లమని వ్రాసింది.

చందూ మానసిక పరిస్థితి మరోలా ఉంది.

విపరీతమైన మానసిక ఒత్తిడికి గురవుతున్నాడు.

దానికి తోడు విపరీతమైన కడుపునొప్పి, అప్పుడప్పుడు జ్వరం రావడం..

తల్లితో చెప్పాలనుకున్నాడు ఈ సంగతి. కానీ...

ఎందుకో...ఏదో అనుమానం.

ఏ మూలో భయం.

ఎందుకో..ఉన్నట్లుండి లాడ్జిలో గడిపిన యువతులు గుర్తుకువచ్చారు.

వెన్నులోంచి చలి మొదలైంది.

మైగాడ్!

కానీ..కానీ.. ఎవరికి చెప్పాలి?

ఎలా చెప్పుకోవాలి?

రెండురోజుల సుఖం జీవితాన్నే కబళించివేస్తోందా?

తరచూ వస్తున్న కడుపునొప్పితో ఆ భావం మరీ మరీ బలపడుతోంది. రెండురోజుల నుంచీ ఆ అనుమానం బాగా నిజమయింది.

యూరిన్‌పాస్ చేస్తుంటే మంట.. భరించలేని నొప్పి.

కళ్లవెంబడి నీళ్లువచ్చేవి. బాత్‌రూంలో మౌనంగా చన్నీళ్లతో కన్నీళ్లు కడుక్కునేవాడు.

తన బాధ ఎవరితో చెప్పుకోవాలి? ఏమని చెప్పాలి?

కానీతప్పదు!

డాక్టర్‌ని కలవాలి! రహస్యంగానైనా! కానీ ఎలా?

ఎలా చెప్పేది? భయం..సిగ్గు!

ఆలోచనలోపడి పేపరుతిప్పుతున్న చందూ దృష్టి పేపరు మొదటిపేజీలో పైభాగంలో ఆగిపోయింది.

వైద్యవిద్వాన్, వైద్యభూషణ.. డాక్టర్‌దాస్ సెక్స్ స్పెషలిస్టు.

ఆపరేషన్‌లేకుండా -రకరకాల జబ్బులు నయంచేస్తారని, ఫలానా తేదీలలో, ఫలానా ఊరిలో, ఫలానా లాడ్జిలో ఉంటారని అన్ని వివరాలు ఉన్నాయి.

ఏ ఏ తేదీలలో ఏఏ లాడ్జిలలో బసచేసేది వివరంగా ఉంది. ఆ వివరాల ప్రకారం ఈ ఊళ్లో ఇంకా మూడురోజులుంటాడు.

చందూగుండె కొట్టుకోవడం ప్రారంభించింది.

భయంతో, సంకోచంతో... గుండె దిటవుపరుచుకున్నాడు.

ఆ సాయంత్రం డాక్టర్‌ని కలవడానికి నిర్ణయించుకున్నాడు. సాయంత్రం వరకు కామ్‌గా, ప్రశాంతంగా కళ్లుమూసుకుని పడుకుని ఉన్నాడు.

ఎందుకో ఒక టైములో తెలియకుండానే కళ్లవెంబడి నీళ్లు కారేవి!

మనసులో రోదన కన్నీళ్లరూపంలో నిశ్శబ్దంగా జాలువారేది!

సాయంత్రం ముఖం కడుక్కుని, బట్టలు మార్చుకుని బయలుదేరాడు ఆ లాడ్జికి. సెంటర్‌లోనే లాడ్జి.

రిక్షామీద వెళ్లాడు.

లాడ్జి మెట్లు ఎక్కుతుంటే గుండె దడదడలాడింది. కాళ్ళువణికాయి.

అదురుతున్న గుండెలతో అడుగుపెట్టాడు గదిలోకి!

లోపల!

సెక్స్‌స్పెషలిస్ట్ అని చెప్పుకునే ఆదాస్ సీరియస్‌గా పేపర్ చదువుతున్నాడు. ము

ఖంలోకి చూడగానే చప్పున కన్పించేది పెద్ద ముక్కు.

నగం ముఖాన్ని ఆక్రమించిన కళ్ళజోడు. నుదుటిమీద పెద్ద గంధంబొట్టు!

చందూని చూసి చదువుతున్న పేపర్‌వక్క నపెట్టి కూర్చోమన్నాడు.

దాస్ ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని గదంతా పరిశీలనగా చూసాడు చందు!

ఏవేవో సర్టిఫికెట్లు ఫ్రేమ్ కట్టించి గోడలకు వేలాడతీసి ఉన్నాయి. రకరకాల ఫోటోలు కూడా వేలాడుతున్నాయి. దాస్ ప్రముఖ రాజకీయనాయకులతో, కరచాలనం చేస్తూ, దండలు చేతులమీద వేసుకుని వాళ్ళపక్కన నించుని. ఇలా రకరకాల ఫోటోలు ఉన్నాయి.

ఈ సెక్స్‌స్పెషలిస్టుకి, ఆ రాజకీయ నాయకులకి ఏం సంబంధమో అర్థం కాలేదు.

రెండు నిముషాల తరువాత అడిగాడు దాస్. చందూకి ఎలాచెప్పాలో అర్థంకాలేదు. కాసేపు సంశయిస్తూఉండిపోయాడు.

తర్వాత నెమ్మదిగా తడబడుతూ, తన ప్రాబ్లమ్ చెప్పాడు. తన అనుభవాల గురించి, అనుమానాల గురించి చెప్పాడు.

చెందూ వైపు జాలిగా చూసాడు దాస్!

చిన్నగా నిట్టూర్చి కుర్చీలోనుండి లేచాడు. చందూకూడా లేచాడు.

గదికి ఒక మూలగా పెద్ద ఆకుపచ్చకర్టెన్ వేలాడుతోంది. దానికి అవతల ఎత్తైన బల్ల ఉంది.

చందూని దానిమీద పడుకోమన్నాడు. చందూ కాళ్ళకున్న చెప్పులు విడిచి బల్లమీద పడుకున్నాడు. అలా ఎక్కడో, ఒంటరిగా, మరో వ్యక్తి సమక్షంలో, మౌనంగా ఆవ్యక్తి చెప్పినట్లు చేస్తూ ఉంటే అదోలా ఉంది! మనసు పిండినట్లుగా ఉంది.

దాస్ చందూవైపు చూసి, తలకింద దిండు ఎడ్జస్ట్‌చేస్తూ చెప్పాడు- ఫాంట్ విప్పమని!

గుండె ఝల్లుమంది చెందూకి! భయంగా ఉంది! సిగ్గుగా, సంకోచంగా చూసాడు!

"ఫరవాలేదు! అయినా డాక్టరుదగ్గర సిగ్గుపడితే ఎలా?"

జిప్ లాగుతుంటే వేళ్ళువణికాయి.

ఫాంట్ పూర్తిగా లాగి, గట్టిగా కళ్ళుమూసుకున్నాడు.

ఆక్షణంలో డాక్టరు ముఖం చూడాలంటే సిగ్గుగా ఉంది.

ఎందుకోహఠాత్తుగా అమ్మ గుర్తుకు వచ్చింది. పక్కనే నించుని తన నుదుటిమీద చెయ్యివేసి జుట్టు నిమురుతున్నట్లుగా ఉంది.

"మమ్మీ!" సన్నగా గొణిగాడు.

దాస్ ఏవోరకరకాల ప్రశ్నలు వేస్తున్నాడు.

మగతమగతగా, గొణిగినట్లుగా సమాధానాలు చెబుతున్నాడు చెందూ.

పొత్తికడుపుమీద వేళ్ళుపెట్టినొక్కడం... స్పర్శ తెలుస్తునేఉంది.

అయినా ఏదో మగత!

అయిదు నిముషాల తర్వాత ఇద్దరూ ఇవతలకు వచ్చారు.

దాస్ ముఖం నిర్వికారంగాఉంది. గంభీరంగా అన్నాడు.

"జబ్బు బాగా ముదిరిపోయింది"

ఉలిక్కిపడ్డాడు చందు. ఏడుపు అలలకు మల్లేతన్నుకువస్తోంది. బలవంతాన అదిమిపెడుతూ "తగ్గటం కష్టం అంటారా?" అన్నాడు.

"ఎందుకు తగ్గదూ! తగ్గించడానికేగా నేను ఉన్నది. జాగ్రత్తగా మందులు వాడితే, రోజు విడిచి రోజు ఇంజెక్షన్స్ చేయించుకుంటే బాగానే తగ్గుతుంది. కానీ, డబ్బు చాలా అవుతుందే! భరించగలవా? మీపేరెంట్స్‌ని తీసుకువస్తావా?"

చందూ ముఖం రక్తం లేనట్లుగా పాలిపోయింది.

పెదవులు వణుకుతుంటే అన్నాడు "వాళ్లు ... వాళ్ళు లేరు!"

"అంటే?"

చప్పున సర్దుకున్నాడు. "ఊళ్ళోలేరు. ఇప్పుడేరారు. అయినా... మాది ఈ ఊరుకాదు! పక్కనే చిన్నపల్లెటూరు!" ఒక మాటకి, మరో మాటకి పొంతన లేకుండా చెప్పాడు.

"నిజమే!, కాని వెంటనే ట్రీట్‌మెంట్ ప్రా

రంభించాలే! డబ్బు...''

''నేను తీసుకువస్తాను!'' తలవంచుకుని చెప్పాడు చందు.

''సరే! రేపు ఇదేటైముకి వస్తే... మందు ప్రారంభిస్తాను''.

చందూ తలూపి లేచి వెళ్ళబోతుంటే చిన్నగా దగ్గి అన్నాడు దాస్.

''ఇదిగో అబ్బాయ్! నాఫీజు... అదే... కన్సల్టేషన్ ఫీజు...''

చందుజేబులో చెయ్యిపెట్టాడు! చేతికి రెండు నోట్లు తగిలాయి. గుప్పిటతో తీసి ఎదురుగా టేబుల్‌మీద పెట్టాడు. ఎంతో లెక్క పెట్టలేదు.

వస్తుంటే మళ్ళీ అడిగాడు దాస్.



"అన్నట్లు... అబ్బాయ్! నీపేరు?"

చందూ ఒక్క క్షణం ఆగి చెప్పాడు నెమ్మదిగా...

"సుధాకర్!"

★ ★ ★

డబ్బు తీసుకు వస్తానని అన్నాడు కానీ, ఎక్కడ నుండి తేవాలో తెలియటంలేదు. పైగా ఇంట్లో చెప్పడానికి ఇష్టంలేదు. రహస్యంగానే ట్రీట్ మెంట్ జరిగిపోవాలి. అయినా ఏం ముఖం పెట్టుకుని చెబుతాడు?

మౌనంగా తనే భరించాలి. కానీ డబ్బు?

ఆలోచనలు తెగటంలేదు.

చందూ ఎందుకో ఎపుడూ దిగులుగా వుండటం, వున్నట్లుండి ఆలోచనల్లో పడిపోవటం, మౌనంగా తన రూమ్‌లోనే గడపడం శాంతి గమనిస్తూనే వుంది.

బాగా చిక్కిపోయాడు. కళ్ళక్రింద నల్లగా గీతలు ఏర్పడ్డాయి.

రాజమండ్రి అన్నగారి దగ్గర నుండి లెటరు వచ్చింది. ఏదో అనుకోని కోర్టు వ్యవహారాలు తగలటంతో పాలకొల్లు వెళ్ళాడట! పది రోజుల వరకూ రావటం కుదరదని రాశాడు.

ఉత్తరంచూచి చిన్నగా నిట్టూర్చింది. చందూని చూస్తేనే దిగులుగా వుంది.

ధనంజయరావులో కూడా కొంత మార్పు వచ్చింది.

ఇది వరకులా కోపం, విసుక్కోవడాలు తగ్గాయి. అసలు మాట్లాడ్డం కూడ చాలవరకు తగ్గించేశాడు.

ఎవరి పనుల్లో వారు. ఎవరి ఆలోచనల్లో వారు.

ఆ ఇంట్లో ఒక విధమయిన మౌనం తాండవిస్తోంది.

చందూకి ఏమీ పాలుపోవటంలేదు.

డబ్బు తీసుకురావాలి. కానీ ఎలా.

మనసులో ఏమూలో గుచ్చుతూ... ఏదో సిగ్గు...

మళ్ళీ దొంగతనం.

భయం వేస్తోంది. ఒకసారి చేసిన పాపానికి ఇపుడు శిక్ష అనుభవిస్తున్నాడు.

మళ్ళీ మరో దొంగతనమా?

కానీ... పదే పదే వస్తున్న కడుపునొప్పి కవ్విస్తోంది.

భయపెడుతోంది. ఆటలాడుతోంది.

ఎగసిన సెగలో, విసిగిన మనసు ఆజ్యం పోసింది. ప్రోత్సహిస్తోంది. తొందర చేస్తోంది.

లేచాడు నెమ్మదిగా...

మధ్య గదిలోకి నడుస్తుంటే...

ఎవరో నవ్వుతూన్న నవ్వడి...

వెక్కిరిస్తున్న ధ్వని...

అది తన మనసేనని తెలుసు. విదిలించుకున్నాడు.

బీరువా తీసాడు. పై అరలో తనుతీసిన వెండి కుందులు పోగా ఇంకా అయిదు వున్నాయి.

అరచేతులు చెమటలు పట్టాయి.

వాటిని అందుకో బోతుంటే...

అపుడు విన్పించింది, అడుగుల సవ్వడి..

గుండె వడివడిగా కొట్టుకోవడం ప్రారంభించింది. చెవుల్లో హోరు...

చెవులు రిక్కించి నిముషంసేపు అలాగే వుండిపోయాడు నిశ్శబ్దంగా.

ఎవరూలేరు.

నిశ్శబ్దం!

అంతా తన భ్రమ. మనసు కుదుటపడింది.

నెమ్మదిగా రెండు కుందులు తీసి, బొడ్డు దగ్గర దోపుకుని, పిల్లిలా గదిలోకి చేరుకున్నాడు.

ఆ రాత్రి భోజనాలదగ్గర అడిగింది శాంతి. "చందూ! ఏమిట్రా! రోజురోజుకూ అలా చిక్కి శల్యమయి పోతున్నావు? వంట్లో ఎలా వుంటోంది? రేపు డాక్టరు దగ్గరకు వెళదామా?"

ఉలిక్కిపడ్డాడు చందూ. కంగారుగా అన్నాడు "ఊహూ! వద్దు! ఏంలేదు. జనరల్ వీక్నెస్... అంతే"

"నీ ఇష్టం! కనీసం మంచి టానిక్ అయినా తాగు!"

"అలాగే!" చేతులు కడుక్కుంటూ ముక్తసరిగా సమాధానం చెప్పాడు

ఆ రాత్రి నిద్రలేదు చందూకి.

పక్కనే దిండుకిందవున్న కుందులు జంట సర్పాల్లా వున్నాయి.

చుట్టలు చుట్టుకుని పడుకుని, పడగలువి ప్పి బుసలు కొడుతున్నట్లుగా అన్పిస్తోంది.

ఒంటరితనం...

విపరీతమయిన ఒంటరితనం... భయంక రమయిన ఒంటరితనం...

ఏవేవో పిచ్చి పిచ్చి ఊహలు.. ఆలోచనలు.

ఆ రాత్రంతా కలత నిద్రపోయాడు.

ఏవో అర్థం పర్థంలేని కలలు...

ఎర్రటి చిక్కటి నీళ్ళు.

వాటిల్లో లుకలుకలాడుతూ అటూఇటూ ఈదుతున్న...

సన్నగా... పొడవుగా... సిల్కులా... మెత్తగా వున్న పురుగులు.

వందల సంఖ్య లో.. వేల సంఖ్యలో...

చూస్తుండగానే ఎర్రదనం వల్చబడి పోతోంది.

క్రమక్రమంగా తెలుపు రంగుకు తిరిగి... పూర్తిగా తెల్లగా... కాంతిలా...

మళ్ళీ నీలం రంగులోకి... క్రమక్రమంగా నల్లగా... కాటుకలా... మసిలా...

మర్నాడు ఉదయమే వెళ్ళాడు డాక్టర్ దాస్ దగ్గరికి.

చందూ వెళ్ళేసరికి డాక్టరు ముందర మరో కుర్రాడు కూర్చుని వున్నాడు.

అతని వయసు కూడా దాదాపు తన వయ సే వుంటుంది.

మరో దగాపడ్డ తమ్ముడన్నమాట.

ఆ కుర్రాడి కళ్ళల్లో భయం స్పష్టంగా కన్పి స్తోంది. ముఖం వాడిపోయి వుంది.

అతను వెళ్ళిపోయేవరకు బయటే నిల్చుండి పోయాడు చందూ, ఓ గోడ వారగా! మళ్ళీ గోడ దగ్గరకు వస్తే, బయట రోడ్డు మీది జనం కన్పిస్తారు. తనకు తెలిసినవారు పొరపా టున ఎవరయినా తనను ఇక్కడ చూస్తే!

అందుకే పక్కకు తొలిగి, తొలిగి నించున్నా డు. ఆ కుర్రాడి ఎదుటపడటానికి కూడ సందే హిస్తున్నాడు.

ఓ పది నిమిషాలకు, ఆ కుర్రాడు బయట కువచ్చాడు నిర్వికారమయిన చూపులతో!

చందూ లోపలకి అడుగుపెట్టాడు.

"రావోయ్ సుధాకర్! రా!" దాస్ ఉత్సా హంగా పిలిచాడు.

చందూ మౌనంగా కుర్చీలో కూర్చున్నాడు.

దాస్ టేబుల్‌మీదవున్న బేగ్ దగ్గరగాలాగి అందులో నుండి ఏదో మందుతీసి సిరంజిలోకి ఎక్కించాడు... లేచి చందూ దగ్గరకు వచ్చా డు.

జబ్బలోనికి సూది దిగుతుంటే, ఒకప్పుడు కాశీరామ్ అన్న మాటలు గుర్తుకొచ్చాయి.

"ఇదా! స్వర్గానికి సరాసరి చేర్చే స్పెస షటిల్!"

ఇంజెక్షన్ చేసిన చోట విపరీతమయిన నొప్పిగావుంది. సలుపుగావుంది.

కళ్ళ వెంబడి నీళ్ళు వస్తుంటే "అమ్మా!" అన్నాడు బాధగా, పెదవి నొక్కిపట్టి.

వెంటనే అదోలా నవ్వి అన్నాడు దాస్ "ఏం చేస్తాం! తప్పదుమరి. ఓర్చుకోవాలి. అప్పుడుపడిన సుఖానికి ఇపుడు బాధపడక తప్ప దు."

చందూ మాట్లాడలేదు.

దాస్ ఏవో నాలుగైదు రకాల మందులుఇ చ్చి, ఏఏ వేళల్లో ఏవి వేసుకోవాలో చెప్పాడు. నూటముప్ఫయ్ రూపాయలు వసూలు చేశా డు.

చందూ నిర్వికారంగా డబ్బు లెక్కపెట్టి ఇచ్చి బయటకు వచ్చాడు.

ఇంటికి వెళ్ళగానే మాత్రవేసుకున్నాడు.

ఆ రాత్రి నొప్పి వచ్చిందికానీ...

అంత తీవ్రంగాకాదు... తక్కువగా...

ఫర వాలేదు. భరించకలిగే నొప్పి వచ్చిందంటే తగ్గుతున్నట్లే.

మందులు పనిచేస్తున్నాయన్న మాట.

చందూ ముఖంలోకి కాస్త ఉత్సాహం వచ్చింది.

ఆ ఉత్సాహంతో సన్నగా విజిల్‌వేస్తూ అటూ

ఇటూ తిరిగాడు ఇంట్లో. కాసేపు కనిపించిన పుస్తకాలు చదివాడు.

కాని ఆ ఉత్సాహం ఎంతసేపో నిలువలేదు.

ఆ రాత్రికి వచ్చింది విపరీతంగా... భయంకరంగా...

రెట్టించినట్లుగా...

పక్కమీద మెలికలు తిరిగిపోయాడు.

"అమ్మా..." అనే మాటకూడ నోట్లో నుంచి రాలేదు.

వడగాడ్పు కొట్టినట్లుగా ముఖం ఎండిపోయింది.

పది ని ముషాల నరకయాతన తర్వాత, విపరీతమయిన నీరసంతో తోటకూర కాడలా వడిలిపోయినట్లుగా అయిపోయాడు.

ఆరాత్రి చాలాసేపు నిద్రపట్టలేదు.

మర్నాడు డాక్టరు దగ్గర విషయం చెప్పాడు.

దాస్ నిర్లక్ష్యంగా నవ్వేసి -"అప్పుడేనా! మొన్ననేగా ట్రీట్‌మెంట్ ప్రారంభించింది. అపుడే తగ్గమంటే ఎలా తగ్గుతుంది" అన్నాడు నీడిల్ జబ్బలోనికి నిలువుగా గుచ్చుతూ.

ఎగిరి పడినట్లయి "అమ్మా..." అన్నాడు చందు.

కన్నీళ్ళు ఉబికి వచ్చాయి.

నవ్వాడు డాక్టరు. ఎందుకో ఆ నవ్వులో "కసి" కన్పించింది.

ఆ లాడ్జింగ్‌లోనుండి బయటకు వస్తుంటే ఏడుపు తన్నుకువచ్చింది.

గబగబా ముందుకు నడిచాడు.

మనశ్శాంతి! ఒంటరితనం... కావాలి!

ఏదో పార్కు! పిల్లల పార్కు!

అందులోకి నడిచాడు...

దూరంగా కేరింతలు కొడుతూ, ఉయ్యాల లూగుతూ జారుడు బల్లలు జారుతూ ఉత్సాహంగా పరుగులు పెడుతున్నారు పదేళ్ళలోపు పిల్లలు.

వాళ్ళకి దూరంగా ఒక పొద వుంది.

ఆ పొద దగ్గర కూలబడ్డాడు.

అంతే!

ఒక్కసారిగా వెల్లువగా, తన్నుకు వచ్చింది ఏడుపు...

ఉబికి ఉబికి వచ్చాయి కన్నీళ్ళు.

మోకాళ్లలో తల దాచుకున్నాడు.

ఆ ఏ డుపుకి భుజాలు ఎగిరెగిరి పడుతున్నాయి.

అమ్మ... అమ్మ ఒళ్ళో తలపెట్టుకుని సేద తీరాలి.

మనసు మూగగా రోదిస్తోంది.

అలా ఎంతసేపు ఏడ్చాడో తెలియదు.

మోకాళ్లమధ్యలో నుండి తలెత్తి చూశాడు.

తనచుట్టూ దడి కట్టినట్లుగా పిల్లలు. ఆశ్చర్యంగా నోళ్ళు తెరుచుకుని చూస్తున్నారు. ఏడుస్తున్న చందూని... ఎగిరెగిరి పడుతున్న భుజాలని.. ఎర్రబడ్డ కళ్లని.. విప్పారిన నేత్రాలతో.. విస్మయ వదనంతో.. తేరిపార చూస్తున్నారు.

అంత పెద్దబ్బాయి, ఎందుకు అలా తీరి కూర్చుని ఏడుస్తున్నాడో వాళ్లకి అర్థంకాలేదు.

చందూ వాళ్ళవైపే చూస్తున్నాడు.

లేత గులాబి మొగ్గలు.. చిరు దరహాస చంద్రికలు.. పాలమీగడ తరకలు.

వద్దు! నావైపు చూడొద్దు! నా గాలి సోకితేనే వాడిపోతారు. నా నీడ పడితేనే వడలిపోతారు! నేను చెడ్డవాడిని! చెడిపోయాను! వెళ్ళిపొండి! దూరంగా వెళ్ళిపొండి! ఎందుకు? ఇలా పార్కుల చుట్టూ తిరుగుతారు? వెళ్ళండి! హాయిగా అమ్మానాన్నల నీడల్లో పెరగండి! బాగా చదువుకోండి! నాలా చెడిపోకండి! చదువుకోండి! మీకు వయసు వస్తుంది. ఆ వయసు తోపాటు ఆవేశమొస్తుంది. కానీ తొందరపడవద్దు! ఆలోచించండి! తప్పుదారిన నడవద్దు! వెళ్ళండి! దూరంగా వెళ్ళిపొండి!

రకరకాలుగా చందు మనసు మూగగా రోదిస్తోంది.

రెండు క్షణాలు మౌనంగా చూస్తుండిపోయారు ఆ పిల్లలు.

అందులో ఓ చిన్నిపాప, భయంభయంగా

# చతుర విపుల

## అభినందనలు

పత్రికల అమ్మకాలు అభివృద్ధి చెందుతున్నాయనడానికి పెరుగుతున్న పాఠకుల ఆదరణే నిదర్శనం. గతకొద్ది నెలలు నుండి విపుల, చతురల అమ్మకాలు గణనీయంగా పెరుగుతున్నాయి.

పాఠకుల అభిరుచులకు అనుగుణంగా పత్రికలను మరింత నూతనత్వంతో ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలని సంకల్పించాం.

లక్ష రూపాయల బహుమతులతో అనితరసాధ్యంగా భారీయెత్తున కథల/ నవలల పోటీ నిర్వహించిన సంగతి మీకు విదితమే.

1986 జనవరి- జూన్ పీరియడ్‌లో ఆడిట్‌బ్యూరో ఆఫ్ సర్క్యులేషన్‌వారి సర్టిఫికెట్ ప్రకారం ఇతర మాసపత్రికలకన్నా దాదాపు రెట్టింపుకు పైగా అమ్మకాలతో 'చతుర' అత్యధిక సర్క్యులేషన్‌గల మాసపత్రికగాను, దాని తర్వాత దాదాపు $1\frac{1}{2}$ రెట్లు అమ్మకాలతో 'విపుల' అధిక సర్క్యులేషన్ గల మాసపత్రికగానూ ప్రకటింపబడ్డాయి.

ఫిబ్రవరి నెల విపుల, చతుర జన్మదిన సంచికల నుండీ బహుమతి పొందిన కథలు, నవలలు ప్రచురితమవుతున్నాయి. నవలలు, కథల పోటీ రచయిత(త్రు)లను ఎంత ఆకర్షించిందో అంతకు మించి పాఠకులను ఆకట్టుకున్నదనడానికి అసంఖ్యాకంగా మా కార్యాలయానికి వస్తున్న పాఠకుల ఉత్తరాలే తార్కాణం.

జంట మాసపత్రికలయిన విపుల, చతుర పదవ వసంతంలో అడుగుపెట్టిన శుభసందర్భంలో పత్రికలను మరింత ఆకర్షణీయంగా తీర్చిదిద్దుతున్నాం. పాఠకుల కోరిక మేరకు మరిన్ని కొత్త శీర్షికలు ప్రవేశపెట్టబోతున్నాం.

పత్రికలను సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దడంలో సదా మీ ఆదరాభిమానాలు కోరుతున్నాం.

అడుగులో అడుగు వేసుకుంటూ చందూ దగ్గరకి వచ్చి, కళ్ళు పెద్దవిచేసి అతని కళ్ళల్లోకి చూసింది క్షణంసేపు.

చటుక్కున వంగి, అతని కాళ్ళదగ్గిర ఓ చాక్లెట్ పెట్టి, ఒక్కసారిగా వెనుతిరిగి పరుగెత్తింది.

ఆ పాప వెనకాలే పిల్లలందరూ పరిగెత్తారు, వెనక్కి వెనక్కి చూస్తూ!

చందూ చాక్లెట్ చేతిలోకి తీసుకున్నాడు.

ఎందుకో నవ్వు వచ్చింది.

ఆ నవ్వులో విరక్తి వుంది.

నోట్లో వేసుకున్న చాక్లెట్ తియ్యగా వుంది.

ఎంత తియ్యగా అంటే, పది నిముషాల క్రితం వేసుకున్న మాత్ర ఎంత చేదో అంత తియ్యగా.

★ ★ ★

రోడ్డుమీద తల వంచుకుని పాంటు జేబుల్లో చేతులు పెట్టుకుని నడుస్తున్నాడు చందూ.

మనసంతా వెలితిగా వుంది.

చేదు తిన్నట్లుగా వుంది.

ఇంతక్రితమే లాడ్జింగ్‌కు వెళ్లాడు. కాని డాక్టర్ లేడు. అక్కడ నుంచి మకాం ఎత్తేశాడు.

భీమవరం వెళ్ళినట్లున్నాడు.

ఎందుకో డాక్టరు వెళ్ళిపోయాడని తెలిసినా, తనకు ట్రీట్‌మెంట్ జరగదని తెలిసినా అంత బాధ అనిపించలేదు.

ఎందుకంటే...

ఇక ఈ నొప్పి తగ్గదనే నిర్ణయానికి వచ్చేశాడు.

తన కణం కణంలోనూ, ప్రతి అణువులోనూ వ్యాపించిపోయింది.

మహాఅయితే అతికష్టంమీద నాలుగు నెలలు బ్రతుకుతాడేమో!

అయినా ధైర్యంగానే వుంది. భయం అన్పించడంలేదు.

చావుముందు ధైర్యమేమో!

నవ్వొచ్చింది.

"హలో!"

ఎవరో పిలిచారు! తననేనా? ఏమో!

"హలో! చందూ!"

ఉలిక్కిపడ్డాడు! ఆలోచనలలోంచి బయటపడ్డాడు.

"ఏమిట్రా! అసలు నువ్వేనా? ఏమిటీ అవతారం?" ఆశ్చర్యపడిపోతూ అడిగాడు రమేష్!

ముక్తసరిగా జవాబుచెప్పాడు "ఆరోగ్యం అంత బాగుండటంలేదు"

"ఏవిటీ!"

"నీరసం! అంతే!" తేలిగ్గా నవ్వేస్తూ అన్నాడు.

రమేష్ ఏవేవో చెబుతున్నాడు. ఎక్కడో ప్రయివేట్ కంపెనీలో చేస్తున్నాడట. నెలకి ఆరు వందలు ఇస్తున్నారట. రెండేళ్లలో పెళ్ళి చేసుకుంటాడట. ఈమధ్య సినిమాలు చూడటం కూడా తగ్గించాడట.

అన్నింటికీ ఊకొడుతున్నాడు చందు.

మధ్యలో కాశీరామ్ ప్రసక్తి వచ్చింది.

ఉలిక్కిపడ్డాడు చందూ.

కాశీరామ్!!

ఆత్రంగా అడిగాడు "ఎక్కడున్నాడు కాశీరామ్!"

"నీకు తెలియదా?"

"ఏమిటి? ఏమయింది?"

"ఇక్కడే హాస్పిటల్‌లో వున్నాడు!"

ఇద్దరూ హాస్పిటల్‌కి బయలుదేరారు. మధ్యలో రమేష్ కాశీరామ్ గురించి చాలా చెప్పాడు. అవి వింటూవుంటే భయంవేసింది.

రెండుసార్లు ఆప్రేషన్ చేశారట! అసలు బ్రతుకుతాడనే అనుకోలేదట!

మాటల్లోనే హాస్పిటల్ దగ్గరకు వచ్చేశారు.

మేడమీదికి వెళ్ళారు.

ఒక గదిముందు ఆగారు. గ్లాసు తలుపు అది. లోపల బెడ్ అంతా కనిపిస్తోంది.

తలుపు తీయబోతుంటే రమేష్ వద్దని వారించాడు.

గది బయటే వుండి, గ్లాసు తలుపులోగుండా లోపలికి చూసిన చందు ఉలిక్కిపడ్డాడు. నిలువెల్లా వణికిపోయాడు. గుండె ఆగి,




కొట్టుకోవడం మొదలెట్టింది.

ఆ బెడ్‌మీద...

అస్థిపంజరంలా.. అటూఇటూ కొట్టుకుంటున్న ఆ వీముకల గూడు ఎవరు? ఎవరు? కాశీరామ్!

భయంభయంగా రమేష్‌వైపు చూశాడు చందూ!

రమేష్ అవునన్నట్లుగా కళ్లతోనే సమాధానం చెప్పాడు.

మళ్ళీ తలతిప్పి అటు చూశాడు.

గుబురుగా పెరిగిన గడ్డం, పిచ్చిగా పెరిగిపోయిన జుట్టు.. గుంటలుపడిన కళ్ళు.. ఎముకలపోగులా ఉన్న శరీరం..

బెడ్‌మీద తన్నుకుపోతున్నాడు! పాములా మెలికలు తిరిగిపోతున్నాడు! చేపపిల్లలా అటూఇటూ కొట్టుకుపోతున్నాడు.

అపుడు చూశాడు కాశీరామ్ కాళ్ళవైపు.

రెండు కాళ్ళు, చేతులు బెడ్‌కి ఇరువైపులా కట్టేసివున్నాయి.

ఒళ్ళు జలదరించింది చందూకి. అప్రయత్నంగా ''రమేష్!'' అన్నాడు.

''అవును! చూడు! ఎంత భయంకరమయిన నరకయాతన అనుభవిస్తున్నాడో! మార్ఫియా ఇంజెక్షన్లకి విపరీతంగా అలవాటుపడిపోయాడు. సమయానికి అదికనుక దొరకకపోతే... ఇక వాడి బాధ వర్ణనాతీతం! నరాలు పీక్కుపోతాయి. పట్టుతప్పిపోతాయి. పిచ్చివాడయిపోతాడు.. ఎదుటివాళ్ళని హత్యచేయడానికైనా సంశయించడు ఆ సమయంలో.. పగవాడికి కూడా వద్దు ఆ బాధ...''

పక్కనే వెక్కిళ్ళు వినబడితే ఉలికిపడి తల తిప్పాడు చందూ!

ఎవరో వృద్ధదంపతులు!

ముసలాయన! నోట్లో ఉత్తరీయం కుక్కుకుని రోదిస్తున్నాడు.

ఆమె కూడాఅంతే! ఏడ్చి ఏడ్చి ముఖం ఉబ్బి పోయిఉంది. నుదుట అద్దిన కుంకుమ చెదరిపోయిఉంది.

రమేష్ చెప్పాడు.

వాళ్ళిద్దరూ కాశీరామ్ తల్లిదండ్రులట!

''నెలనెలా ట్యూషన్‌కి డబ్బు పంపించు న్నా.. అని ఉత్తరాలు వ్రాస్తుంటే.. పిల్లాడు మరీ ఎక్కువగా చదివి ఎక్కడ ఆరోగ్యం పాడు చేసుకుంటాడోఅని డబ్బుతోపాటు జాగ్రత్తలు చెబుతూ ఉత్తరం వ్రాసేవాడిని.. కాని.. నా ఆశలు ఇలా వమ్ముచేస్తాడని తెలియదు... ఎక్కడో దూరంగా పట్నంలో బుద్ధిగా చదువుకుంటున్నాడనే అనుకున్నాను కాని.. ఇలా భయంకరమయిన దురలవాట్లకు లోనయి ప్రాణంమీదకే తెచ్చుకుంటాడనుకోలేదు. యువకుడు.. వయసు వచ్చింది.. తన అవసరాలేమిటో.. మంచేమిటో.. చెడేమిటో తెలుసనుకున్నాను.. ఇంత చీకటిలో.. మత్తు ప్రపంచంలో మునిగి తేలుతున్నాడని తెలియదు... భగవంతుడా! ఈ కొడుకు పుట్టకుండా వుండినా బాగుండును. పుట్టినవాడు పడుతున్న బాధ చూడకుండా మాకు ప్రాణాలు పోయినా బాగుండును'' వలవలా ఏడుస్తున్నాడు ఆ పెద్దాయన!

ఆయన మాట్లాడేకొద్దీ ఆమె నించోలేనట్లు, అక్కడే నేలమీద జారగిలపడి ఏడవటం మొదలెట్టింది.

అన్నంతిని ఎన్నో రోజులయినట్లుగా వాళ్ళ ముఖాలు పీక్కుపోయాయి.

కష్టపడి రెక్కలు ముక్కలు చేసుకుని ఆర్జించిన డబ్బులో కొంత మాత్రమే తమదగ్గరుంచుకుని, మిగతాది పూర్తిగా కొడుక్కు పంపించేవాడట ఆయన.. ఎప్పటికయినా కొడుకుపెద్దచదువు చదివి ఉద్యోగం చేసి తమని ఆదుకుంటాడనే ఆశతో.

కానీ ఇలా తమకళ్లముందే మంచంమీద ఆఖరిదశలో.. కొట్టుమిట్టాడుతున్న ప్రాణంతో.. మత్తు ప్రపంచంలో జోగుతూ వుంటాడని ఊహించలేదు.

కళ్ళెదుట కనిపిస్తున్న పచ్చి నిజం.

వాళ్ళ హృదయాలను నిర్దాక్షిణ్యంగా ముక్కలుచేసింది.

వాళ్ళ ఆశలు, ఆశయాలు అన్నీ ఒక్కసారిగా చెల్లాచెదురైపోయాయి. తుఫాన్‌లో చెట్టుకొమ్మల్లా ఊగిసలాడుతున్నట్లుగా వుంది వాళ్ళ

పరిస్థితి.

చందుగుండెల్లో బయలుదేరింది చిన్న వెలుగు...

ఆ వెలుగే ఒక దీపమై... వేయి దీపాలై... జ్వాలగామారి... జ్వలిస్తూ, నాలికలు జాపు కుంటూ, దావాగ్నిలా భగభగలాడుతూ శరీరాన్ని కబళిస్తోంది. ఆవహిస్తోంది.

''చందూ... చందూ...'' రమేష్ భుజంతట్టి పిలుస్తున్నాడు.

ఉలిక్కిపడ్డాడు చందూ.

''వెళ్దామా!''

చందూ మౌనంగా తలూపాడు.

అడుగుముందుకు వేయబోయి, మళ్ళీ తలవెనక్కి తిప్పిచూసాడు.

చందూకళ్ళకు...

బెడ్‌మీద మెలికలు తిరిగిపోతూ, కొట్టుకు పోతున్న కాశీరామ్ కన్పించలేదు. గుండెలవిసేలా ఏడుస్తున్న ఆ వృద్ధ దంపతులు కన్పించారు.

అంతే! ఒక్క క్షణం అక్కడ నించోలేదు.

గబగబా నడుస్తున్నాడు. బిగించిన గుప్పిటలో చెమటపట్టింది. విరిగిపోయిన మనసు సెగలు కక్కుతోంది.

రమేష్ ఏదో చెబుతున్నాడు! విన్పించడంలేదు! చెవుల్లో హోరు.

కొంత దూరం కలిసివచ్చి విడిపోయాడు రమేష్!

నీరసంగా కాళ్ళుఈడ్చుకుంటూ ఒంటరిగా ఇంటికి చేరాడు చందూ.

అన్నంతిన బుద్ధికాలేదు. తల్లి బ్రతిమలాడినా తినలేదు. ధనుంజయరావు భోజనంచేసి పడుకున్నాడు.

ఇంత క్రితమే సుబ్రమణ్యం అంకుల్ వచ్చి వెళ్ళారట.

తన గురించి అడిగారట. ఎందుకో?

పెద్దగా పట్టించుకోలేదు చందూ.

రూమ్‌కి వెళ్ళి తలుపేసుకుని మంచం మీద వాలిపోయాడు.

స్లోగా తిరుగుతోంది ఫాన్.

కందిరీగల్లా ఆలోచనలు.

ఎక్కడో...దూరంగా...సుదూరతీరాల నుండి ...ఘంటసాల భగవద్గీతో విన్పిస్తోంది. చందు నుదుటిమీద చెయ్యిపెట్టుకుని గట్టిగా కళ్ళుమూసుకున్నాడు. మోచేతి వంపులో తల దాచుకుని, అసహనంగా అటూ ఇటూ కదిలాడు. అవే దృశ్యాలు...

గిలగిలా తన్ను కుంటున్న కాశీరామ్. పచ్చటి కళ్ళ కాశీరామ్.

గుండెలవిసేలా ఏడుస్తున్న వృద్ధ దంపతులు.

గుండె చిక్కపట్టినట్లయింది.

ఒకవేళ తనకు కూడా ఏదయినా అయితే... మమ్మీ కూడా అలాగే గుండెలవిసేలా ఏడుస్తుందా?

ఒక్కసారిగా వెన్నులోంచి చలిపుట్టుకొచ్చింది

నో!

అలా జరగటానికి వీల్లేదు.

అందరూ తనవంక సానుభూతిగా, జాలిగా చూస్తారు కాబోలు... వద్దు!

అమ్మా! అనుకున్నాడు.

మళ్ళీ మొదలు నొప్పి! పోట్లు! విపరీతంగా మంట! కడుపంతా కదిలిపోతున్నట్లు, ఉండలు చుట్టుకుపోతున్నట్లుగాఉంది.

అమ్మా! అమ్మా! ఏడుపొస్తోంది.

లాభంలేదు... తనకి చావు తప్పదు! కాశీరామ్‌లాగే! కడుపు చేత్తో పట్టుకుని, గిలగిలా కొట్టుకుని చచ్చిపోతాడా?. అదే హాయి! ఈ బాధపడే కంటే చచ్చిపోవడమే హాయి.

అవును చచ్చిపోతే!

తన కోసం బాధపడే వాళ్ళెవరు?

కాని చచ్చిపోయేది ఎలా? నిద్రమాత్రలు మింగా? ఎండ్రిన్ తాగా?

భయంకరంగా వస్తోంది నొప్పి! లాభంలేదు! తను భరించలేడు!

అమ్మా!

నొప్పి తగ్గింది! కాని చందూ మనోనేత్రం ముందు గొప్ప దృశ్యం దృగ్గోచరమయింది.





గొప్ప వెలుగు...

ఆ వెలుగు ఎవరోకాదు...

క్రమక్రమంగా అమ్మలా మారిపోతోంది!.

ఇంకెవరున్నారని తనకి!

మొరపెట్టుకోవాలి. అమ్మతో చెప్పుకోవాలి. వెచ్చని ఒడిలో హాయిగా నిద్రపోవాలి. అమ్మా! వింటావా? నేను చెప్పేది వింటావా? చెప్పలేను! నీ ఎదుటపడి నా బాధ విప్పలేను. అందుకే నా భాష మూగభాష! నా వేదన మౌనవేదన! అమ్మా! నాకెందుకో భయంగా ఉంది. చచ్చిపోతానని కాదు. ఎందుకో చెప్పలేను! విరక్తి! మత్తు! ఒంటరి తనం! నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నాయి.



డాడీని కొట్టాను! ఏ కొడుకూ చేయని భయంకరమయిన పాపానికి ఒడికట్టాను. అమ్మా! వయసు ఇంత చిత్రాతిచిత్రమయినదని నాకు తెలియదు. వయసు ఇంత చెడ్డదని అసలు తెలియదు. తలచుకుంటే సిగ్గు... కానీ చెప్పానుగా. అన్నీ నీదగ్గర చెప్పేస్తున్నానని... ఏమీ దాచనని... నా పద్ధెనిమిదేళ్ళ వయసులో... నాలో రేగే కోర్కెలను అణుచుకోడా

నికి ఎన్ని మార్గాలు అనుసరించానని? వంటింటిలో, పడకటింటిలో మీరుచేసే సరసాలు, సరదాలు చాటుగా చూసేవాడిని. కుతూహలంతో గమనించేవాడిని. ఆ వయసులో, నా మనసులో రకరకాల ఆలోచనలు, అలజడులు... వాటిని ఎలా కంట్రోల్ చేసుకోవాలో తెలిసేదికాదు. నెమ్మదిగా సెక్స్‌పుస్తకాలకు అలవాటుపడ్డాను. నా కోర్కెలను తాత్కాలికంగా ఉపశమింపచేసుకునేవాడిని. అయినా నాలో ఏదో అసంతృప్తి... అసహనం...విసుగు... ఎవరిమీదనో కోపం... అది డాడీ రూపంలో నాముందు ప్రత్యక్షమయితే... నేను మళ్ళీ తిరగబడేవాడిని.. ఆలోచనలేని ఆవేశం. అందరి ముందు చిన్నవాడినిచేసి డాడీ తిట్టేతిట్లు. క్రమశిక్షణ పేరుతో డాడీ కొట్టే బెల్టు దెబ్బలు.. నాకు తెలియకుండానే నాలో మీమీద... డాడీ మీద ద్వేషాన్ని... కసిని...పగని అసహ్యాన్ని పెంచాయి. మనసులోనే ఏడుపు దిగగాను. డాడీ ఏదయితే చేయమంటారో అదితప్ప మిగతావన్నీ చేసాను. చదవమంటే చదివేవాడినికాను. అలా చేస్తే మానసికమయిన సంతృప్తి... కసితీర్చుకున్నాననే సంతోషం. నేను చిన్నవాడినికాదు... వయసొచ్చింది... మీసాలు గడ్డం వచ్చాయి... నేనూ పెద్దవాడినే... యువకుడిని అనే భావం... నన్ను ఆవేశం వైపు త్రోసింది. దానికితోడు ఒంటరితనం కొత్త ఆలోచనలను రేకెత్తించేది. క్రమక్రమంగా ఇల్లు ఒక నరకంలా తోచేది. డాడీ నా దృష్టిలో రాక్షసుడు... కానీ... అమ్మా! ఇప్పుడు నాకేమీ అన్పించడంలేదు... ఎందుకో నాకేతెలీదు. గొప్పమార్పు! నిన్ను అలాపిలుస్తుంటే ఎంత హాయిగా ఉంది. ఇంకో జన్మంటూ ఉంటే... ఈ యుక్త వయస్సుని మరో విధంగా గడుపుతాను! యువతరం అంటే ఆలోచనలేని ఆవేశంకాదని నిరూపిస్తాను. యువతరం అంటే మత్తుపదార్థాల, మాఫియా, మందుల, మగువల ప్రపంచంకాదని నిరూపిస్తాను. యువశక్తి సమాజానికి ఎలా ఉపయోగపడవచ్చో నిరూపిస్తాను. ఈ జన్మలో నాకా అవకాశంలేదు. ఎందుకంటే నేను కళ్ళు తెరిచేసరికే... ఆ వయసుదాటిపోయింది. యువతరంగాలు... ఈ తరంగాలు ఎగిసిపడే అలలేకాని, నిండుగాపారే నదీగర్భంకాదు. అమ్మా... క్షమించు. ఒళ్ళు తెలియని ఆవేశంలో... ఎన్నో అన్నాను... అసలు... నేను... నేనేనా...''

టప్‌మని కరెంట్ పోయింది.

గాఢాంధకారం. ఫాన్‌స్లో అయింది.

ఏమిటి? తను ఎవరితో మాట్లాడుతున్నాడు?

అరె! ఏమిటిది! బుగ్గలన్నీ తడిసిపోయాయి!

ఏడుస్తున్నాడా?

తలతిప్పి చూసాడు!

గోడమీద తగిలించిఉన్న కథాకళి ముఖం నవ్వుతోంది. నల్లటి కాటుక కళ్ళు విప్పారుస్తూ... ఎర్రటినోరు తెరుస్తూ నవ్వుతోంది.

దానికి కొంచెం ఎత్తులోఉన్న... కొబ్బరి పీచుతో చేసిన క్రిస్మస్ తాత కూడా నవ్వుతున్నాడు బోసినోటితో...

నవ్వులు...

పది..వంద..వేల సంఖ్యలో... గొంతులు... నవ్వుతున్నాయి.

పడీపడీ...పగలబడినవ్వుతున్నాయి.

ఆ నవ్వులు ఆ గదిలో మార్మోగుతున్నాయి తిరిగి, తిరిగి ప్రతిధ్వనిస్తున్నాయి.

గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

కరెంట్ వచ్చింది...

బెడ్‌లైట్ వెలిగింది.

ఫాను మళ్ళీ తిరగసాగింది. తెల్లటి రెక్కలతో...

కళ్ళు విప్పిచూసాడు...

గోడమీద కథాకళి ముఖం, క్రిస్మస్ తాత బొమ్మలు మామూలుగా ఉన్నాయి.

నిశ్శబ్దం...

చిన్నగా నిట్టూర్చాడు...

మనసు కొంత తేలికపడింది...

''చందూ! చందూ!'' ఎవరో పిలుస్తున్నారు.

రూమ్‌లో మంచానికి అంటుకుపోయినట్లుగా పడుకున్న చందూ ఉలిక్కిపడి లేచాడు. తన క్లాస్‌మేట్! సాగర్.

సాగర్‌ముఖం కళతప్పి ఉంది. మనిషి




అదేలా ఉన్నాడు.

"సాగర్! ఏమయిందిరా?"

"రమేష్... రమేష్ చచ్చిపోయాడు!"

సాగర్ చెప్పేదేమిటో అర్థంకాలేదు! రమేష్ చచ్చిపోవడమేమిటి? రెండు రోజుల క్రితమే గా చూసింది.

పిచ్చివాడిలా, అయోమయంగా చూస్తూ అన్నాడు. "సాగర్! ఏమిటి? నువ్వంటున్నది!"

సాగర్ గొంతులోకి అప్పుడే వెక్కిళ్ళు వచ్చేశాయి. తన్నుకువస్తున్న ఏడుపును బలవంతాన మింగుతూ చెప్పాడు.

"చచ్చిపోవడంకాదు! చంపేశారు! పొడిచి చంపేశారు!"

ప్రపంచమంతా గిర్రున తిరిగినట్లయింది. శరీరం తూలింది. చప్పున తమాయించుకుని గిర్రున లోపలికి పరిగెత్తాడు. డ్రాయర్ సొరుగు లాగితే, అందులో... నాలుగు అయిదురూపాయల నోట్లు ఉన్నాయి. వాటిని పైజమాజేబులో కుక్కుకుని పరుగులాంటి నడకతో వాకిట్లోకివచ్చి "పద!" అన్నాడు.

మాటలు విన్పించి బయటకు వచ్చిన తల్లి "చందూ! ఎక్కడికిరా!" అని వెనక అరుస్తున్నా విన్పించుకోలేదు.

అసలు చెవులకు ఏమీ విన్పించడం మానేశాయి.

కాళ్ళల్లో వణుకు ప్రారంభమయింది.

గుండెలన్నీ బిగపట్టినట్లయినాయి.

రమేష్‌వాళ్ళ ఇల్లు సత్యనారాయణపురంలో!

రోడ్డుమీదకివచ్చి ఆటో ఎక్కారు.

కొంతదూరంవరకు అసలు చెందూ ఏమీ మాట్లాడలేకపోయాడు.

తర్వాత అడిగాడు వణికే పెదవులతో "అసలు... ఏమయింది?"

నెమ్మదిగా.. ఆగి ఆగి చెప్పాడు సాగర్!

రమేష్ ఇంట్లో ఉండటం తక్కువ. ఎపుడూ బయట తిరుగుతూనే ఉంటాడు. దానికితోడు ఈమధ్యన ప్రతి స్ట్రయిక్‌లోనూ కల్పించుకుతిరుగుతున్నాడు. ఎపుడూ హాస్టల్‌కివెళ్ళి అక్కడ ఫ్రెండ్స్‌తో కూర్చుని పేకాటఆడుతూ కాలక్షేపంచేయడం బాగా అలవాటయింది. రావడం రెండు రోజులు లేటయినా హాస్టల్‌కుర్రాళ్ళు ఊర్కోరు! ఇంటికి కబుర్లు చేస్తూ ఉంటారు కూడా!

ఆరోజు ఉదయం...

మామూలుగానే రమేష్, హాస్టల్‌కుర్రాళ్ళు హాస్టల్ రూమ్‌లో కూర్చుని పేకాట ఆడుతున్నారు.

సాగర్ ఆడటంలేదుకానీ, పక్కనే మంచంమీద పడుకుని పుస్తకం చదువుకుంటున్నాడు.

వాతావరణం సీరియస్‌గా ఉన్న సమయంలో-

హఠాత్తుగా...

దగ్గరికివేసి ఉన్న తలుపు విసురుగా తెరుచుకుంది.

ఆ విసురుకి అందరూ ఉలిక్కిపడి తల తిప్పిచూశారు.

నలుగురు ధృడకాయులు! వాళ్ళ చేతుల్లో భయంకరమైన ఆయుధాలు ఉన్నాయి.

గొడ్డళ్ళు, బరిసెలు...

గూండాలు!

కంగారుగా లేవబోయిన రమేష్ హృదయవిదారకంగా పెట్టిన కేక ఆ హాస్టల్‌లో మార్మోగిపోయింది.

అతని గుండెల్లోనుండి దూసుకుపోయిన బరిసె వెన్నుని రెండుగా చీల్చింది. రక్తప్రవాహంలో పడి గిల గిల కొట్టుకుని రెండు క్షణాల్లో తలవాల్చేశాడు.

వాళ్ళు నిర్దాక్షిణ్యంగా కలబడ్డారు మిగతావాళ్ళమీదకి!

మరొక స్టూడెంట్‌చెయ్యి నరుక్కుపోయింది.

సాగర్ అమాంతం మంచంమీదనుండి క్రిందకిఉరికి, మంచాన్ని బలవంతంగా చేతిలోనికి తీసుకుని, నిలబెట్టి, ముందుకు దూసుకువస్తున్న గూండామీదికి తోశాడు!

గూండా కొంచెం తూలాడు.

ఆ కాస్త వ్యవధిలో, పక్కకి తప్పుకుని విసురుగా నెట్టుకుంటూ బయటికి పరిగెత్తాడు.

తనవెనక అడుగులశబ్దం విన్పిస్తూనే ఉంది. గూండా విసిరిన బాకు ఖంగున శబ్దంచేస్తూ తన పక్కనున్న స్థంభాన్ని ఢీకొని క్రిందపడిపోయింది.

బయటికి పరిగెత్తి, రోడ్డుమీదకి ఎలా వచ్చాడో తనకే తెలియదు.

ఇంటికివెళ్ళి, తలుపువేసుకుని గడగడలాడుతూ దాదాపు రెండుగంటలవరకూ బయటికి రాలేదు.

కాసేపటికి మనస్సు స్థిమితపరచుకుని, ఉండబట్టలేక వచ్చాడు చెందూదగ్గరికి.

చందూ కళ్ళప్పగించి వింటున్నాడు..

సాగర్ సన్నగా ఏడుస్తున్నాడు.. "వీళ్ళు కావాలని చేసిన దాడికాదు ఇది! ఎప్పటినుండో వస్తున్న పాతకక్షలు! సెకండియర్‌నాటి పాతగొడవలు. ప్లేగ్రౌండ్‌లోని కుల కలహాల కొట్లాటల తాలూకు పగ...కక్షలు! కాశీరామ్... హాస్పిటల్ పాలవడంతో... అదనుచూసి... గూండాలసాయంతో పగ ఇలా తీర్చుకుంటున్నారు... కాని... ఇది... అమానుషం... ఘోరం... నా కళ్ళ ముందే రమేష్... ఒహ్..." సాగర్ తట్టుకోలేక పోయాడు. చిన్న పిల్లాడిలా ఏడ్చేశాడు.

చందూకి కన్నీళ్ళు ధారలుగా కారుతున్నాయి.

విరిగిపోయిన మనస్సులోనుండి జల ఊరుతున్నట్లుగా వస్తున్నాయి కన్నీళ్ళు.

రమేష్‌వాళ్ళింటిముందు ఆగింది ఆటో...

అక్కడ జనం గుమిగూడి ఉన్నారు.

వాకిట్లో అరుగుమీద-

చూశాడు చందూ!

శరీరంమీద పూర్తిగా తెల్లగుడ్డ కప్పి ఉంది.

ఆ తెల్లగుడ్డక్రింద రక్తసిక్తమయిన శరీరం శాశ్వత నిద్ర పోతోంది కాబోల్సు!

ఆ ఊహ రాగానే ఒక్కసారిగా ఏడుపు తన్నుకువచ్చింది.

"రమేష్! రమేష్!" సాగర్ భుజంమీద తలవాల్చి రోదించాడు చెందూ!

శవం తలదగ్గర కూర్చుని ఉంది రమేష్‌తల్లి! తండ్రిలేడు!

అక్కబావలు గుమ్మందగ్గర నించుని ఉన్నారు. అక్క నోట్లో చెంగుకుక్కుకుని ఏడుస్తోంది...

"రోగంకాదు... నొప్పికాదు... ఏ పాపం చేశాడని వాడికీశిక్ష! దేవుడా!" రమేష్‌తల్లి కుమిలి కుమిలి ఏడుస్తోంది...

చందూ... హఠాత్తుగా సీరియస్ అయిపోయాడు.

చిత్రంగా కన్నీళ్ళు ఆగిపోయాయి...

స్ట్రైక్‌లతో... నినాదాలతో... అలసిన శరీరం...

పరుగులతో... కక్షలతో... కరుడుకట్టిన... శరీరం...

మత్తుమందులతో... మార్ఫియా ఇంజెక్షన్లతో... మసిబారిన శరీరం...

ఆడపిల్లల శరీరాలతో... ఆడుకున్న శరీరం...

నిర్జీవంగా... నిశ్శబ్దంగా... విశ్రమిస్తోంది...

ఇపుడు ఏబాధాలేదు రమేష్‌కి! డబ్బుగురించి, కాలేజి గ్రూప్‌గురించి, కులాలగురించి... కక్షలగురించి... ముఖ్యంగా కడుపునొప్పిగురించి...

ఎందుకో నవ్వువచ్చింది చందూకి!

నొప్పిగురించి తను ఎంతగా దిగులుపడుతున్నాడో! ఎదుటివాడికి ఆపాదించి తృప్తిపడుతున్నందుకు మళ్ళీ నవ్వు వచ్చింది.

చందూ ఇక అక్కడ ఉండలేదు.

తన భుజంమీద చెయ్యివేసిన సాగర్‌చేతిని తీసి, నెమ్మదిగా ముందుకు నడిచాడు, జనాన్ని తప్పించుకుని.

సాగర్ విచిత్రంగా చూశాడు వెళ్ళిపోతున్న చెందూని!

నడుస్తున్నాడు ముందుకి!

నిశ్శబ్దంగా... నీరసంగా!

ఎన్ని రోజులు... ఎన్ని స్మృతులు...

రోడ్డు పొడవునా... వరసగా... వాల్‌పోస్టర్లు... సినిమా పోస్టర్లు... మళయాళం... తెలుగు... హిందీ... సినిమావాల్ పోస్టర్లు! పెద్ద,ఏ సర్టిఫికెట్ ఉన్న వాల్‌పోస్టర్లు! పూర్తిగా తడిసిపోయిన తెల్లని చీరల్లో అవయవాలు చూపిస్తూ

హీరోయిన్! చెందూకి నవ్వొచ్చింది!

ఈ బొమ్మలని చూసి కాదూ? తాను, రమేష్ ఎన్నిసార్లు కాలేజి ఎగ్గొట్టి మార్నింగ్‌షోకి మ్యాట్నీలకు వెళ్ళింది?

వాటికి అంతులేదు! రకరకాలపేర్లు!

వాటిల్లో ఏవో ఉంటాయని భ్రమ! పిచ్చి!

రోడ్డు మలుపులో... కన్పించింది లైబ్రరీ.

ఎన్నాళ్ళు! ఎన్నాళ్ళయింది తను అందులోకి అడుగుపెట్టి! ఇపుడు చూస్తున్నాడు! అసలు తన దృష్టి ఎపుడూ పక్కనే ఉండే వాల్‌పోస్టర్లమీద, రోడ్డుమీద నడిచే అమ్మాయిలమీద!

కాంతి ఎన్నిసార్లు అడిగింది... లైబ్రరీకి వెళ్ళమని.

ఏమిటో! తనకిమాత్రం అదేదో అవమానంగా, తప్పుగా ఉండేది.

ఇదేమిటి? ఇంతగా ఆలోచిస్తున్నాడు.

ఒక్కక్షణం ఆగాడు.

క్షణంసేపు కళ్ళుమూసుకున్నాడు.

కళ్ళు గుంటలు పడిన... ఓ అస్థిపంజరం...

రక్తసిక్తమయిన మరో శరీరం...

లాఠీ దెబ్బలతో వొరిగిపోతున్న మరోశరీరం...

మత్తులో జోగుతూ, దొర్లుతున్న ఓ శరీరం...

మురికిలో... బరువుగా కదులుతున్న శరీరం...

ఉలిక్కిపడి కళ్ళుతెరిచాడు చెందూ!

ఏమిటీ ఆలోచనలు? ఏమిటీ ఆకారాలు?

తలతిప్పి చూసాడు! మనుషులు ఏదో పని ఉన్నట్లుగా, హడావిడిగా పరిగెత్తుతున్నారు, రిక్షాలు గణగణ మోగించుకుంటూ పరిగెత్తుతున్నాయి.

ఆటోలు... స్కూటర్లు...

ఎవరి గొడవలో వారు...

మౌనంగా ప్రార్థించాడు చెందూ!

కొంత దూరం నడిచాడు...

అపుడు వచ్చింది మళ్ళీ...

రాక్షసిలా... పెనుతుఫానులా...

భగభగ మండుతూ...

కొలిమిలో పెట్టిన ఇనుపనువ్వ తిప్పుతున్నట్లు...

"అమ్మా!" అంటూ చెయ్యి కడుపుమీద వేసి నొక్కాడు.

నొప్పి విరుచుకుపడింది అలలకు మల్లే!

ఒక్క అడుగుకూడ ముందుకు పడలేదు. ఆ నొప్పికి, తాళలేక పళ్ళు బిగపట్టాడు. కళ్లంబడి నీళ్ళువచ్చాయి.

కాళ్ళు నేలలోకి కూరుకుపోతుంటే తలెత్తి చూసాడు.

పక్కనే పార్కు ఉంది!

అతి కష్టంగా అందులోకి నడిచాడు!

మొదట్లోనే ఉంది పంపు!

దాని దగ్గరికి నడిచాడు! పంపుతిప్పి నీళ్ళు దోసిలిలోకి పట్టి కాసిని త్రాగితే కాస్తచల్లబడినట్లయింది!

ఆ ఇసకలో కాసేపు అలాగే కూర్చుండిపోయాడు.

దోసిలిలోని నీళ్ళతో ముఖమంతా తుడుచుకుంటుంటే...

ఒక్కసారిగా కన్నీళ్ళు ఉబికి వచ్చాయి.

మోకాళ్ళమీద చేతులు ఉంచి అలాగే నిశ్శబ్దంగా ఉండిపోయాడు తడిసిన బుగ్గలతో!

అయిపోతోంది! తన పని అయిపోతోంది.

వెక్కిళ్ళు వస్తున్నాయి.

ఈ ప్రపంచంనుండి...

ఒంటరిగా... నిశ్శబ్దంగా... నిష్క్రమిస్తాడాతను?

ఈ నొప్పితో... ఇలాగే...

భుజంమీద చల్లటి స్పర్శ!

ఉలిక్కిపడి తలతిప్పి చూసాడు చెందూ!

తన వెనక ఎవరో ముగ్గురు యువకులు... దాదాపు తన వయసువాళ్ళే నించుని ఉన్నారు.

వాళ్ళల్లో ఒక యువకుడు తన భుజంమీద చెయ్యివేసి నిమురుతున్నాడు.

ఆస్పర్శ ఎంతో హాయిగా ఉంది... చల్లగా ఉంది... ధైర్యం ఇస్తున్నట్లుగా ఉంది.

"ఎవరుమీరు!"

చల్లగా నవ్వాడు ఆ యువకుడు! వాళ్ళముఖాలు ఎంతో నిర్మలంగా ఉన్నాయి.

మనుషులు ఎంతో ఆరోగ్యంగా, ఉల్లాసంగా, సంతోషంగా ఉన్నారు.

ఆ యువకుని చెయ్యి అప్రయత్నంగా పట్టుకున్నాడు చెందూ!

వాళ్ళు అతన్ని లేపి ముందుకు నడిచారు.

వాళ్ళవెనకే చెందూ నడిచాడు!

పార్కుకి మధ్యలో గులాబీ మొక్కలు నాటి ఉన్నాయి. పూలు తలలూపుతున్నాయి గాలికి! ఆ మొక్కలకు పక్కగా రెండు ఎయిర్‌బాగ్‌లు, రెండు మామూలు హేండ్‌బాగ్స్, వాటర్ బాటిల్ ఉన్నాయి. పక్కనే దుప్పటి పరిచి ఉంది.

వాళ్ళు వెళ్ళి ఆదుప్పటిమీద కూర్చుని, చెందూని ఆహ్వానించారు.

చెందూ కూడా వెళ్ళి వాళ్ళమధ్యన కూర్చున్నాడు.

వాళ్ళమధ్య కూర్చుంటే అదో విధమయిన తృప్తిగా, ధైర్యంగా ఉంది.

మళ్ళీ అడిగాడు "ఎవరు మీరు?"

మొదటి యువకుడు సమాధానంగా నవ్వాడు.

"యువజ్యోతి తాలూకు వెలుగుని దేశం నలుమూలలకు ప్రసరింప చేయడానికి పాటు పడుతున్న వాళ్ళం! నిర్వీర్యమైపోతున్న యువ శక్తికి చేయూతనిచ్చి దశదిశలా వ్యాపింప చేయడానికి కృషి చేస్తున్నవాళ్ళం! జాజ్వల్యమానంగా వెలగ వలసిన యువజ్యోతి, ఆరిపోయి కొడిగట్టిపోతే... మళ్ళీ ఆ జ్యోతికి పునర్జీవితం... కల్గించడానికి శాయశక్తులా కృషి చేస్తున్నవాళ్ళం...

ఈ ప్రయత్నంలోనే దేశాన్నంతా చుట్టబెడుతున్నాము... నెలరోజులక్రితం బయలుదేరాము. కన్యాకుమారిలోని మహనీయుడు... స్వామి వివేకానంద రాక్‌నుండీ ప్రారంభించాము మా యాత్ర! ఆమహనీయుని దివ్యస్మృతి మాకు స్ఫూర్తిగా, ఆ మహామనిషి సందేశం మాకు చేయూతగా... తిరుగుతున్నాము..."

చెందూ ఆశ్చర్యంగా అడిగాడు... "కేవలం... మీముగ్గురూ... దేశమొత్తం తిరుగుతున్నారా?"

"అవును... యువశక్తిని అధ్యయనం చేస్తున్నాము." ఎక్కడ చూసినా... అవినీతికోరలలో... రాజకీయనాయకుల కబంధహస్తాలలో... మత్తువ్యసనాలలో... నిరుద్యోగరక్కసి బాహువులలో... నిరాశ నిస్పృహల విషవలయంలో... అనారోగ్యరక్కసి బాహువులలో... మగ్గిపోతోంది యువతరం.. ఇరవయి ఏళ్లవయసుకే ఏభయిఏళ్ల వృద్ధాప్యంతో... పిరికిగా... చైతన్యరహితంగా... మురికికూపాలలో మూల్గుతోంది మన యువతరం..."

చందూ అప్రయత్నంగా తలవంచుకున్నాడు తప్పుచేసినట్లుగా !

ఎదుటివ్యక్తి చెందూ గడ్డంఎత్తి గుంటలపడిన ఆకళ్ళని, లోతుకుపోయిన బుగ్గల్ని కళ్ళక్రింది నల్లటి చారలని చూసి నవ్వాడు నిర్మలంగా!

"ఫ్రెండ్! తెలుసు! నీబాధేమిటో తెలుసు! నువ్వుచెప్పకపోయినా తెలుసు! ఎందుకంటే ప్రతి చోటా మాకు ఇదే అనుభవం... మా అధ్యయనంలో ఎక్కువగా ఇదేపరిణామం ఎదురయింది... ప్రతిచోటా యువప్రభంజనం... ఒక్కోరకం ఊబిలో కూరుకుపోయింది. ఒక చోట కాబరేడాన్స్‌లపిచ్చిలో, మరో చోట లాటరీ, గుర్రప్పందాల వ్యామోహంలో, మరోచోట రాజకీయపు కోరల్లోపడి చదరంగంలో పావులుగా మిగిలిపోతోంది... మరో చోట మతకలహాల రాక్షసి కోరలలో మాడిమసై, ఇంకోచోట మత్తువ్యసనాలకోరలలో నిర్వీర్యమైపోతోంది... స్ట్రయిక్‌లు, అల్లర్లు, అశాంతితో అణగారిపోతోంది. సినిమా నాయకుల పార్టీలతో పిచ్చెత్తిపోతోంది... కాలేజి గొడవలతో కలహాలతో... కుంగిపోతోంది... క్రికెట్‌పిచ్చిలో... సినిమా మోజులో మగ్గిపోతోంది. గుండాయిజంతో చేతులు కలిపి సంఘవిద్రోహకర శక్తిగా మారుతోంది... మందుతో మగువలతో... మార్పియాలతో హిప్పీలుగా మారి.. సమాజం యొక్క ఆరోగ్యకరమయిన శరీరంపై రాచపుండు సృష్టిస్తోంది. దేశంలో ఎక్కడ చూసినా... ఏమూల చూసినా... ఏయువకుడిని చూసినా... ఆరోగ్యకరమయిన... ఉత్సాహవంతమయిన యువశక్తి కన్పించదము. దేదీప్యమానంగా భాసించాల్సిన యువజ్యోతి... మినుకమినుకగా వెల్గుతూ కన్పిస్తోంది. ఎక్కడుంది లోపం... యువతలోనా?...

సమాజంలోనా? చుట్టూ ఉన్నపరిస్థితులలోనా? ప్రభుత్వం లోనా?... తల్లితండ్రుల పెంప కంలోనా? ఎక్కడుంది?...''

రెండునిముషాలు ఆగిపోయాడు అతను!

అతనివైపే అద్భుతంగా చూస్తుండి పోయా డు చెందూ!

అతను చెందూ భుజంతడుతూ చెప్పాడు. "ఫ్రెండ్! నీపేరు నాకు తెలియదు! కానీ, ఈస్నేహమనేదుందే... అది అందరినీ గట్టిగా బంధించి ఉంచుతుంది... మా అధ్యయన యాత్రలో మరోమజిలీ ముగించబోతున్నాము... మరో సమాజంవైపు... మరో ఊరివైపు అడుగు లు వేయబోతున్నాము... స్నేహితుడా! ఒక మాట! మనం యువకులం! దేశానికి వెన్నెము కలాంటివాళ్ళం! కాని ఆయువశక్తే నిలువుగా వంగిపోయింది! కృంగిపోతోంది! కూకటి వేళ్ళ తో పెళ్లగించబడిపోతోంది. యువజ్యోతి... కొడి గట్టిపోతోంది... కానీ, అలా జరగడానికి వీలులే దు... చేయూతనివ్వు! యువశక్తిని నిలబెట్టు! ఆదీపానికి నూనెపోసి, జ్యోతిని వెల్గించి ఆవె లుగు దశదిశలవ్యాపింపచేయి... ఆవెలుగు... నీముందు తరానికి జ్ఞానదీపికకావాలి... ఆవె లుగులో నీ తమ్ముళ్ళు... చెల్లెళ్ళు... ఆరోగ్యకరమ యిన బాటలో పయనించకలగాలి! యువకు లు... బలంగా ఆరోగ్యంగా ఉండాలి. అలా ఉండగల్గాలంటే... మహమ్మారిలా వ్యాపిస్తు న్న ఈమత్తుపదార్థాలని... త్యజించాలి... శరీరం ఆరోగ్యంగా ఉన్నప్పుడే ఏదైనా చేయకలిగేది! వ్యాయామం చేయాలి! శరీరం, మనసు ఆరో గ్యంగా ఉంచుకోవాలి! మంచి ఆలోచనలు చేయగలగాలి... చదువువైపు దృష్టి మర ల్చాలి! సమాజంలో నువ్వు ఒక్కడివేకాదు. అయినా మొత్తం సమాజం నీవల్ల చెడిపోబో తోంది. అలా కాకూడదు. నీస్ఫూర్తితో సమాజం మంచి బాటలో పయనించాలి. అందుకు ను వ్వే చేయూతనివ్వాలి. నువ్వే అండకావాలి. యువశక్తిని నిర్వీర్యంచేసి... మాదకద్రవ్యాల బానిసలుగాచేసి, నిరాశనిస్పృహలతో కృంగిపో తున్న వారిని క్షుద్రరాజకీయాల్లో పావులుగా వాడుకుంటున్న రాజకీయ నాయకులను దూ రంగా తరిమికొట్టు! గూండాయిజంతో... మగ్గి పోతున్న సమాజాన్ని మంచిమాటలతో జాగృ తంచేయి.

స్నేహితుడా! ఆలోచించు. మనదేశం ఎక్కడ ఉన్నది... ఆసియాడ్, ఒలంపిక్స్, క్రీ డల... బంగారు పతకాల ముందు వరసల లోనా? దేవుడిపేరు చెప్పుకుని బిజినెస్‌నడిపే స్వాహాస్వాముల అధికారపీఠాల వరుసల్లోనా? మనదేశపంటల ఎగుమతిలో కంటే మాదకద్ర వ్యాల ఎగుమతి, దిగుమతి లోనా? ఎందులో ముందున్నది మనదేశం?

ప్రపంచవ్యాప్తంగా ఈసంవత్సరం ఇంతవ రకూ స్వాధీనంచేసుకున్న హెరాయిన్‌లో నాల్గ వవంతు ఒక్క మనదేశంలోనే లభించింది. ఈసంవత్సరంలో... బొంబాయిసమీపంలో... "తాల్‌సారి'' అనేగ్రామంలో ప్రపంచంలో మొ దటిసారిగా అత్యధికపరిమాణంలో ఆరువంద లరెండుకిలోల హెరాయిన్ పట్టుబడింది. ఇది ఇంకా ముందు ముందు భయంకరంగా పెరిగే సూచనలు కన్పిస్తున్నాయి.

స్నేహితుడా! ఆలోచించు. ఇన్నాళ్లు తప్పు దోవలో నడిచిఉండవచ్చు! దారితప్పి ఉండవ చ్చు. కాని, ఇపుడు మారు ! దారిమార్చు! కొత్త సమాజంవైపు దారితీయి! నవోదయానికి నాందిపలుకు. ఆరిపోతున్న యువజ్యోతిని రక్షించు. చైతన్యదీపికలకు చేయూతనివ్వు. ఆరోగ్యకరమయిన సమాజానికి నీ వంతు కర్త వ్యంగా అండగా నిలువు!''

అతను చెప్పటం ఆపాడు. అతనివంకే కళ్లువిప్పార్చుకుని చూస్తున్న చెందూ హృద యంలో అలజడి మొదలయింది.

గుండె చిత్రంగా స్పందిస్తోంది. మనసు లయబద్ధంగా ఊగుతోంది.

వాళ్లు ముగ్గురూ బాగ్‌లు సర్దుకునిలేచారు.. చెందూ కూడా లేచాడు నెమ్మదిగా. క్రిందపర చిన దుప్పటిని తీసి మడతపెట్టి బాగ్‌లో సర్దుకున్నారు వాళ్లు. ఆముగ్గురిలో రెండవ యువకుడు భుజానికి తగిలించుకున్న సంచి లోనుండి చిన్నపుస్తకంతీసి ఇస్తూ అన్నాడు.

"ఫ్రెండ్! ఈపుస్తకం చదువు.''

కంపించే చేతులతో చెందూ ఆపుస్తకం చేతిలోకి తీసుకున్నాడు.

చెందూ భుజంతట్టి ముందుకు నడిచారు

వాళ్లు! భుజాన ఎయిర్‌బాగ్‌లతో, చేతులలో నంచీలతో... ముందుకు నడిచిపోతున్న ఆయువమూర్తులను... అలాగే చూస్తుండిపోయాడు చెందూ!

మళ్ళీ చేతిలోని పుస్తకం వైపు చూసాడు. ప్రశాంతంగా నిర్మలంగా...

* * *

రెండురోజుల తర్వాత ఉదయంవేళ. శాంతి అన్నయ్య వచ్చాడు. ఆయన పేరు నారాయణ. వయసు నలభయ్‌వరకూ ఉంటాయి. కొంచెంగా పల్లెటూరుయాస ఉంది మాటల్లో.



చందూ మామయ్యని పలకరించాడు.

నారాయణ చందూకి, శాంతి ఉత్తరంరాసి పిలిపించినట్లుగా చెప్పలేదు. పనిమీద వచ్చినట్లుగా వచ్చాడు.

మాటలమధ్యలో...తనతో ఊరురమ్మన్నాడు. కొన్నాళ్లుగడిపి రావచ్చని చెప్పాడు. శాంతి కూడా ప్రోత్సహించింది.

నిజమే! రిలీఫ్! కొంత రిలీఫ్!

ఈ ఆలోచనలకు, పరిసరాలకు, వాతావరణానికి దూరంగా, సుదూరంగా గడిపితే బాగుండేటట్లుఉంది.

Chinna.

ఏమో! తన ఆరోగ్యం కూడా బాగుపడుతుందేమో! నవ్వొచ్చింది! మళ్లీ ఆశ! ప్రయాణం అవడానికి సిద్ధపడ్డాడు. తేలికగా ఒప్పుకున్నందుకు శాంతి సంతోషించింది.




ఆ రాత్రికే ప్రయాణం!

మధ్యాహ్నంవేళ!

చందూ - తన గదిలో ఎయిర్‌బాగ్ సర్దుకుంటున్నాడు. మూడుజతలబట్టలకంటే ఎక్కువతీసుకెళ్లదలుచుకోలేదు.

సర్దుకుంటుంటే గుర్తుకువచ్చింది ఆపుస్తకం!

ఆ పుస్తకంకూడ తీసుకుని, భద్రంగాబాగ్‌లో పెట్టుకున్నాడు.

తల్లి వంటింట్లో పనిలో ఉన్నట్టుంది - అప్పుడు.

హాల్లో ఫోన్ మ్రోగింది.

చందూ వెళ్లబోయాడు - కానీ - ఇంతలో తల్లి అడుగులశబ్దంవిని ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

రిసీవర్‌తీసి...వింటున్న శాంత ముఖంలో గబగబా రంగులుమారిపోయాయి! మరుక్షణం ఆందోళనగా "ఎక్కడ! ఎక్కడ!" అని అరవసాగింది...

చప్పున గదిలోనుండి చందూవచ్చాడు.

"మమ్మీ! ఏమిటి? ఏమయింది?"

కంగారుగా దాదాపు ఏడుపు మిళితమైన స్వరంతో చెప్పింది.

"మీ డాడీకి హార్ట్‌ఎటాక్ వచ్చిందట! వెంటనేరమ్మని సుబ్రహ్మణ్యం అంకుల్ ఫోన్‌చేశారు!"

నారాయణ మామయ్య ఇంట్లో లేరు ఆసమయంలో! ఏవో బజారులో కొనాలని, బయటకు వెళ్లాడు. వెళ్లిగంటసేపయింది.

శాంతి, చందూ గబగబా తలుపులకి తాళంవేసి ఆటోలో బయలుదేరారు.

సుబ్రహ్మణ్యం ఇచ్చిన అడ్రస్ ప్రకారం - త్వరగానే పట్టుకున్నారు హాస్పిటల్‌ని!

వెళ్లేసరికి - ధనుంజయరావు నీరసంగా బెడ్‌మీద పడుకుని ఉన్నాడు. ముఖమంతా...నల్లగా కమిలినట్లుగాఉంది. ఒక్కసారిగా వృద్ధాప్యంమీద పడినట్లుగా ఉంది.

శాంతి కళ్లల్లో నీళ్లుతిరిగాయి.

బెడ్‌మీద కూర్చుని, భర్తగుండెమీదచెయ్యి పెట్టి రాయసాగింది.

చందూ దూరంగా నించుని చూస్తున్నాడు.

ధనుంజయరావు వీళ్లిద్దరినీ ఒకసారిచూసి, మళ్లీ నీరసంగా కళ్లుమూసుకున్నాడు. ఆయనకి కొంతదూరంలో సుబ్రహ్మణ్యం, 'శాంతి ఎంటర్‌ప్రయిజెస్'లో పనిచేసే క్లర్కునించుని ఉన్నారు.

కాసేపటికి చెప్పాడు సుబ్రహ్మణ్యం నెమ్మదిగా!

మామూలుగానే బిజినెస్ వ్యవహారాలు అవీచూసుకుంటూ ఫైలుతిప్పుతున్న ధనుంజయరావుకి ఒక్కసారిగా వెక్కిళ్లువచ్చాయట! నిజానికి అవివెక్కిళ్లు కాదు! పక్కనేఉన్న క్లర్కుకి అలా అనిపించింది!

హార్ట్‌ఎటాక్! గుండె ఒక్కసారిగా బిక్కపట్టిపోయి...రెండు క్షణాలసేపు అసలుమాటకూడ మాట్లాడకుండా అలాగే ఉండిపోయాడట! ముఖమంతా ఎర్రగాకందిపోయింది!

క్లర్కుకి కంగారుపుట్టి వెంటనే సుబ్రహ్మణ్యానికి ఫోన్‌చేసి, ఇటు హాస్పిటల్‌కి తీసుకువచ్చాడట! డాక్టర్ చెప్పాడు! విపరీతమయిన ఆలోచనలు, ఆందోళన...బి.పి...ఇవన్నీ గుండెనొప్పికి దారితీశాయి!

ఇవన్నీ వింటున్న శాంతి మాట్లాడలేదు. నిజమే! ఎప్పుడూ ఆలోచనలు! ఆందోళన! కోపం!

హాస్పిటల్‌లో దాదాపు గంటసేపుఉన్నారు. డాక్టర్ సలహామేరకు ఇంటికి తీసుకువెళ్లారు టాక్సీలో!

వెనకసీట్లో శాంతి, చందూ కూర్చున్నారు. ముందు సీట్లోడ్రయివరు పక్కన సుబ్రహ్మణ్యం కూర్చున్నాడు.

చందూఒడిలో తలపెట్టుకుని, కొంచెం వొరిగినట్లుగా, కళ్లుమూసుకుని పడుకున్నాడు ధనుంజయరావు. శాంతివైపు కాళ్లుముడుచుకుని ఉన్నాయి. టాక్సీ కదిలింది.

తండ్రి...కన్నతండ్రి...తనఒడిలో...తనని హత్తుకుంటూ...నీరసంగా...రెండు చేతులతో తన నడుము పట్టుకుంటూ...తనలో ఒదిగిపోతూ...

ఏమిటీ అనుభూతి!

ఎందుకు కళ్లు ఇలా చెమరుస్తాయి!

తనను కొట్టిన ఆరెండుచేతులూ తననడుముచుట్టూ పెనవేసి ఉన్నాయి ఆనరాగా!

అలసిపోయిన ఆముఖం తనఒడిలో సేద తీరుతున్నట్లుగా ఉంది. నెరసిపోయిన తల తనలో వొదిగిపోతోంది.

ఎందుకు మనసింతగా ఉద్విగ్నతకు లోనవుతోంది.

జన్మనిచ్చిన తండ్రి...అలసిపోయినట్లుగా కళ్లుమూసుకుని పడిఉన్నాడు ఒడిలో...నడెన్‌గా టాక్సీమలుపు తిరిగింది.

ముందుకు జారబోయిన తండ్రిని, ఒక్క ఉదుటున పొదివిపట్టుకుని ఒళ్లోకి లాక్కున్నాడు చందూ!

రెండు చేతులా తండ్రి శరీరంచుట్టూ పెనవేసి నడుముకు హత్తుకున్నాడు. గొప్ప అనుభూతి...మాటల కందని అనుభూతి...నరనరాల్లో ప్రవహిస్తోంది అణువణువునా పరుగులు పెడుతోంది.

"డాడీ..."చిన్నగా గొణిగాడు

అపుడు వచ్చింది ఒకకన్నీటిబొట్టు.

అంతే!

"డాడీ...డాడీ..." అంటూనే ఉన్నాడు. ఆ కన్నీటిబొట్టే ధారలై, వరదలై, జలపాతాలై కట్టలు తెగి ప్రవహించసాగింది.

పక్కనేఉన్న శాంతి, ముందు సీట్లోఉన్న సుబ్రహ్మణ్యం ఆశ్చర్యంగా తిరిగి చూశారు.

చందూ పట్టించుకోలేదు.

ఏదో ఉద్వేగం గుండెల్ని పట్టి ఊపేస్తోంది.

ఆ అనుభూతి, కలయిక ఇష్టంలేనట్లుగా...

తలఎత్తింది రాక్షసిలాంటి...నొప్పి...

శూలంపెట్టి పొడిచినట్లుగా...

"అమ్మా!" అనబోయి ఆగిపోయాడు అతికష్టంమీద.

ఆ నొప్పికి, రెండుచేతులూ వదిలేశాడు. మళ్లీచపున ఇంకాగట్టిగా పట్టుకుని దగ్గరికి పొదవుకున్నాడు.

నొప్పిక్రమక్రమంగా అధికమవసాగింది.

అయినా తండ్రిని హత్తుకుంటుంటే ఆబాధ అనిపించడంలేదు.

ఆ అనుభూతిముందు తెలియడంలేదు ఆబాధ.

తను బాధపడుతూ కూడా తండ్రికి ఆనరాగా ఉండటంలో ఎంత ఆనందం! ఎంత సంతృప్తి!

ఇంటి దగ్గరికి వచ్చింది టాక్సీ!

ఇంటికి వచ్చేసరికి, వాకిటగుమ్మంలో ఆందోళనగాచూస్తూ నారాయణ కూర్చునిఉన్నాడు.

టాక్సీరాగానే ఒక్కఉదుటునలేచి ఎదురువెళ్లాడు.

టాక్సీ తలుపుతెరుచుకుని ముందు సుబ్రహ్మణ్యం దిగాడు.

వెనక తలుపుతీశాడు!

ధనుంజయరావు నీరసంగా కళ్లుతెరిచాడు! ఆ కళ్లనిచూస్తూనే ఉలిక్కిపడ్డాడు!

ఎర్రగా ఉబ్బిపోయిఉన్నాయి కళ్లు...

నెమ్మదిగాలేచి, శాంతి ఆనరాతో, చందూభుజంమీద చెయ్యివేసి టాక్సీదిగాడు.

అపుడు చూసుకున్నాడు చందూ...

తొడమీదతడిసిన పాంట్‌ని! కన్నీళ్లతో తడిసిన పాంట్‌ని...

డాడీ...డాడీ...ఏడ్చారా?

జాగ్రత్తగా లోపలికినడిచాడు ధనుంజయ

రావు.

ఆ రాత్రికే ప్రయాణం! కాని బావగారంక అలాఉంటే ఎలావెళ్లేది అంటూ దిగాలుపడ్డాడు నారాయణ!

కాని శాంతికి ధైర్యంగానేఉంది. ఫరవాలేదని ఒప్పించింది. చందూకికూడా మనసు ఊగిసలాడుతున్నా బలవంతంగా తలఊపాడు.

రాత్రి భోజనాలుచేసి బయలుదేరారు! భోజనం చేస్తుంటే తల్లి ఎన్నోజాగ్రత్తలు చెప్పింది!

చందూకి మనసుఎందుకో అదోలా అయిపోయింది.

దిగులు. ఎపుడూ ఇలా అన్పించలేదు. ఎపుడూ ఈ ఫీలింగ్ రాలేదు. బాగ్‌భుజానికి తగిలించుకుని బయలుదేరుతుంటే...అన్పించింది.

ఒక్కసారిగా వెనుతిరిగి పరిగెత్తి తల్లిని కౌగిలించుకోవాలని.

డాడీని నోరారా పలకరించాలని...

అసలు ఇక్కడే ఉండిపోవాలని!

ఏమిటీ పిచ్చి! తన ఆలోచనలకు తనకే నవ్వొస్తోంది. నాలుగురోజులు ఉండివచ్చే ప్రయాణానికి ఏమిటీ ఆలోచనలు?

తల విదిలించాడు. గుండెమెలిపెడుతుంటే, అడుగు ముందుకేశాడు మామయ్యతో! వాళ్ళు కనుమరుగయ్యేవరకూ శాంతి వాకిట్లోనే నించుంది. చందూని వెనకనుండి చూస్తుంటే అన్పించింది

'పిచ్చి వెధవ! బాగా చిక్కిపోయాడు!'

★ ★ ★ ★

"చెందూ! ఏదయినా కావాలంటే అడుగు!" చెప్పాడు మామయ్య పడుకోబోతూ! చెందూ అలాగేనని తలూపాడు.

పై బెర్తుమీద మామయ్య!

క్రింద బెర్తుమీద చెందూ!

నెమ్మదిగా బయలుదేరింది ఎక్స్‌ప్రెస్ ట్రెయిన్!





కాసేపటికి స్పీడ్ అందుకుంది. బెర్త్‌కూడా లయబద్ధ ంగా కదులు తోంది. దుప్పటి తీసి మెడవరకు కప్పుకున్నాడు చెందూ! తల క్రింద ఎయిర్‌బాగ్ పెట్టుకున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది.

పైన నీలంబల్బు వెలుగుతోంది. అదో విధమయిన శబ్దంచేస్తూ ఫాన్లు తిరుగుతున్నాయి. ఆనిశ్శబ్దంలో... ధడ ధడమని శబ్దం చేస్తోంది రైలు... మధ్యలో గార్డు విజిల్స్... విన్పిస్తున్నాయి. నెమ్మదిగా కనురెప్పలు వాల్చాడు!

శరీరం లయబద్ధంగా కదులుతోంది. నిద్ర రావడం లేదుకాని, అదో విధమయిన మగత! నిద్రవచ్చీరాని స్థితి.

తలఅటూ ఇటూ విదిల్చి, ఇబ్బందిగా అటూ ఇటూ కదిలాడు.

ఊహు! లాభంలేదు. మనసంతా శూన్యంగా అదోలా ఉంది.

ఆలోచనలు... కందిరీగల్లా చుట్టు ముడుతున్నాయి.

బలవంతంగా కళ్ళు మూసుకొని దుప్పటి ముఖం మీదకి లాక్కున్నాడు.

పక్క బెర్త్‌మీది వ్యక్తి అపుడే గురకలు పెడుతున్నాడు. దాదాపు అందరూ నిద్ర పోతున్నట్లున్నారు. తనుతప్ప!

ప్రయత్నించాలి...

ఆలోచనలని అదిమిపెట్టి... మనసు ప్రశాంతం చేసుకోసాగాడు.

వెలుగుతున్న నీలంబల్బు... క్రమక్రమంగా... మసక మసకగా మారింది. ఫాన్ల రొదకి చెవులు కాసేపటికి అలవాటుపడ్డాయి.

దాదాపు పదినిమిషాలకి నిద్రలోకి జారుకున్నాడు...

నిశీధిని చీల్చుకుంటూ ముందుకు పరిగెత్తు తోంది రైలు...

పెద్దగా కూతపెడుతూ...

భయంకరంగా గర్జిస్తూ...

దాదాపు రెండుగంటల తర్వాత...

ఎవరో వెన్ను తట్టి లేపినట్లు... అమాంతం అంతెత్తున ఎగిరిపడి కళ్ళు తెరిచాడు చెందూ!

పచ్చరంగు బల్బు వెల్గుతోంది... సూటిగా

కిరణాలు కంట్లో సూదుల్లా పొడుస్తూ..

అదేమిటి? తను పడుకోబోయే ముందు బ్లూకలర్‌లో ఉన్నట్లు గుర్తు...

ఆకుపచ్చ మరింత తీవ్రంగా... ముదురు రంగుకు తిరిగింది.

ఉలిక్కి పడ్డాడు... ఇపుడు అక్కడఉన్నది బల్బుకాదు.

కళ్ళు... రెండు కళ్ళు.. ఆకుపచ్చ కళ్ళు...

అస్థిపంజరానికి ఉన్న ఆకుపచ్చ కళ్ళు...

సూటిగా తననే చూస్తున్నాయి. నవ్వుతున్నాయి..

గుండెఝల్లు మంది...

ఒక్కసారిగా కళ్ళు మూసుకొని... నెమ్మదిగా మళ్ళీ తెరిచాడు.

నీలం బల్బు మామూలుగా వెలుగుతోంది. తలతిప్పి చూసాడు. అందరూగాఢ నిద్రలో ఉన్నారు.

దుప్పటిని సరిచేసుకుని పక్కకి వత్తిగిల పోతుంటే...

అపుడు మొదలయింది...

కాళ్ళల్లోంచి... గజగజా వణికిస్తూ... వెన్నులో నుండి శీతల వాయువులు... పెనుతుఫానులు సృష్టిస్తున్నట్లు.. చలి... భయంకరమయిన చలి!

ఒక్కసారిగా చుట్టపెట్టిన ఆ చలికి మనిషి అమాంతం గడగడా వణికిపోయాడు.

పళ్ళ సందుల్లోంచి చల్లటిగాలి కోస్తూ బయటికి వస్తోంది. వెన్నులో ఏదో జరజరా పాకినట్లు అన్పిస్తోంది... చేతివేళ్ళు కొంకర్లు పోతున్నాయి.. ఎంత ఆపుకున్నా ఆగని వేడి నిట్టూర్పు బయటకు తన్నుకు వచ్చింది.

మనిషి... ఎంతగా ముడుచుకు పోయాడంటే, ఉండలా చుట్టుకు పోయిన శరీరంలో.. మోకాళ్ళు గడ్డానికి తగులు తున్నాయి..

శరీరం లో లోపలికి ముడుచుకు పోతున్నాడు...

చెయ్యి.. అలవోకగా తగిలింది ముఖానికి!

అదిరి పడ్డాడు!

కాలిన పెనంలా ఉంది ముఖం! సలసలా కాలిపోతోంది...

ముక్కుపుటాల్లోంచి వెచ్చటి ఆవిరి వస్తోంది. చెవుల్లోంచి గాలి దూసుకు పోతోంది... హెూరు... గాలి హెూరు...

ట్రెయిన్ ఏదో బ్రిడ్జిమీద నుండి వెళుతున్నట్లుంది. ధడధడమని శబ్దం చేస్తోంది. ఆ శబ్దమే కొన్నివేల గొంతులతో ప్రతిధ్వనిస్తోంది చెవులలో...

''అమ్మా...'' అన్నాడు ముడుచుకుపోతూ... తిరిగి అదేమాట కొన్నివేల గొంతులతో ప్రతి ధ్వనిస్తోంది.

ఇదేమిటి...

కాళ్ళు సన్నగా... పుల్లల్లా అయిపోతున్నాయి? స్ప్రింగ్‌లా సాగిపోతున్నాయి?

చేతులు వెదల్పుగా సాగిపోతున్నాయి?

చప్పున లేచాడు.కాళ్ళవంక చూసుకున్నాడు మామూలుగనే ఉన్నాయి. బరువుగా మారిపోయిన చేతులు మామూలుగనే ఉన్నాయి.

హఠాత్తుగా...

గొంతు ఆర్చుకు పోవడం మొదలెట్టింది.

దాహం! దాహం! గొంతులో అగ్నిగోళం తిరుగుతున్న భావన...

ఆ బడబాగ్నికి.. కంఠనాళాలు తెగిపోతాయే మోనని భయం వేస్తోంది.

బెర్తుమీద నుండి లేచాడు.

ఒక్కసారిగా ఒళ్ళు తూలింది.

బలవంతాన నిలదొక్కుకుని బలవంతాన గుటకమ్రింగాడు.

తమతో వాటర్‌బాటిల్ తెచ్చిన గుర్తు లేదు.

మంచుముక్కలు అమాంతం మింగేయాలని పిస్తోంది.

ట్రెయిన్ నెమ్మదిగా స్లో అవుతోంది...

ఏ స్టేషన్ వస్తోందో తెలియదు...

షట్టర్ ఎత్తాడు. ఒక్కసారిగా చల్లటి గాలి విసురుగా ముఖానికి తాకింది.

గజ గజా వణికి పోయాడు. అయినా తల తిప్పకుండా చూసాడు.

చీకట్లో స్టేషన్ పేరు తెలియడంలేదు.

కాని తమ కంపార్ట్‌మెంట్‌కి దగ్గరలోనే నీటి పంపు ఉంది...

తలెత్తి చూసాడు. మామయ్య గాఢనిద్రలో ఉన్నట్లున్నాడు. అటు తిరిగి పడుకున్నాడు. అందరూ నిద్రపోతున్నారు.

మామయ్యని లేపదలుచుకోలేదు.

ఎంతసేపు? నీరసంగా ఉన్నా ఫరవాలేదు! దిగి... మంచినీళ్ళు తాగి రాగలడు.

ట్రెయిన్ స్లోఅయి నెమ్మదిగా ఆగింది.

గేటువైపు నడిచి తలుపుతీసి ప్లాట్ ఫాంమీదికి అడుగు పెట్టాడు.

ఒక్కసారిగా చల్లటి వానగాలి కౌగిలించుకుంది.

ఆపాద మస్తకం వణికి పోయాడు.

పంపువైపు నడుస్తూ పరిసరాలని కలియ చూసాడు...

ఒక మాదిరి స్టేషన్.

అర్థరాత్రి అవడంవలన ప్లాట్‌ఫాం అంతా నిర్మానుష్యంగా ఉంది.

చీకటిగా కూడా ఉంది. ఎక్కడో ఓమూల రెండు ట్యూబ్ లైట్లు వెల్గు తున్నాయి.

దూరంగా స్టేషన్ మాష్టరు కాబోల్ను నించుని ఉన్నాడు. కాసేపు ఉండి, లోపలికి తన కేబిన్‌లోకి వెళ్ళిపోయాడు.

కీచురాళ్ళ రొద...

పంపు దగ్గరవంగి.. దోసిలినిండా నీళ్ళు పట్టుకుని ముఖం తుడుచుకున్నాడు.

నరాలన్నీ జివ్వున లాగాయి, ఆ చల్ల దనానికి.

మళ్ళీ దోసిలిలోకి పట్టుకుని త్రాగాడు.

హిమవన్నగం మీద నుండి జారిన గంగ లాగ.. చల్లగా.. గొంతులోకి దిగాయినీళ్ళు... మళ్ళీ తాగాడు...

తాగి, పంపు కట్టేసి, వెనుతిరగ బోతుంటే...

సూదిమొనలా మొదలయి.. గునపంతో పొడుస్తున్నట్లుగా... ప్రారంభమయింది నొప్పి...

ఒక్కసారిగా చెందూలో తూలుడు వచ్చింది.

బలంగా చెయ్యి పొత్తికడుపు మీదవేసి అదిమి పట్టాడు. కళ్ళ వెంబడి నీళ్ళు ఒక్కసారిగా ఉబికాయి.

అసలునొప్పి అపుడు ప్రారంభమయింది.

ఒక అగ్నిజ్వాల... నాలుకలు జాపుకుంటూ... శరీరాన్ని కబళిస్తూ... బయలు దేరింది, బొడ్డు దగ్గరనుండి.

ఆ నొప్పి భరించడం అసాధ్యం అయిపోయింది.

"అమ్మా!" అన్నాడు బాధగా... బలవంతంగా నొప్పి అదిమిపెట్టి ముందుకు అడుగువేయ బోతుంటే విన్పించింది.

మొదటగా గార్డు విజిల్...

అదిరిపడ్డాడు. వెర్రివాడిలా చూసాడు.

గబగబా నడవబోయాడు. కేవలం పది అడుగుల దూరంలో ఉంది ట్రెయిన్. నరాలన్నీ ఒక్కసారిగా మెలితిరిగి ఉండలు చుట్టుకు పోయినట్లయింది.

ఒక్క అడుగు ముందుకు పడటం... బ్రహ్మప్రళయంగా ఉంది.

ఆ టెన్షన్‌కి... ఆయాసం వస్తోంది.

ముఖమంతా చెమటలు పట్టాయి.

నెమ్మదిగా కదిలింది ట్రెయిన్ బరువుగా!

ఆరుఅడుగుల దూరంలో ఉన్నాడు చెందూ.

బలవంతాన నోరుపెగల్చుకుని అరిచాడు "మామయ్యా!"

కళ్ళు తిరిగిపోతున్నాయి. క్రమంగా ఒళ్ళు స్వాధీనం తప్పుతోంది.

బలవంతంగా చేయిపట్టుకుని వెనక్కి లాగుతున్న భావన...

"మామయ్యా... మామయ్యా... " చిన్న పిల్లాడిలా దాదాపు ఏడుస్తూ పిలిచాడు.

అప్పటికే స్పీడందుకుంది ట్రెయిన్...

కళ్ళముందే బరువుగా కదిలిపోతున్న ట్రెయిన్‌ని... నిశ్చేష్టుడయి చూస్తుండిపోయాడు చెందూ...

ఒంటరిగా...

నిర్మానుష్యమయిన ప్లాట్‌ఫాం మీద పిచ్చి చూపులతో నిలబడిపోయాడు.

కడుపులో.. పోట్లు మొదలయ్యాయి...

చల్లటిశీతగాలి... వానగాలి... వీస్తోంది. తలెత్తి చూశాడు.

ఆకాశం మేఘావృతమయిఉంది.

సన్నగా మెరుస్తోంది...

ఒంటరితనం భయమేస్తోంది.

కానీ... ఇపుడు... ఇపుడెలా?

పక్కకు తిరిగి... స్టేషన్‌మాష్టర్ క్యాబిన్‌వైపు నడవాలనుకున్నాడు.

కానీ... కాళ్ళు అక్కడే కూరుకు పోయినట్లు నిపిస్తున్నాయి. ఒక్క అడుగు ముందుకు వేసినా.. భయంకరమయిన నొప్పి... కుదిపి కుదిపి సుళ్ళు తిరుగుతోంది.

ఏడుపు తన్నుకు వస్తోంది. దానికితోడు చలి గాలి... వణికిస్తున్న వానగాలి... వెనక్కి చూసా డు...

పంపుకు అవతల... చిన్న సిమెంట్ బెంచీ ఉంది.

అతికష్టంగా దానివైపునడిచాడు. అక్కడకు రాగానే అప్రయత్నంగా ఆ బెంచీమీద వాలిపో యాడు.

చీకటి... నిర్మానుష్యం... కీచురాళ్ళరొద...

పైన కానుగచెట్టుమీద నుండి ఆకులు రా లుతున్నాయి. ముఖంమీదకి పడింది ఒక ఆకు... దానిని తీసుకోడానికిన్నాడా ఓపికలేన ట్లుగా బెంచిమీద వెల్లకిలా పడుకుండిపోయా డు.

పక్కకు తిరగాలంటే భయం... నొప్పి వస్తుందని...

కానీ... అలాగే పడుకుంటే చలి... భయంక రమైన చలి... శరీరాన్ని కోసే చలి. బల వంతంగా పళ్ళుబిగబట్టి పక్కకు తిరిగాడు.

అసలు పోరాటం అప్పుడు ప్రారంభమ యింది.

"అమ్మా..." అని అరవబోయిన కేక గొంతు లోనే ఆగిపోయింది. బయటకురాలేదు. ముడు చుకుపోయాడు... ఇంకా... ఇంకా... శరీరంలోకి కుంచించుకుపోతున్నాడు. చలిపులి...

ఒళ్ళంతా సాగదీసుకోవటం మొదలెట్టాడు. స్ప్రింగులా... నరాలు తెగిపోయేటట్టు... చేతు లు కాళ్ళు విరిగిపోయేటట్టు సాగదీయటం ప్రా రంభించాడు.

చెప్పలేని హింస... భయంకరమయిన బాధ. అమ్మా! అని అరవటానికి కూడా ఓపికలేని

పరిస్థితి.

గుండెల్లోనుండి బయలుదేరిన జ్వాల. గొంతులో సుడిగుండంలా సుళ్ళు తిరిగి.. అగ్ని గోళంలో.. నిప్పుబంతిలా... సెగలు జిమ్ము తూ... ప్రచండమయిన తీక్షణతతో, గొంతులో నుండి బయటపడటానికి ప్రయత్నిస్తోంది.

ఆ వేడికి తట్టుకోలేనట్లుగా రెండు చేతు లతో గొంతునొక్కుకోసాగాడు బలవంతంగా.

కంఠం నల్లగా కమిలిపోయింది.

పదమూడు నిముషాల భయంకర పోరా టంలో మృత్యువు విజయంసాధించింది. నిశ్శ బ్దంగా ఆ చీకటిలో కలిసిపోయింది.

చెందూనోరు తెరుచుకుని అలాగే ఉండిపో యింది.

కుడిచెయ్యి సిమెంట్‌బెంచి సందులో నుండి కిందికి వేలాడుతోంది. నిర్జీవమయిన ఆ శరీరం మీద కానుగచెట్ల ఆకులు రాలుతు న్నాయి నెమ్మదిగా...

చెందూ శరీరాన్ని మొదట చూసింది.. ఓ రైల్వేపోర్టరు!

తెల్లవారుఝామున... వచ్చాడతను.

సాధారణంగా చాలా మంది అలా బెంచీ మీద పడుకుని నిద్రపోవడం మామూలే! కాని చెందూ పడుకున్న తీరు సహజంగా లేదు. అదోలాఉంది.

అనుమానంగా... చెందూ శరీరంమీద చె య్యివేసిన పోర్టరు అదిరిపడ్డాడు.
ముట్టుకున్నా చల్లగా ఉంది ఆ శరీరం.

దూరంగా... వస్తోంది ట్రెయిన్... కూతకూ స్తూ...

అదేట్రెయిన్‌లో నారాయణ వస్తున్నాడు. తిరిగి మళ్ళీ...

ప్లాట్‌ఫాంమీద ఆగిన ట్రెయిన్ నుండి ఆత్రు తగా... ఆందోళనగా చూస్తున్న నారాయణ కళ్ళకు...

గుమిగూడిన మనుషుల మధ్యనుండి...

సిమెంట్ బెంచి మీద పడిఉన్న... చెందూ శరీరం కన్పించింది.



# చతురకతలు

## అసలు నేరస్థుడు...?

రాజారావు డిగ్రీ పాసై రెండేళ్ళయింది. ఈ రెండేళ్ళలోనూ రాజారావు తనకు కావాల్సిన ఉద్యోగం సంపాదించడానికి అహోరాత్రులూ కృషిచేస్తు న్నాడు.

అతడి చిన్నప్పటి నుండే రాజారావుకి ఓ వింత కోరిక ఉండేది-అదే... ఎప్పటికైనా రైల్వే ఉద్యోగం చేయాలని.

అందుకనే కేవలం రైల్వే ఉద్యోగాలకే అప్లై చేయసాగాడు డిగ్రీ పూర్తిచేసిననాటి నుండి.



చిట్టచివరకు రైల్వేలో టి.టి.ఇగా సెలెక్ట్ అయ్యాడు.

ట్రైనింగ్ పూర్తిచేశాక అదృష్టవశాత్తు సొంత ఊరికి దగ్గర్లోనే పోస్టింగ్ చేశారు అధికారులు.

మొదటిరోజు డ్యూటీకి వెళ్ళబోతూ తల్లి దండ్రుల కాళ్ళకి నమస్కరించాడు రాజారావు.

మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు తల్లిదండ్రులు.

హైదరాబాదు నుంచి వాల్తేరు వెళ్ళే గోదావరి ఎక్స్‌ప్రెస్‌లో టికెట్స్ చెక్ చేసే బాధ్యత అప్పగించబడింది రాజారావుకి.

తన ఇష్టదైవాన్ని తలుచుకొని రైలెక్కాడు రాజారావు.

రిజర్వేషన్ కంపార్ట్‌మెంట్స్‌లో ఎలాటి ఇబ్బంది కలుగలేదతడికి.

రైలు ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు హడావిడిగా. దిగేవాళ్ళు మరింత గాభరాగా దిగుతున్నారు. వారితో తనకు పనిలేనట్లు రైలు తన గమ్యం వైపు దూసుకు పోతూంది.

నిద్రముంచుకొ స్తూంది రాజారావుకి.

విజయవాడ చేరేప్పటికి అర్ధరాత్రయింది. ఆ స్టేషన్లో ఓ కప్పు టీ తాగాకా నిద్రమత్తు కొంచెం తగ్గినట్లనిపించింది.

ఉత్సాహంగా జనరల్ కంపార్ట్‌మెంటువైపు సాగిపోయాడు రాజారావు తన విధి నిర్వహణ కోసం.

పెళ్ళిళ్ళ సీజన్ మూలంగా కంపార్ట్‌మెంట్ లన్నీ క్రిక్కిరిసి ఉన్నాయి.

తన బూటుకాలికింద మరెవరి కాలూ నలిగి పోగూడదన్న సదుద్దేశంతో జాగ్రత్తగా అడుగులు తూచితూచివేస్తూ టికెట్స్ తనిఖీ ప్రారంభించాడు రాజారావు.

రైలు ప్లాట్‌ఫారం విడిచి పెట్టింది భారంగా.

లావెట్రీ దగ్గరున్న ఓ సింగిల్ సీట్లో ఇద్దరు వ్యక్తులు కునికిపాట్లు పడుతున్నారు.

"ఏయ్ మిస్టర్! టిక్కెట్స్ తియ్యండి" అడిగాడు రాజారావు అందులో ఒకడ్ని తట్టిలేపుతూ.

అతడి అరుపుకాఇద్దరు యువకులు గబుక్కున కళ్ళు తెరచి చూశారు. వారిలో గళ్ళచొక్కా, తెల్లఫాంటు వేసుకొన్న యువకుడు రాజారావుని చూస్తూనే ఒక్క ఉదుటున కదుల్తోన్న రైల్లోంచి బయటకు దూకి పరుగులంకించుకొన్నాడు.

అతణ్ణి విడిచిపెట్ట కూడదనుకొన్నాడు రాజారావు. గొలుసులాగి రైలాపి ఆ యువకుడి వెంటపడ్డాడు.

చీకట్లో పట్టాల వెంబడి పరుగెత్తడం కష్టంగా వుంది.

అయినా తన డ్యూటీలో చేరిన మొదటిరోజునే ఓ కేసు పట్టుకోగలుగుతున్నానన్న ఉత్సాహంతో ఆ యువకుణ్ణి వెంటాడసాగాడు రాజారావు.

ఓ అరగంట తంటాలుపడ్డాక రాజారావు చేతికి చిక్కాడా యువకుడు.

"ఇంకెక్కడికి పోతావ్? నిన్ను పోలీసులకు అప్పగించి తీరుతాను" అన్నాడు. అతడి కాలరు గట్టిగా పట్టుకొంటూ రాజారావు.

"ఎందుకుసార్? నేనేం నేరం చేశాను?"

"ఎందుకా...? టిక్కెట్‌లేకుండా ప్రయాణంచేయడం నేరంకాదూ...?"

"భలేవారే! ఇదిగో టికెట్" వెనక జేబులోంచి టికెట్‌తీసి రాజారావు చేతిలో పెడ్తూ చెప్పాడా యువకుడు.

- రాజారావుకి కళ్ళు తిరిగినంత పనయింది.

"టికెట్ ఉండగా నన్ను చూసి అలా పరుగెత్తా వెందుకు మరి?" ఆశ్చర్యంగా అడిగాడు.

అసలు విషయం నెమ్మదిగా గొణుగుతున్నట్లు చెప్పాడా యువకుడు రాజారావుతో.

"నా పక్కన కూర్చొని వున్న నాస్నేహితుడి దగ్గర టిక్కెట్ లేదు. వాడికి కూడా కొన్నానని దబాయించాను లెండి."

# ఎత్తు

చదువు పూర్తికాగానే హైదరాబాద్‌లో ఓ ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం సంపాదించుకోగలిగాడు సుబ్బారావు.

సంవత్సరం తిరక్కుండానే ప్రమోషన్ కూడా సంపాదించిన సుబ్బారావును చూసి తల్లిదండ్రులు పొంగిపోయారు. స్నేహితులు గర్వపడ్డారు.

అయితే అతడి బామ్మమాత్రం దుఃఖించింది. మనవడు బెండకాయలా ముదిరిపోతున్నందుకు. ఆమె దుఃఖం చూడలేక సుబ్బారావు తండ్రి కొడుక్కు తగ్గ సంబంధం వెతికి పట్టుకోవడానికి బయల్దేరాడు.

ఎలాగయితేనేం ఓ మంచి సంబంధం చూడగలిగాడు. అమ్మాయిపేరు సుబ్బలక్ష్మి.

సుబ్బలక్ష్మి అందగత్తెకావటంతో సుబ్బారావుకీ మొదటి చూపులోనే నచ్చింది.

సుబ్బలక్ష్మి తండ్రి యిస్తానన్న కట్నం సుబ్బారావు తల్లికి నచ్చింది.



లాంఛనాలు, వియ్యంకుడి హోదా సుబ్బారావు తండ్రికి నచ్చాయి.

వారి వంశగౌరవం, పరువు మర్యాదలు సుబ్బారావు బామ్మను మెప్పించాయి.

దాంతో సుబ్బారావు సుబ్బలక్ష్మి మెళ్ళో మూడుముళ్ళువేసి మరునాటి నెల కాపురానికి పంపించమని అత్తగారితో గట్టిగా చెప్పి హైదరాబాదు రైలెక్కాడు.

రైలెక్కాక చూసుకుంటే శరీరం తేలిగ్గా ఉన్నట్లు నిపించింది. కాసేపయాక ఆలోచించి చూస్తే తన హృదయం సుబ్బలక్ష్మి దగ్గర వదిలేసి వచ్చినందువల్ల శరీరం బరువు తగ్గినట్టుందని అర్థమయిందతనికి.

అప్పటి వరకూ తన రూం పంచుకొని తనతో సహవాసం చేసిన మిత్రుడు లోకనాథానికి టాటా చెప్పి అద్దెయింటి వేటలో పడ్డాడు సుబ్బారావు.

వారం రోజులు వెతగ్గా, వెతగ్గా ఓ మూడు గదుల చక్కటి యిల్లు దొరికింది.

అద్దెకూడా ఎక్కువగా లేదు.

ఆఫీసుకు నడిచి వెళ్ళవచ్చు! మేడమీద ఒకటే పోర్షన్. ఇంట్లో టాప్, బోరింగ్ ఉన్నాయి. సో, నీళ్ళ బాధలేదు. ఇంటావిడ డెబ్భై ఏళ్ళవయసులో దృఢంగా ఉంది తన బామ్మలా! ఆమెను చూస్తే బామ్మే గుర్తొస్తోంది సుబ్బారావుకు.

రెండు నెల్ల అద్దె ఆవిడ చేతిలో పెట్టి "ఆదివారం మా ఆవిడ్ని తీసుకొస్తాను బామ్మగారు!" అన్నాడు సుబ్బారావు.

"మంచిది నాయనా!" అంది బామ్మగారు. అతడందించిన నోట్లను [illegible]-

అన్నట్టుగానే మరునాటి ఆదివారం సుబ్బలక్ష్మిని తీసుకొని సామానుతోపాటు అద్దెయింట్లోకి చేరిపోయాడు సుబ్బారావు.

సుబ్బలక్ష్మిని చూస్తూనే "పెళ్ళి లక్ష్మిలా కళకళలాడుతోంది!" అంటూ దగ్గరకు తీసుకొంది బామ్మగారు. ఆ రాత్రంతా వరకూ సామాను సర్దడమే సరిపోయింది వాళ్ళకు.

ఎప్పుడెప్పుడు భార్యను దగ్గరకు తీసుకొందామా? అని తెగ ఆరాటంగా ఉన్న సుబ్బారావు [illegible] అవురొన్నాడు.

[illegible]

మరుసటిరోజు గుమ్మంలోంచే "అమ్మాయ్! ఏదన్నా కావాలంటే మొహమాటపడకు" అంది సుబ్బలక్ష్మితో

ఒళ్ళుమండిపోయింది సుబ్బారావుకు.

తన ప్రైవసీకి ఈ విధంగా భంగం కలగడం యిష్టం లేక ఏం చేయాలో తోచక కోపాన్ని తనలోనే తమాయించుకొన్నాడు.

రెండోరోజూ, మూడోరోజు షరామామూలే!

సెలవుపెట్టి భార్యకౌగిట్లో కరిగిపోదామనుకొన్న సుబ్బారావు ఆశలన్నీ బామ్మగారి రాకపోకలతో ఛిన్నాభిన్నమయ్యాయి.

తన బాధ మిత్రుడు లోకనాథంతో చెప్పుకున్నాడు సుబ్బారావు.

ఓపిగ్గా అతడు చెప్పిందంతా విన్న లోకనాథం సుబ్బారావు చెవిలో ఓ ఉపాయం ఊదాడు.

ఆ రోజు ఆఫీసునుంచి హుషారుగా యింటికొచ్చాడు సుబ్బారావు.

ఎదురొచ్చిన భార్యను కౌగిట్లోకి తీసుకొని తన ఉపాయం ఆమెకు వివరించాడు.

"ఛ ఛ! పెద్దావిడ! తప్పండీ" అంది సుబ్బలక్ష్మి నొచ్చుకొంటూ.

"అయితే నీ ఖర్మ! అనుభవించు! నేను సన్యాసుల్లో కలిసిపోతాను" ఉక్రోషంగా అన్నాడు సుబ్బారావు.

"సరే! అలాగే కానివ్వండి!" అంది సుబ్బలక్ష్మి సుబ్బారావు ముంగమూతి చూసి జాలిపడి.

ఇంతలో "అమ్మాయ్ లక్ష్మీ!" అంటూ తలుపుకొట్టింది బామ్మగారు.

ఆ వెంటనే సుబ్బారావు- 'లక్ష్మీ! ఉదయం టేబుల్ మీద నేను మర్చిపోయి వెళ్ళిన పర్సు ఎక్కడ?' అని కేకేశాడు గట్టిగా.

'ఏం పర్సండీ?' అడిగింది లక్ష్మి.

"అందులో వెయ్యి రూపాయలుండాలి!"

"అయ్యబాబోయ్! నాకు కనబడలేదే...?"

'అయితే నేను వెళ్ళాక ఎవరన్నా వచ్చారా మన యింటికి?'

'ఆc! బామ్మగారు వచ్చి వెళ్ళారు! అన్నట్టు నా చెవిరింగులు తలంటుకుందామని తీసి ఇదే టేబుల్ మీద పెట్టా. నిన్నట్నుంచి కనబడ్డంలేదు!"

వింటున్న బామ్మగారు బెంబేలుపడి పోయారు. గబగబా మెట్లుదిగి తమ పోర్షన్లో కెళ్ళిపోయిందామె.

తలుపులుతీసి చూసిన సుబ్బారావు ఆనందంగా నవ్వుకున్నాడు.

-కె. హరిబాబు




ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా చతురల్లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర' **"చతుర సమీక్ష"** శీర్షికలో పాల్గొనే పాఠకులు 'చతుర'లో ప్రచురించే నవలపై ఏనెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల తమకు ఆనవల నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన మరికొన్ని ముఖ్యాంశాలు :

1. **'చతుర సమీక్ష'** కు పంపే మీ రచన అరఠావుకుమించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేలా పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈకింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **"చతుర సమీక్ష"** కు అని పేర్కొనాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మూడింటికి రు.100, రు.75, రు.50 చొప్పున, మరో మూడింటికి రు.25 చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచేల క్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొనేవంతు పాఠకులదే.

## కూపన్

ఏప్రిల్ 'చతుర' నవల : పావులు

సమీక్షకుని పేరు ..............................................

చిరునామా ..............................................

..............................................

..............................................

# ఏమిటా విధ్వంసకాండ?



కర్రలు కర్రలు కలిశాయి... మరుక్షణంలో పెద్దగోల... తిట్లు, అరుపులు, ఆక్రందనలు...

కాళ్లూచేతులు విరిగిపోతున్నాయి... తలలు పగిలిపోతున్నాయి... ఏడుపులు మిన్నుముట్టుతున్నాయి...

అంతలో... విజిల్లూదుకుంటూ, బూట్లశబ్దం చేసుకుంటూ, అందిన వాడినల్లా లాఠీలతో బాదుతూ పోలీసులు...

కొంతసేపు పరుగులు, అరుపులు, ఏడ్పులు...

మరికాసేపటికి గుడిసెల వెనుకనుండి పోలీసులమీద రాళ్లవర్షం...

అప్పుడు... తుపాకులు పేలిన చప్పుళ్లు... ఒకర్నొకరు తోసుకుంటూ, పడవేసుకుంటూ, తొక్కుకుంటూ పరుగులు...

రెండు నిముషాల్లో... అక్కడ పోలీసులు తప్ప ఎవరూలేరు. గుడిసెలు వెదుకుతూ, దొరికినవాడినల్లా వ్యాన్‌వేపు లాక్కుపోతూ, గస్తీ తిరుగుతూ పోలీసులు... వాళ్లకి ఆర్డర్లిస్తూ పోలీసు అధికార్లు...

ఏమిటా విధ్వంసకాండ? అది ఎవరెవరి మధ్య ఎందుకు జరిగింది?

ఉద్వేగభరితమైన సంఘటనలతో సామాన్యుల జీవన సంఘర్షణను ఆలోచనలు రేకెత్తించేలా చిత్రించిన

## యం.వి. తిరుపతయ్య నవల

# 'బతుకు'

మే నెల 'చతుర'లో చదవనున్నారు.

'చతుర' నవలల పోటీలో 'మంచి' నవలగా రూ.4000/-గెలుపొందిన రచన 'బతుకు.'

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad- 500016. TEL. 220728. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad- 500482

ఉగాది శుభాకాంక్షలతో

# ఏప్రిల్ 1 విడుదల

ప్రతి వ్యక్తి గుండె తలుపులూ ఓరవాకిలిగా తెరిచే ఉంటాయి, ఎవరి పాదాల సవ్వడి కోసమో ఎదురుచూస్తున్నట్లు!

పుస్తకం మూసిన తరువాతగూడా మీ గుండెల్లో సవ్వడిచేసే నవల—

ఆంధ్రుల అభిమాన రచయిత్రి

## శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి

తాజా డైరెక్టు నవల

# చీకటిలో చిరుదీపం

వెల Rs. 25/-

తప్పక చదవండి!

నేడే అడ్వాన్సుతోపాటు ఆర్డర్సు పంపండి—

## శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్

ఫోన్ - 63322

గవర్నరుపేట

విజయవాడ -520 002.

# బాంబినో
# ఇన్‌స్టెంట్ పాయసం



ప్యాకెట్టులోని ఇన్‌స్టాంట్ మిక్స్‌ని నీళ్లలో వేయండి.

7 నిమిషాలు కలుపుతూ వండండి.

రుచికరమైన చిక్కని పాయసం తయారు.

కుటుంబ సభ్యులను ఈ పాయసంతో ఆనందింప చేయండి.

ఇక ముందు మీరు మీ కుటుంబ సభ్యులకు ఇష్టమైన పాయసం తినాలని అనిపించినప్పుడు, మామూలు పద్ధతిలో పాయసంను చేసి శ్రమపడే కన్న బాంబినో ఇన్‌స్టాంట్ పాయసం ప్యాకెట్టు కొని త్రుటిలో రుచికరమైన పాయసం తయారు చేసి అందరూ ఆనందించండి.




"పసందైన పాయసం త్రుటిలో మీకోసం"




ఇన్‌స్టెంట్ పాయసం

రుచికరమైన సాంప్రదాయక పాయసం
నిమిషాలలో మీ కోసం!



associated/JFP/87